# మాయామాయి

సాహసోపేతమైన ఐంద్రజాలిక నవల



భోలానాథ్



దేశి కవితా మండలి
విజయవాడ - 2

# మాయామయి

## 1

అది సాయంకాల సమయం. ఆకాశం కొద్దికొద్దిగా ఎర్రగా కనుపిస్తోంది. ఒకకొండ ప్రక్కన నిశ్శబ్దముగా నున్న మైదానములో ఇద్దరు వ్యక్తులుకూర్చున్నారు. అందులోఒకడు వీరేంద్రసింహుడు, మరొకడు తేజసింహుడు. ఇద్దరూ ఒక రాతి బండమీద కూర్చొని పరస్పరం సంభాషించుకొంటున్నారు.

వీరేంద్రసింహుని వయస్సు ఇరవైఒకటో, ఇరవైరెండో వుంటుంది. ఇతడు నౌగఢ చక్రవర్తియైన సురేంద్రసింహునికి ఒక్కగా నొక్కకొడుకు. తేజసింహుడు సురేంద్రసింహుని మంత్రియైన జీతసింహుని ప్రియపుత్రుడు. అంతేగాక యువకుడైన వీరేంద్రసింహునికి ప్రాణమిత్రుడుకూడ. తేజసింహుడు మంచిచురుకైనవాడు. రొండిన కత్తి, చంకన సంచి వ్రేలాడవేసుకుని, చేతిలో తాడుచుట్ట పుచ్చుకొని వున్నాడు. అతడు నాలుగుదిక్కులు కలయజూస్తూ వీరేంద్రసింహునితో మాట్లాడుతున్నాడు. వీళ్ళిద్దరికి వెనుకగా ఒకగుఱ్ఱము చెట్టుకు కట్టి వేయబడివుంది.

"తేజసింహా!" అని వీరేంద్రసింహుడు చెప్పటం మొదలుపెట్టాడు.

"ప్రేమ ఎంత విచిత్రమైందో చూచావా? అది మనల్ని ఇంతదాకా తీసుకొచ్చింది. నువ్వు అనేకసార్లు విజయగఢ వెళ్ళి రాజకుమారియైన చంద్రకాంత వ్రాసిన ఉత్తరాలు

నా దగ్గరకు తీసుకొచ్చావు. నా ఉత్తరాలు ఆమెదగ్గరకు చేర వేశావు. దీనివల్ల నేను చంద్రకాంతను ఎంత గాఢంగా ప్రేమిస్తున్నానో అంత గాఢంగానూ ఆమె నన్ను ప్రేమిస్తోందని స్పష్టమైంది. ఆమె రాజ్యానికీ మనరాజ్యానికీ మధ్య ఐదుకోసుల దూరం మాత్రమే వున్నా మనమేమీ చేయలేకపోతున్నాం. చంద్రకాంత యీ ఉత్తరములో 'ఏ విధంగానైన వచ్చి కలువు' అని వ్రాసింది చూడు."

వీరేంద్రసింహుడు చెప్పిన మీదట తేజసింహుడు అతనికి సమాధానంగా "నేను ఏవిధంగానైనా మిమ్మల్ని అక్కడికి తీసుకొని వెళ్ళగలను. కాని చంద్రకాంత తండ్రియైన జయసింహ మహారాజు యీ మధ్య అంతఃపురానికినాలుగుదిక్కులా గట్టి బందోబస్తు చేశాడు. అతని మంత్రికొడుకు క్రూరసింహుడుకూడ చంద్రకాంతపై ఆసక్తి కలిగి వుండటంవల్ల తన యిద్దరి సహచరులను కావలాపెట్టాడు. దానికి కారణం నీవు చంద్రకాంతను ప్రేమిస్తున్న సంగతి అతని సహచరులైన నాజిం ఆలీ, అహ్మద్ ఖాన్ లకు తెలియటమేగాక క్రూరసింహునికి కూడా బాగా తెలుసు. చంద్రకాంతకు క్రూరసింహుడంటే ఏమాత్రం యిష్టములేదు. ఆమె తండ్రికికూడా కన్నకూతుర్ని తన మంత్రి కొడుకుకి భార్యగా చేయటం ఇష్టంలేదు. ఏమైనప్పటికి క్రూరసింహుడు మాత్రం చంద్రకాంతమీద ఆశ వదులుకోకుండా మీరు అడ్డురావటాన్ని తలనొప్పిగా భావిస్తున్నాడు. తన తండ్రిద్వారా మీరు చంద్రకాంతను వెంటాడే సంగతి జయసింహ మహారాజుకు కూడా తెలియపరచాడు. ఆ కారణంచేతనే ఇప్పుడు యీ బందోబస్తు ఏర్పాట్లు జరి

గాయి. ఇటువంటి సందర్భములో నేను అక్కడకు వెళ్ళి కాపలా వాళ్ళను బంధించకుండ మిమ్మల్ని అక్కడకు తీసుకొని వెళ్ళటం మంచిదికాదు.

ఇప్పుడు నేను విజయనగర వెళతాను. చంద్రకాంతను ఆమె చెలికత్తెయైన చపలనూ కలుస్తాను. చపల చంద్రకాంతను ప్రాణప్రదంగా భావిస్తుంది. ఆమె జిత్తులమారి కూడ. చపల తప్ప నాకు అక్కడ సహాయపడేవారు ఎవరూ లేరు. మన శత్రువుల ఎత్తులూ, కార్యక్రమాలు తెలుసుకొని తిరిగివచ్చిన మీదట మీరు వెళ్ళే విషయాన్ని గురించి నా అభిప్రాయం చెప్తాను. ఈ విషయాలన్నీ తెలుసుకోకుండా మనం అక్కడికి వెళ్ళి పట్టుబడటం మంచిదికాదు" అన్నాడు.

"నీకు ఏది మంచిదనితోస్తే అది చెయ్యి. నాకుమాత్రం కేవలం నా శక్తిమీదే నమ్మకంవుంది, నీకు నీ శక్తితోపాటు ఎత్తులువేయటంమీద కూడా నమ్మకంవుంది" అన్నాడు వీరేంద్రుడు.

"నాకు యీమధ్య జిత్తులమారులైన నాజిం, అహ్మదులు మన మహారాజు దర్శనం జేసుకొని వెళ్ళారని తెలిసింది. ఏ ఎత్తుతో ఇక్కడికి వచ్చారోకాని నేనుమాత్రం ఆసమయంలో లేకపోవటం దురదృష్టము" అన్నాడు తేజసింహుడు. వీరేంద్రుడు దానికి సమాధానంగా "నీవు క్రూరసింహుని జిత్తులమారుల సద్దరినీ బంధించాలని చూస్తున్నావు. వాళ్ళుచూస్తే నిన్ను బంధించే కార్యక్రమంలో వున్నారు. చివరి కేమౌతుందో ఆ దేవుడికే తెలియాలి!" అని "అయినా నీవిప్పుడు వెళ్ళి ఏవి

ఖంగానైనా చంద్రకాంతను నేను కలిసే ఏర్పాట్లు చెయ్యి"
అన్నాడు.

తేజసింహుడు హఠాత్తుగా లేచి వీరేంద్రసింహుని
అక్కడే వదలి విజయగఢ దిక్కుగా ప్రయాణం సాగించాడు.
వీరేంద్రుడుకూడా చెట్టుకు కట్టిన గుర్రాన్నివిప్పి దానిమీద
తన కోటదిక్కుగా వెళ్ళాడు.

# 2

విజయగఢలో క్రూరసింహుడు తన ఆలోచనా మంది
రములో నాజిం, అహ్మద్‌లతో కలసి సమాలోచనలు కొన
సాగిస్తున్నాడు. క్రూరసింహుడు "చూడు నాజిం, మన మహా
రాజుకి తాను రాజై మంత్రి కొడుకుని అల్లునిగా చేసు
కోవాలనే భావముంది. చంద్రకాంతేమో వీరేంద్రసింహుని
కోరుతుంది. ఇక నా కథ ఎట్లా అవుతుందో చెప్పు? చంద్ర
కాంతను తీసికొని పారిపోవాలంటే ఎక్కడికి వెళ్ళాలో, తోచ
కుండా వుంది. ఒకవేళ తీసుకొని వెళ్ళినా మహారాజు నా
తండ్రిని ఏంచేస్తాడో అని భీతి. దీనినిబట్టి మనమిప్పుడు వీరేం
ద్రునీ, అతని జిత్తులమారి తేజసింహునీ ఏవిధంగానైనా బం
ధించి శాశ్వతంగా కనుపించకుండా చేయటమే మార్గోపాయ
మనపిస్తుంది. దీని తరువాత సమయంచూచి మహారాజును
వధించే పని చూద్దాం. ఇక హఠాత్తుగా అప్పుడు నేను
సింహాసనాధిపతి నౌతాను. అప్పుడు చంద్రకాంతతో జీవన
మాధుర్యాన్ని అనుభవించుతాను. కాని నాజిం, మహారాజు

మరణానంతరం నేను సింహాసనాధిపతి నౌతానా ? ప్రజలు నన్ను రాజుగా చేస్తారా ?"

"మనరాజుకు ఇక్కడ చాలామంది మహమ్మదీయ శత్రువులున్నారు. వాళ్ళందరూ నీకు సహాయపడేలా చేస్తాను. మహారాజు తరువాత నిన్నే రాజుగా ప్రకటించే విధంగా మహమ్మదీయులతో వాగ్దానం చేయిస్తాను. కాని కార్యం పూర్తియైన తరువాత మా మతస్థులను రక్షించాలి" అన్నాడు నాజిం.

"అందుకు నీవేమి సందేహపడకు. ముందు పని జరుగనీ" అన్నాడు క్రూరసింహుడు.

"అయితే యీ విషయాన్ని నీవు లిఖితపూర్వకంగా మా చేతికివ్వు. దీనిని ముసల్మాను సోదరులందరికి చూపించి నీకు సహాయపడేలా చేస్తాను." అని అన్నాడు అహ్మద్.

క్రూరసింహుడు ఆవిధంగా వ్రాసి నాజిం, అహ్మద్‌ల చేతికందించాడు. ఆ పత్రాన్ని అందుకొని క్రూరసింహునితో అహ్మద్ "ఇప్పుడు మహమ్మదీయుల నందరినీ యేకంచేసే బాధ్యత మామీదపడింది. ఇక మీరు ఈ విషయాన్ని గురించి యేమాత్రం చింతించకండి. మీరు రాజైన తర్వాత మాయిద్దరినీ మంత్రులుగా నియమించుకుంటాననికూడా వాగ్దానంచేస్తూ యిదే సందర్భంలో మరొక పత్రంకూడా వ్రాసియివ్వండి. ఇక అప్పుడు మా యిద్దరి చాకచక్యం చూద్దురుగాని; ఈప్రపంచాన్ని త్రుటిలో తల్లక్రిందులు చేసిపారేస్తాం" అన్నాడు.

నాజిం, అహ్మాద్‌లు సంతోషపడేవిధంగా క్రూర సింహుడు ఆ ఒప్పుదలను కూడా లిఖితపూర్వకంగా వ్రాసి యిచ్చాడు.

అప్పుడు నాజిం "ఇక యిప్పుడు మేము చంద్రకాంత విశేషాలు తెలుసుకొనటానికి వెళతాం. సాయంకాలమైంది గనుక బహుశా యిప్పుడు చంద్రకాంత వనవిహారానికి వచ్చివుంటుంది. చపలతో తన విరహ వృత్తాంతాన్ని తెలియచేస్తూ వుంటుంది. దానినిబట్టి ప్రస్తుతం చంద్రకాంతా వీరేంద్రుల మధ్య యేమి జరుగుతోందో తెలుసుకోవచ్చు" అని ఉపాయం చెప్పాడు.

అందుకు క్రూరసింహుడు సమ్మతించగా జిత్తులమారు లిద్దరూ అక్కడనుంచి లేచిబైలుదేరారు.

# 3

పగటిప్రొద్దు యింకా కొద్దిగా వుంది. చెలికత్తెలైన చపల, చంపలతో చంద్రకాంత వనవిహారానికి వచ్చింది. మంద మంద వాయువులతో కలిసి విరుల సౌరభం ఉన్మత్తులను చేస్తోంది. రకరకాల పూవులు వికసించాయి. ఉద్యానవనానికి పశ్చిమంగా మామిడితోపు హృద్యంగమంగా వుంది. ఆ చెట్ల సందులనుండి అస్తమించే సూర్యుని పసిడికిరణాలు చూడటానికి వింతగొల్పుతున్నాయి. పూపొదరిండ్లపై నీళ్ళు చల్లారు. పూలచెట్ల కుదుళ్లు బాగా తడిపారు. ఒకచోట గులాబి, మరొకచోట సంపెంగ, ఇంకొకచోట మల్లెలు మొత్తంమీద వనమంతా మనోహరంగా వుంది. ఉద్యానవనానికి ప్రక్కగా

యెత్తయిన భవనమూ, సుందరమైన రెండుబురుజులూ శోభను చేకూరుస్తున్నాయి. చురుకైన చపల చంద్రకాంతను వెంట బెట్టుకొని ఆమెసౌందర్యాన్ని కీర్తిస్తూ సువాసనలు వెదజల్లే పూవులను త్రెంచి ఆమెచేతి కందిస్తోంది. అతి చంచలమైన చపల హావభావములకు చంద్రకాంత ముగ్ధురాలై పూవుల నందుకుంటోంది. కాని వీరేంద్రుని యెడబాటుతో దురపిల్లు తున్న చంద్రకాంతకు ఆమెమాట లంతగా రుచించటంలేదు. కాని ఆమె మనస్సును ఆహ్లాదపరుద్దామని చెలికత్తెలు బల వంతంగా వనవిహారానికి తీసుకొచ్చారు.

రెండవచెలికత్తె చంప దండను తయారు చెయ్యటానికి పూలు తెంచుకుంటూ మాలతీలతాకుంజంవైపుకి వెళ్ళింది. రాజకుమారి, చపల మాత్రం మెల్లమెల్లగా నడుస్తూ వన మధ్యంలోగల జలయంత్రం దగ్గరకు వెళ్ళారు. అక్కడ వాళ్ళి ద్దరూ కన్నులపండువుగా విచిత్రగతుల యెగిరే జలధారల్ని చూస్తూ వుండిపోయారు.

"చంప యెటు దిక్కుగా వెళ్ళిందో తెలియటంలేదు" అంది చపల.

"ఎక్కడో యిటూఅటూ తిరుగుతోంది" అంది చంద్ర కాంత.

"రెండుగంటలనుంచీ మనతో లేదు" అన్నది చపల.

"అదుగో వస్తుంది చూడు" అన్నది రాజకుమారి.

"ఎందుకో ఆమెముఖంలో మార్పు కనిపిస్తోంది!" అంది చపల.

ఇంతలో చంప వచ్చి చంద్రకాంత చేతిలో పూల చెండును వుంచి "ఎంత మంచి చెండును తయారుచేసి తెచ్చానో చూడు! ఈ సమయంలో వీరేంద్రసింహుడే గనక వుంటే, నా నైపుణ్యాన్ని మెచ్చుకొని నాకెంత బహుమాన మిచ్చే వారో!" అంది.

వీరేంద్రుని పేరు చెవినిపడేసరికి చంద్రకాంత శరీరం గగు ర్పొడిచింది. మేలుకొన్న పాతస్మృతులవల్ల ఆమెముఖం నల్ల బారింది. గట్టిగా శ్వాసతీసుకొంది. కళ్ళనుండి నీటిబిందువులు నేలపై రాలాయి. ఆమె గాద్గదికంగా—

"ఆ భగవంతుడు నా నొసట యేమి వ్రాశాడో? పూర్వజన్మములో నేను చేసినపాపఫలితాన్ని యిప్పు డీవిధంగా అనుభవించవలసివచ్చింది. నాన్నగారికి యేమి పట్టిందో కాని నన్ను కన్యగానే వుంచుతానని మొండికేశాడు. వీరేంద్రుని తండ్రి వివాహ యేర్పాట్లుకు యెంత ప్రయత్నించినా నా తండ్రిని దుష్టుడైన క్రూరసింహుని తండ్రి కుపథసింహుడు తన వలలో చిక్కించుకొని నాకు కీడు తలపెట్టాడు. మరొకవైపున కూరసింహుడు నా మెడలో ఉరిబిగించటానికి సర్వసన్నద్ధుడై క్రూర్చున్నాడు" అని విలపించింది.

అంతలో చపల చంద్రకాంతను మౌనంగా వుండమని సౌంజ్ఞ చేస్తూ ఆమె చేతిని నెమ్మదిగా నొక్కింది.

చపలయొక్క సంకేతాన్ని గ్రహించిన చంద్రకాంత మౌనం ధరించింది. తిరిగి చపల చేయిపట్టుకొని తోటలో తిరగనారంభించింది. అక్కడనుండి కదిలేముందు ఆమె కావా లని తన చేతిగుడ్డను అక్కడ దిగవిడిచి పోయింది. కొంత

దూరం వెళ్ళిన తర్వాత చంపతో "జలయంత్రం దగ్గర చేతి గుడ్డ మరిచానేమో చూచిరమ్మ"ని చెప్పింది.

ఆ ప్రకారం చంప వెళ్ళినతర్వాత రాజకుమారి "నేను మాట్లాడుతుంటే ఎందుకు ఆపావు?" అని చపలను ప్రశ్నించింది.

"రాజకుమారీ నాకు చంపపై యెందుకో అనుమానంగా వుంది; ఆమె మాటలను చూచినా, ముఖకవళికలు చూచినా అసలు మన చంప కాదేమోనని అనుమానంగా వుంది" అన్నది చపల.

ఇంతలో చంప చేతిగుడ్డను తీసుకొనివచ్చి చపల చేతి కందించింది. చంపను చూచి చపల "ఛెల్లీ! నిన్న రాత్రి నీకు నేను చెప్పినపని చేశావా?" అని అడిగింది. "నేను మరచి పోయాను" అన్నది చంప. "పోనీ ఆ మాటైనా గుర్తున్నదా? లేక అదికూడా మరిచిపోయావా?" అని తిరిగి ప్రశ్నించింది చపల. "లేదు, గుర్తున్నది" అన్నది చంప. "అయితే ఆ మాటేమిటో తిరిగి చెప్పు. నీకు గుర్తున్నదో లేదో చూద్దాం!" అన్నది చపల.

దానికి చంప తిరిగి సమాధానమియ్యకుండా మరొక విషయం మాట్లాడసాగింది. దానిమీదట ఆమె నిజమైన చంప కాదని తేలిపోయింది. చివరికి చంపను చపల "నీ కొక మాట చెప్పాలి రమ్మ"ని దూరంగా తీసుకొని వెళ్ళింది. అక్కడ యేదో మామూలు విషయాలు చెప్పి "చంపా! నీకు నా చెవినుండి దుర్వాసన రావటంలేదా? నిన్నటినుంచి యెందుకో యీ చెవ్వు నొప్పిగావుంది" అన్నది చపల. మాయారూపంలోని నా చంప చపల వలలో చిక్కుకొని

పోయింది. ఆమె వెంటనే చపల చెప్పును వాసన చూడసా గింది. జిత్తులమారి చపల అంతకుముందే తన చెవులో పెట్టు కొనివున్న మత్తుమందు చంపను స్పృహతప్పిపోయేటట్లుచేసింది. చంప నేలపై ఒరిగింది.

"రాజకుమారీ; యిటురా! మన చంప గతేమైందో చూడు." చపల చంద్రకాంతను పిలిచి చెప్పింది. చంద్రకాంత స్పృహతప్పిపడివున్న చంపదగ్గరికి వచ్చింది. గాభరాపడుతూ "చపలా! ఒకవేళ నువ్వు వూహించింది తప్పే అయి చివరికి చంపతో నగుబాట్లపాలు కాముగదా!" అన్నది రాజకుమారి. "ఆవిధంగా యెప్పటికీ జరగదు." అని చెప్పి చపల చంపను వీపుమీద వేసుకొని జలయంత్రందగ్గరకు తీసుకొని వెళ్ళింది. అక్కడ చంద్రకాంతతో దోసిలితో నీళ్ళుపొయ్యమని చెప్పి ఆమె ముఖాన్ని బాగా కడిగింది. కొద్దిసేపట్లో చంప ముఖం మారిపోయి నాజిం రూపురేఖలు బయటపడసాగాయి. అతణ్ణి చూడటంతోటే చంద్రకాంత ముఖం కోపంతో జేవు రించింది. "సఖీ; ఇతడు చాలా అసభ్యంగా ప్రవర్తించాడు." అంది చపలతో.

"ఇతణ్ణి యేంచేస్తానో చూడు." అని చపల అతణ్ణి వీపు మీద వేసుకొని తోటప్రక్కగా వున్న బురుజు క్రింది ఒక చీకటి కొట్టులోనికి తీసుకొనివెళ్ళింది. అతణ్ణి అక్కడ పడేసి తన మాయలమారిసంచిలోనుంచి ఒకకొవ్వొవత్తినితీసి వెలిగించింది. ఒక తాడుతో అతని చేతులు కాళ్ళు వీపుకు విరగదీసి కట్టింది. అంతట డబ్బా తీసి అందులో పొడుముకు సాజింపు వాసన చూపించింది. అతడావాసనకు గట్టిగా తుమ్మి తెలివి తెచ్చు

కున్నాడు. నిరాశ్రయుడై ఖైదీచెయ్యబడ్డాడు. తనకెదురుగా చపల కొరడా తీసుకొని నిలబడి వుండటం గమనించాడు. ఆమె అతణ్ణి కొరడాతో మోదటం ప్రారంభించింది.

"నేను తప్పుచేశాను; క్షమించు. ఇకమీదట ఎప్పుడూ యీవిధంగా చెయ్యను." అని నాజిం యేడ్వ సాగాడు. కాని చపల అతని మాటలు వినిపించుకోకుండానే కొరడా యెత్తిపట్టి "ఆగు; యింకా నీ వీపు దురద తీరలేదు! నీ విక్కడకు యెందుకొచ్చావు! ఉద్యానవనం గాలి బాగా వొంటబట్టిందా? యింకా యిక్కడ షికారులుకొట్టాలని వుందా? పాపం! నీ కిక్కడ చపలవుండే సంగతి తెలియదు కాబోలు! విశ్వాసఘాతకుడా! నీ బాబు చెప్పాడని నువ్వీపని చేశావా? చూడు, నాడి రోగంకూడా కుదురుస్తాను." అని చెప్పి తిరిగి కొట్టటం సాగించింది. కొంతసేపు తర్వాత" నిజం చెప్పు అసలు నువ్విక్కడ కెందుకొచ్చావ్; చంప యెక్కడి కెళ్ళింది?" అని ప్రశ్నించింది.

దెబ్బలకు తట్టుకొనలేక నాజింకు నిజం చెప్పక తప్పింది కాదు.

"చంపను నేనే స్పృహ తప్పిపోయేట్టు చేశాను. మత్తుమందు చల్లిన పూలగుత్తిని ఆమె వచ్చేదారిలో పెట్టాను. ఆమె దానిని వాసనచూచి పడిపోయింది. అప్పుడు నేనామెను మాలతిచెట్టు పొదలోకి లాగి ఆమె వేషం వేసుకొని మీ దగ్గరకు వచ్చాను. అంతే; అంతా చెప్పేశాను. ఇంక నన్ను విడిచిపెట్టు."

"ఆగు. విడిచిపెడ్తాను." అని చెప్పి చపలకొరడాతో యింకా పది వడ్డించి విడిచిపెట్టింది. చంద్రకాంతతో "వీణ్ణి కొంచెం చూస్తూవుండు. ఇంతలో నేను చంపను వెతికివస్తాను; ఈ పాపిష్టివాడు ఆమెను యింకెక్కడైనా దాచాడేమో!"

చంపను వెతుక్కుంటూ చపల మాలతీపొదదగ్గరకు వచ్చింది. అక్కడ వెతికిచూడగా చంప నగ్నంగా మాలతీ లతల్లో చిక్కుకొని పడివుంది. చపల తనదగ్గరి పొడుము వాసన చూపించి ఆమెకు తెలివొచ్చేలా చేసింది. "యెట్లా వుంది తల్లీ; బాగా తిన్నావా దెబ్బ!" పరిహాసంగా అన్నది చపల.

"నాకేంతెలుసు! యిక్కడ జిత్తులమారులు ప్రవేశిం చారని? ఇక్కడ పూలగుత్తొకటి పడుంటే తీసి వాసన చూచాను. పడిపోయాను. ఆ తర్వాత యేం జరిగిందో నా కేమీ తెలియదు. అయ్యో! నన్నెవరు స్పృహలేకుండా చేశారు? ఖరీదైన బట్టలుకూడా ఊడదీసుకొనిపోయారు!" అని చంప గోల పెట్టసాగింది.

అక్కడ పడివున్న నాజిం బట్టల్లో ఒకటిరెండు తీసి చపల చంప శరీరాన్ని కప్పింది. "నా వెంట రా! నిన్నీ స్థితికి తీసుకొనివచ్చినవాణ్ణి చూపిస్తాను!" అని చెప్పి చపల చంపను చంద్రకాంత నాజింలు వున్నచోటుకి తీసుకొని వచ్చింది. చపల నాజింను చూపిస్తూ "ఈమహానుభావుడే నీ కీ వరాన్ని ప్రసాదించింది!" అని చంపతో చెప్పింది. నాజింను చూచిన చంప కోపాన్ని ఆపుకోలేక "అక్కయ్యా! నా

కూడా పిడికి కొరడాతో నాలుగు వడ్డించి కోపాన్ని తీర్చు కోవాలని వుంది; సమ్మతిస్తావా?" అని అడిగింది.

"ఓ; తప్పకుండాను! నీమనసొచ్చినట్లుగా యీ కుక్కను చెప్పు తీసుకొని కొట్టు!" అని చపల తన ఆమోదాన్ని ప్రకటించడమే తడవుగా చంప కొరడా తీసుకొని నాజింను బలంకొద్దీ చాచ మోదటం ప్రారంభించింది. ఆ దెబ్బలకు నాజిం తారెత్తిపోయి లోలోపల క్రూరసింహుని నానాతిట్లూ తిట్టుకున్నాడు.

దౌర్భాగ్యుడైన నాజింను ఆ దే చీకటికొట్లో బంధించి ముగ్గురూ అంతఃపురం దిక్కుగా వెళ్ళిపోయారు.

ఇంతకథ జరిగిన ఆ వుద్యానవనం అంతఃపుర ప్రాంగణం లోనిదే! అందులోనూ అది ప్రత్యేకించి చంద్రకాంత విహారకు ఏర్పాటు చేయబడిందికూడా. దీనిచుట్టూ విద్రోహులైన ముసల్మానులు కాపలాకు నియోగించటంవల్ల నాజిం అహ్మద్‌లకు ప్రవేశించటం సులభమైంది. వాళ్ళ కుటిల వన్నాగానికి వీలు చిక్కిందికూడా.

## 4

తేజసింహుడు వీరేంద్రునివద్ద శలవు పుచ్చుకొని విజయగఢకు చేరుకొని చంద్రకాంతను కలవటానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. అప్రమత్తులైవున్న కాపలావారి ముందు అతని ప్రయత్నాలేమీ ఫలించలేదు. యేమి చెయ్యాలా అని ఆలోచిస్తున్నాడు. వెన్నెలరాత్రి. చీకటి రోజులన్నా అయితే

తాడు సహాయంతో అంతఃపురంలోకి ప్రవేశించవన్నా ప్రవేశించేవాడు.

చివరకి తేజసింహుడు ఒంటరిగా వెళ్ళి కాపలావాని వేషం వేసుకొని భవన ప్రాంగణంలోనికి ప్రవేశించాడు. అక్కడ తనలాంటివాళ్ళు అనేకమంది పహారాయిస్తున్నారు. అందులో ఒకణ్ణిచూచి "యేవోయ్! నేనుకూడా రాజుగారి నౌకరునే! ఇప్పటికి నాలుగుమాసాలనుంచి రాజుగారు నన్ను తనదగ్గర నౌకరీ వుంచుకున్నాడు. ఇప్పుడు కాస్త శెలవుదొరికింది. వెన్నెలరాత్రి ఆనందాన్ని అనుభవించాలని యిటు బయలుదేరాను. మీరు పొగాకు తాగటాన్ని చూచి నాక్కూడా తాగాలని బుద్ధిపుట్టింది. నల్లమందు తినేవాడికి పొగాకు ఎంత మజాగా వుంటుందో బహుశా మీక్కూడా తెలుసుననుకుంటాను!" అన్నాడు సరదాగా.

"అవునవును, రండి! కూర్చోండి; పొగాకు సేవించండి!"అని అక్కడ కాపలాదార్లంతా తేజసింహుని ముందు హుక్కా గొట్టం తెచ్చిపెట్టారు. "నేను హిందువుని కాబట్టి హుక్కా తాగనుగాని చేత్తోనే తాగుతాను"అని తేజసింహుడు చిలుముగొట్టాం తీసి పొగ త్రాగటం ప్రారంభించాడు.

రెండుపీల్పులు పీల్చేసరికి దగ్గు లంకించుకుంది. ఆ దగ్గు దగ్గు అతనికి నోటినుండి నుచ్చుళ్ళుకూడా వచ్చేటట్లు చేసింది. "ఓరి మీ దుంపలు తెగ! మీరు ఒట్టి చేదుపుగాకు తాగి యేడుస్తారల్లే వుంది నేనెప్పుడూ సర్కారుపొగాకు తప్ప యేదీ తాగి యెరగను. మహారాజుకి హుక్కా నాపేవాడితో స్నేహంకావటంవల్ల వాడు నాకెప్పుడూ రాజుగారుతాగే పొగా

కుయినప్పుడేవాడు, ఇకిప్పుడు నాకు అది తప్పితే మరొకటి రుచించకుండాపోయింది" అని చెప్పి కాపలావాని వేషంలో వున్న తేజసింహుడు తనబొడ్లోనుంచి ఒక చిలుము, పొగాకు తీసియిచ్చి "చూడండి; యీ పొగాకు యెట్లా వుందో!" అన్నాడు.

పాపం! కాపలావాళ్ళు రాజుగారు తాగే పుగాకును కలలోకూడా చూచి వుండరు! అందుచేత గభాలున చేతులు చాచి పుగాకును అందుకుని "నీ పుణ్యమా అని మేముకూడా రాజుగారుతాగే పొగాకు యిన్నాళ్ళకు తాగగలుగుతున్నాం. నువ్వెంత అదృష్టవంతుడవయ్యా! రాజుగారితోపాటు వుండి ఆయనతోపాటు రాజభోగాలు అనుభవిస్తున్నావ్!" అని పొగాకును బాగా చుట్టి తేజసింహుని ఎదుటకు తెచ్చారు. "మీరు ముందు వెలిగించండి; ఆ తర్వాత నేను తీసుకుంటాను అన్నాడు తేజసింహుడు.

అంతట హుక్కా వెలిగించబడింది; ఆతర్వాత గప్పాలు కొట్టటం ప్రారంభమైందికూడా.

కొద్దిసేపట్లో కావలాదారుల తలలు తిరగటం ప్రారంభించాయి. ఆ త్రాగటం త్రాగటం అందరూ స్పృహతప్పి పోయారు.

ఇంకేముంది; మన తేజసింహుడు సునాయాసంగా వాకిలిదాటి ఉద్యానవనంలో ప్రవేశించాడు. అతనికి యెదురుగా ఒక దాసీ చేతులో దీపం పుచ్చుకొని వస్తోంది. తేజసింహుడు చాటు చాటుగా దానిదగ్గరకు వెళ్ళి దాని మెళ్ళోకి తాడువిసిరి కిక్కురుమనకుండా క్రిందకు గభాలున పడేశాడు.

వెంటనే ఆమెకు స్పృహతప్పిపోయే పొడుమును వాసన చూపి దాసీదానిని ఒక ప్రక్కకు తీసుకొని వెళ్ళాడు. సంచిలో సామాను బయటికిలాగి ఒక కొవ్వువత్తిని వెలిగించి ఎదురుగా అద్దాన్ని పెట్టుకొని దాసీదాని వేషం వేసుకొన్నాడు. ఆ తర్వాత దానిని అక్కడే విడిచి దాని బట్టల్నిమాత్రం తాను ధరించి అంతఃపురం దిక్కుగా వెళ్ళిపోయాడు. అక్కడ చంద్ర కాంత చపల, చంప యింకా పదిమంది దాసీలతో కలసి సంభాషిస్తోంది. దాసీ వేషంలో వున్న తేజసింహుడు వాళ్ళల్లో ఒక ప్రక్కగా కూర్చున్నాడు.

"కేతకీ! నిన్ను పంపించిన పని పూర్తిచేసి వచ్చావా ? లేక మొదలకుండా వచ్చి కూర్చున్నావా ?" అని తేజసింహుని చూచి చపల ప్రశ్నించింది. ఆ ప్రశ్నవల్ల తేజసింహునికి తాను స్పృహతప్పి పోయేట్టు చేసిన దాసీపేరు కేతకీయని వెంటనే తెలిసింది.

"అవును; మీరు చెప్పినపని చెయ్యటానికే వెళ్ళు తుంటే దోవలో ఒక తమాషాజరిగితే మీకు చెప్పుదామని తిరిగివచ్చాను." అని మాయ కేతకి సమాధానమిచ్చింది.

"యేమి తమాషా చూచావో చెప్పు ?" అంది చపల.

"అందరినీ యిక్కడనుంచి పంపేస్తే ఆ తమాషా యేమిటో మీకు రాజకుమారికి విన్నవిస్తాను" అన్నది మాయ కేతకి.

దాసీజనాన్ని పంపించారు. అక్కడ కేవలం చంద్ర కాంత, చపల, చంప మాత్రం మిగిలివున్నారు. "బహుమాన మిస్తే శుభవార్త అందిస్తాను" అన్నది కేతకి నవ్వుతూ.

కేతకి యేదో వీరేంద్రసింహుని వర్తమానం మోసుకొచ్చిందని చంద్రకాంత అనుమానించింది. కాని ఆమె యెప్పుడూ వీరేంద్రుని వృత్తాంతం కేతకిముందు తీసుకురాని కారణంగా చంద్రకాంతకు ఏమైందీ అర్థంకాలేదు. ఆమెకు మొదట బహుమానపాత్రమైన ఆ శుభవార్త యేదో ఊహకందలేదు. చివరకి చంద్రకాంత "ఆ విధంగానే బహుమాన మిస్తాగాని ఆ వార్త మేమిటో చెప్పు"ని కేతకిని కోరింది.

"ముందు యిస్తేనే చెప్తాను. లేకుంటే వెళ్ళిపోతాన"ని కేతకి లేచి నిలబడింది.

కేతకియొక్క యీ వేషాలు చూచిన చపలకు వొళ్ళు మండి "యేమే కేతకీ! యివాళ నీ కేమొచ్చిందే అట్లా వాగుతున్నావ్! లేచి రెండు తన్నాలా యేమిటీ?" అన్నది.

"నువ్వు తన్ని తేపడటానికి నేనేమీ నీకంటే బలహీనురాలును కాదు." చపలకు జవాబుగా కేతకి వెంటనే అంది.

కేతకి మాటలకు చపల సహించలేక ఒక్క పరుగున వెళ్ళి ఆమెతో కలియబడింది. ఇద్దరిమధ్య గుద్దులాట ప్రారంభమైంది. ఆ పోట్లాటలో చపల చేయి ఆమెకు తెలియకుండానే కేతకి వక్షస్థలంమీద పడింది. అది కేతకి కాదనీ కేతకి రూపంలో వున్న పురుషుడనీ గ్రహించిన చపల గాభరాపడి వెంటనే పోట్లాట విరమించుకొని దూరంగా వెళ్ళిపోయింది.

"పారిపోతావేం; రా, పోట్లాడు." అని కేతకి నవ్వుతూ సవాలుచేసింది.

"జిత్తులమారీ! ఎవడవురానువ్వు? చెప్పు; లేకపోతే నీ ప్రాణాలు తీస్తాను." అని చపల కత్తి దూసింది.

అందుకు కేతకి సమాధానంకూడా యివ్వకుండానే వీరేంద్రుడు వ్రాసియిచ్చిన ఉత్తరాన్ని తీసి చంద్రకాంత చేతి కందించింది. చపల దృష్టికూడా ఆ ఉత్తరంమీదికి మళ్ళింది. ఆ లేఖలోని హస్తాక్షరాలు వీరేంద్రసింహునివని గ్రహించిన చపల ఆ వచ్చినవాడు తేజసింహుడని వెంటనే గ్రహించింది. తేజసింహునితో తప్ప యితరులెవ్వరితోనూ అటువంటి వుత్తరాలు పంపకూడదను సంగతి చపలకు లోగడనుంచీ తెలిసిన విషయమే. తేజసింహుని ప్రేమించివున్న చపలకు ఈ విషయం తెలియటంతోటే చెప్పలేనంత సిగ్గనిపించింది. అతని చాతుర్యాన్ని లోలోన ప్రశంసించుకుంటూ గాఢానురాగాన్ని పెంపొందించుకుంది.

చంద్రకాంత ప్రేమపూరిత హృదయంతో వీరేంద్రుని వుత్తరాన్ని చదువుకొని "తేజసింహా; ఆయనగారి ఆరోగ్యం బాగుందా?" అని ప్రశ్నించింది.

"ఎక్కడి ఆరోగ్యం తల్లీ! తిండి బొత్తిగా తినటంలేదు. రాత్రింబగళ్ళు నిన్ను తలచుకొని కన్నీరు మున్నీరుగా విలపిస్తున్నాడు. కళ్ళు కడుమ్మల్లా కదుములు కట్టాయి. ఎన్నివిధాల సముదాయించినా నిన్ను చూడకుండా ఆయన శాంతిగా జీవించలేడు. మీ రిచ్చిన వుత్తరం ఆయని కందించానో లేదో తిరిగి మళ్ళా నేనిక్కడకు రావలసివచ్చింది. అసలాయనే స్వయంగా యిక్కడకు రావటానికి ప్రయాణమైనాడు. అక్కడ పరిస్థితులన్నీ చూచి నీ కేవిధమైన అపా

యమూ జరక్కుండా అన్ని యేర్పాట్లూ చేసి నిన్ను తీసుకొని వెళ్ళటానికి వస్తానని నచ్చచెప్పి యిటు వచ్చాను. చాలా కష్టం మీద వొప్పుకొని నీ కీ వుత్తరం మాత్రం వ్రాసి యిచ్చాడు." అని తేజసింహుడు చెప్పాడు.

చంద్రకాంత ఇక్కడి పరిస్థితులన్నీ వివరించసాగింది.

"అయ్యో! వారిని నీ వెంటతీసుకొని రాకపోయావా? ఈ పాపిష్టిదానికి దర్శనభాగ్యమైనా లభించేది! ఇక్కడ క్రూరసింహుడు తన అనుచరులతో అనేకరకాల కుట్రలు పన్నుతున్నాడు. నాజిం, అహమద్‌లు నా శత్రువులని మా తండ్రిగారికి నే నెంత నచ్చచెప్పినా ఆయన చెవిని పెట్టుకోవటం లేదు. క్రూరసింహుడు మా తండ్రిని ఆ విధాగా తయారుచేసి పెట్టాడు. వాడు వీరేంద్రునితో నాకు గల సంబంధాన్ని యేమి చిలవలు పలవలుగా చెప్పాడో అర్థంగాకుండా వుంది. మా తండ్రి క్రూరసింహుని సత్యహరిశ్చంద్రునికంటె మిన్నయైన వానిగా పూజిస్తున్నాడు. ఇక నా మాటల్ని ఆయన యెట్లా చెవికెక్కించుకుంటాడు. మరిచాను! ఇవాళ నీకు చెప్పాల్సిన సంగతులు చాలా వున్నాయి. మన చపల నాజింను బంధించి ఉద్యానవనందగ్గర చీకటికొట్లో పడేసింది. రేపు వాణ్ణి మహారాజుదగ్గరికి తీసుకొనివెళ్ళి హాజరుపరుస్తాను. మా తండ్రితో "మీరు నాకు చేసిన బందోబస్తు యేర్పాట్లు యివేనా? వీణ్ణి అంతఃపురంలో ప్రవేశించటానికి అనుమతించిందెవ్వరు?" అని అడగదలచుకున్నాను.

చపల నాజింను బంధీకృతుణ్ణిచేసిన వైనాన్ని చంద్రకాంతద్వారా తెలుసుకొన్న తేజసింహుడు మొదట కొద్దిగా

శ్రయపడి ఆ పైన ఆమెపై ప్రేమను అధికతరం చేసుకోసాగాడు. కొన్నిసేపైన తర్వాత "చపల చాతుర్యం ప్రశంసించదగ్గదేకాని; ఒక తెలివితక్కువపని మాత్రం చేసింది" అన్నాడు తేజ సింహుడు.

ఆ మాటవిన్న చపల తెలివితక్కువపని యేమిచేశానా అని ఆశ్చర్యపడింది. ఎటూ పాలుబోక 'ఆ తెలివితక్కువతనం ఏమిటో త్వరగా బయటపెట్టమ'ని తేజసింహుని రెట్టించి అడిగింది.

"తెలివితక్కువగాకపోతే నాజిం ప్రవేశించినచోట అహ్మాద్ కూడా ఉంటాడని నువ్వెందుకు వూహించలేదు. పోనీ పట్టుబడిన నాజింనైనా వెంటనే అంతఃపురంలోనికి తీసుకొని రావటమో లేక అప్పుడే మహారాజు ముందర హాజరుపరచ టమో యెందుకు చెయ్యలేదు? ఒంటరిగా తోటలో విడిచి వచ్చిన నాజిం యింకా మీకోసం అట్లాగే కూర్చొని వుంటా డనా? అతన్ని ఈపాటికి అహ్మాద్ విడిపించుకొని యిల్లు చేరు కునే వుంటాడు" అన్నాడు తేజసింహుడు.

తేజసింహుని మాటలువిన్న చపలకు పైప్రాణాలు పైనే పోయేటంతపనై చివరకు యెలాగో కోలుకొని "మీరు చెప్పింది అక్షరాల నిజం. యీమాత్రం మా కెవ్వరికీ ఆలో చన లేకపోయింది." అన్నది సిగ్గుతో.

"పెద్దగా జిత్తులమారి వనిపించుకొన్న నీకే యీ ఆలో చన లేకపోతే యింకెవ్వరికుంటుంది. అయినా వున్నాడో లేదో వెళ్ళి చూడు." అన్నాడు తేజసింహుడు.

చపల వడివడిగా తోటదిక్కుగా వెళ్ళింది. చీకటి కొట్టుదగ్గిరకు వెళ్ళి చూడగానే అది తెరచి వుండటం గమనించి ఆశ్చర్యపడింది. చివరకు తేజసింహుని మాటలే యథార్థాలైనాయి. తన మూర్ఖత్వాన్ని నిందించుకుంటూ తిరిగివచ్చి 'నాజింను అహ్మద్ విడిపించుకొని పోయాడ'ని చెప్పింది.

"అయిందా? జిత్తులమారి పని నీళ్ళు గారింది. గొప్పలు చెప్పకునేదానివిగా! అంతదాన్నని, యింతదాన్నని! ఒక పనికిమాలినవాడు మూడు చెరువుల నీళ్ళు తాగించాడు." అని తేజసింహుడు చపలను పేళన చెయ్యటం ప్రారంభించాడు.

అవహేళనలకు వొళ్ళు మండిన చపల "అదే గదిలో వాళ్ళిద్దర్నీ పట్టుకొచ్చి బంధించకపోతే నా పేరు చపలే కాదు! చెప్పులు మెళ్ళో వేసుకొని ఊరేగుతాను." అని ప్రతిజ్ఞ చేసింది

"చాలించు నీ ప్రతాపం! వీళ్ళని ఒక్కొక్కణ్ణి బంధించి నేనే మా నగరంలో ఖైదీలుగా చేస్తాను" అన్నాడు తేజసింహుడు.

ఆ తర్వాత తేజసింహుడు తాను యేవిధంగా లోపల ప్రవేశించిందీ చంద్రకాంత చపలకు పూసగ్రుచ్చినట్లు చెప్పాడు. తాను కేతకిని యెక్కడ వుంచిందీకూడా చెప్పి ఆమెను తీసుకుని రమ్మని చెప్పాడు. ఆ వేషంతోనే తాను బయటకు వెళ్ళిపోవాలి. గనుక కేతకి బట్టలుమాత్రం తానే వుంచుకొన్నాడు.

వెళ్ళిపోతూ 'ఈ రహస్యాన్ని మీ ముగ్గురకూ తప్పితే యింకెవ్వరికీ తెలియనివ్వరాదని' హెచ్చరించాడు.

"రెండు మూడు రోజులకొకసారి వచ్చిపోతూ వుండు. నువ్వు వస్తే మాకు ధైర్యంగా వుంటుంది." అని కోరింది చంద్రకాంత.

అట్లాగేనని తేజసింహుడు కదలబోయాడు. చంద్రకాంత అతనితో "మేమిద్దరం కలుసుకొనే అదృష్టం లేదా?" అని అన్నదో లేదో దుఃఖం పెల్లుబికి వచ్చింది. తేజసింహుడు వెనక్కి తిరిగి "ఈ కార్యక్రమమంతా మీరిద్దరూ శాశ్వతంగా సుఖంగా వుండాలనేగదా! ఇంతలో అధైర్యపడతావెందుకు?" అని అనేక రకాల నచ్చజెప్పి చంద్రకాంతను ఓదార్చాడు.

కేతకి రూపంలోనే తేజసింహుడు ద్వారందగ్గరకు వచ్చాడు. ఒకరిద్దరు తప్ప మిగతావారంతా యింకా స్పృహ తప్పి పడివున్నారు. "ఓరి దున్నపోతుల్లారా! మీరు కావలా కాస్తున్నారా? ఆగండి; మహారాణితో చెప్పి మిమ్మల్నేమి చేస్తానో!" అని దబాయించాడు.

కేతకి దబాయింపులకు అదిరిపడిన కావలావాళ్ళు కాళ్ళా వేళ్ళా పడి ఆమెను ఈసారికి క్షమించమని ప్రార్థించారు. తామావిధంగా పడివుండటానికి యెవడో విషం కలిపిన పొగా కిచ్చాడని చెప్పి ఆమెను బ్రతిమాలుకొన్నారు.

"సరే! యీసారికి విడిచిపెడుతున్నాను. ఇంకెప్పుడూ యీవిధంగా చేయకండి" అని మాయరూపంలో వున్న తేజసింహుడు బయటికి దాటుకున్నాడు. ఎవరూ అతన్ని 'కేతకీ' బయటికి వెళ్తున్నా వెందుకని కూడా అడిగిన పాపాన పోలేదు.

# 5

ఉద్యానవనంలో ఒక చెట్టుమీద కూర్చున్న అహ్మద్ చంద్రకాంత చపల చంప అంతఃపురంలోనికి వెళ్ళిన తర్వాత నెమ్మదిగా క్రిందకు దిగాడు. ఆ వనమంతా గాలించి నాజింను బంధించిన గదిని కనుగొన్నాడు. అతడు లోపల ప్రవేశించి నాజింను బంధవిముక్తుణ్ణి చేసి త్వరత్వరగా బయటికి తీసుకొని వెళ్ళిపోయాడు.

దోవలో నాజిం చపల చేతుల్లో చిక్కుకొని కొరడా దెబ్బలు తిన్న సంగతంతా అహ్మద్‌కు విన్నవించాడు.

"నాజిం ! మనం మొదట చపలను ఖైదీగా చెయ్యక పోతే చంపకూడా ఆమెమోస్తుగా తయారయ్యే ప్రమాద ముంది. వాళ్ళిద్దరూ జిత్తులమారులై కూర్చుంటే మనం ఒక్క డుగు కూడా ముందుకు వెయ్యలేం" అన్నాడు అహ్మద్.

"అవును. ఈ సారి ఏదో ఒకరకంగా బ్రతికి బయట పడ్డాం. రేపు ఏ విధంగానైనా చపలను మాయం చేసెయ్యాలి. ఈ పని మనం చేశామని అనుమానంకూడా యెవరికీ కలుగ కూడదు" అన్నాడు నాజిం.

ఇద్దరూ మాట్లాడుకుంటూ అంతఃపురం సింహద్వారం దగ్గిరికివచ్చి చేరారు. అక్కడ కేతకి యెదురుగా రావటం గమ నించారు.

కేతకి రూపంలోవున్న తేజసింహుడు నాజిం అహ్మద్ లను గుర్తుపట్టి భలే సమయం దొరికిందనుకొన్నాడు. తమాషా

చేసి వీలుంటే యిద్దర్నీ లేకపోతే ఒక్కణ్ణయినా ఎత్తుకొనిపోవాలని ఆలోచించసాగాడు.

తేజసింహుడు కావాలని వీళ్ళిద్దరిని ఒరుచుకుంటూ నడిచాడు. ఇది గమనించిన నాజిం అహ్మాద్‌లు ఆమె వెంటాడుతూ 'చూమా ! ఎక్కడికి వెళుతున్నావ్ ?' అనడిగారు.

"మీ పనేమిటో మీరు చూచుకొనక నా వెంటబడ్డారేమిటి ?" అన్నది కేతకి.

"మేమేమి అనుకున్నామో; యేమిచేస్తామో నీకేం తెలును ?" అన్నాడు అహ్మాద్.

"మీరు చపల చేతులో చెప్పుదెబ్బలు తినేవని తప్పచెయ్యరని నాకు తెలుసుగా!" అంది కేతకి. "అయినా ఒక్క దాసీదికూడా మీ పక్షాన లేదుగదా! మీ రక్కడేమి చెయ్యగలుగుతారు !" అనికూడా హెచ్చరించింది.

కేతకి మాటలు విన్న నాజిం అహ్మాద్ ఆశ్చర్యచకితులై 'ఇదెక్కడో అసాధ్యపు ఆడద'ను కున్నారు. కేతకి తమ పక్షానవుంటే తమపని నేరవేరగలదనుకొని ఆమెను తమ వైపుకు త్రిప్పుకొనటానికి ఎత్తువేశారు.

నాజిం కేతకిని సమీపించి "చూడు కేతకీ ! మా పనెప్పుడూ ఎత్తులువేయటమే! మాకు పట్టుబడతామనీ, చస్తామనీ భయంవుంటే పనిజరగదు. ఇందులోనే వుంటూ ఇందులోనేతింటున్నాం. వేలరూపాయలు ఆర్జిస్తున్నాం. దేవుడు దయదలచి నీలాంటివారి సహాయం మాకు తోడుచేస్తే మరీమంచిది. నీకు యిష్టముంటే మాకు సహాయంచెయ్యి; మాకు దొరికినదాంట్లో నీకూడా వాటా యిస్తాం." అన్నాడు.

"యేమండోయ్! అంతమాత్రానికే ఆశపడే ఘటం కాదిది. మనకిచ్చే దేమిటో ముందుగా చేతులలో వేయించుకొని గాని పని మొదలెట్టదు. మీా రిప్పుడు నాకేదైనా యిస్తే యీా నిమిషంలో తేజసింహుణ్ణి పట్టి మీా ముందుంచుతాను. లేకపోతే మీా దోవ మీారు చూచుకోండి" అన్నది. కేతకి.

తేజసింహుణ్ణి బంధించటం అనే వార్త వినేసరికి ఇద్దరూ వుబ్బిళ్ళూరారు. "ఇవ్వాళ తేజసింహుణ్ణి పట్టి ఇచ్చావంటే నీవేమి కోరితే అది ఇస్తాం" అన్నాడు నాజిం.

"ఒక వెయ్యివరహాలకు తక్కువైతే నేను తీసుకోను. ఇష్టమైతే నా ముందు తీసుకొచ్చి పెట్టండి" అన్నది కేతకి.

"యీా అర్ధరాత్రి వేళ నేడబ్బెక్కడ తెచ్చేదీ ప్రొద్దున్న యిస్తాం" అన్నాడు నాజిం.

"ఆ మాటలు నాదగ్గర పనికిరావని మొదలే చెప్పాను. ఇద్దరి వ్యవహారము నా ముందు సాగదన్నది" కేతకి.

"అంత మొఖమాటం లేకుండానా? యిక్కడేవుండు వెళ్ళి తీసుకొస్తాను." అన్నాడు నాజిం.

"సరే ఐతే ఒకడు ఇక్కడ వుండీ మరొకడు వెళ్ళి డబ్బు తెండి" అన్నది కేతకి.

"ఒరే అహ్మద్! నీ విక్కడ వుండరా! నే వెళ్ళి డబ్బు తెస్తాను" అని నాజిం క్రూరసింహుని దగ్గరకు వెళ్ళాడు.

నాజిం వెళ్ళినతరువాత కేతకి అహ్మదులు ఏవేవో మాటలు చెప్పుకున్నారు. మాటల మధ్యలో కేతకి రెండు యాలకాయలు తీసి అహ్మదుకు ఇచ్చింది. అతడు వాటిని

తిన్నాడు. అతనికి తేజసింహుడు పట్టుబడతాడనే సంతోష ములో తాను ఏలకులు తిన్నాననే గుర్తులేదు. కొద్దిసేపటికి అతని తల తిరగసాగింది.

అప్పుడతనికీ జిత్తులమారి చేతిలో చిక్కాననిపించింది. వెంటనే బొడ్లోనుంచి చూరకత్తి తీసి కేతకిని కొట్టాడు. కేతకి ఆ దెబ్బ తప్పించుకొని అహ్మాదును గట్టిగా పట్టుకొన్నది. అంతలో అతడు స్పృహతప్పి పడ్డాడు. తేజసింహుడు అహ్మా దును దుప్పటిలో చుట్టి బుజాన వేసుకొని నాగథ దిక్కుగా వెళ్ళాడు. అతనికి సంతోషములో నాజిం తనను వెంటాడ తాడని అనుకోలేదు. డబ్బు తీసుకొని రావటానికి వెళ్ళిన నాజిం క్రూరసింహుడు నిద్రలో వుండటం చూచాడు. అతన్ని లేపాడు. క్రూరసింహుడు "యీ అర్ధరాత్రివేళకూడా నిద్ర పోనివ్వవా ఏమిటి ?" అన్నాడు.

నాజిం అతనితో అంతవరకూ జరిగిన సంగతంతా చెప్పాడు. క్రూరసింహుడూ నాజింకుపట్టిన దురవస్థకు మొదట కొంత విచారించినా ప్రస్తుతం తేజసింహుడు పట్టుబడగలడనే సంతోషములో మునిగివున్నాడు. "ఇదిగో వెయ్యివరహాలు ఇస్తాను." అని వరహాలు తెచ్చి ఇచ్చి నాజింను అనుస రించాడు.

నాజిం క్రూరసింహునితో కలసి అహ్మాదు వున్నచోటికి వచ్చాడు. అక్కడ ఇద్దరూ లేరు. నాజిం నోటినుండీ అప్రయ త్నంగా "మోసం జరిగింది" అనేమాటలు వెలుబడ్డాయి.

"ఏం జరిగిందో చెప్పు" అన్నాడు క్రూరసింహుడు.

"ఏం చెప్పను ? అది కేతకి కాదు. మమ్మలను మోస గించి అహ్మాదును ఎత్తుకపోయింది.

"ఏందీ ! నువ్వు చపలచేతిలో తన్నులు తిని బైట పడ్డావనుకుంటే, ఇప్పుడు వీడుకూడా అక్కడికే తన్నులు తిన టానికి వెళ్ళాడన్నమాట" అన్నాడు క్రూరసింహుడు.

అనుమానం తీర్చుకోటానికి నాజిం కొంతసేపు అటు ఇటు వెతికి చివరికి క్రూరసింహునితో కలసి ఇంటిదారి పట్టాడు.

# 6

తేజసింహుడు విజయగఢ వెళ్ళిన తరువాత వీరేంద్ర సింహుడు ఇంటికి చేరుకున్నాడు. అతని మనస్సు ఏమీ బాగాలేదు. చంద్రకాంత నామాన్ని జపించటమే అతనిపని. ఎల్లప్పుడు చంద్రకాంత చిత్రపటాన్ని ఎదురుగా పెట్టుకొని ఏవేవో మాట్లాడుతాడు. లేకపోతే మంచంమీద ముసుగు తన్ని పడుకుంటాడు. విలపిస్తాడు. ఎవరు పిలిచినా పలుకడు. తండ్రియైన సురేంద్రసింహునికి యీ సంగతంతా తెలిసింది. ఐనా పాపం అతడేం చేస్తాడు ? విజయగఢరాజు బలవంతుడు. తనపై అధికారి.

వీరేంద్రుడు తేజసింహునితో ఆ నాడే తిరిగిరమ్మని చెప్పాడు. అతనికోసం అర్ధరాత్రిదాకా యెదురుచూశాడు. అతడు తిరిగి రాకపొయ్యేసరికి భయపడ్డాడు. చివరకి ఏదో ఒక రకంగా కుదటపడి బయటికి చూస్తూ కూర్చున్నాడు. తెల్ల

వారించి. తేజసింహుడు భుజాన ఒక పెద్ద మూటతో వచ్చాడు. కావలావాళ్ళు అతన్ని చూచి విస్మయం చెందారు. తేజసింహుడు వీరేంద్రుని గదిలో ప్రవేశించాడు. అతడింకా మేలుకొనే వున్నాడు. స్నేహితుణ్ణిచూచి "విశేషాలేమిటో చెప్పు" అని ఆతురతగా ప్రశ్నించాడు వీరేంద్రుడు.

తేజసింహుడు విజయగథ విశేషాలు చెప్పాడు; చంద్రకాంత యిచ్చిన వుత్తరం అతని చేతులలో వుంచాడు. మూట విప్పి అహ్మాద్‌ను ముందుంచి "అది ఉత్తరం; ఇది కానుక" అన్నాడు.

వీరేంద్రుని సంతోషానికి మేరలేదు. ఉత్తరాన్ని మాటిమాటికీ చదువుకొని కళ్ళకద్దుకొని "తేజసింహా! ఈ అహ్మాద్‌ను యెక్కడా కనిపించకుండా దాచెయ్. ఈ సంగతి జయసింహునికి తెలిస్తే విరోధం మరింత యెక్కువౌతుంది." అన్నాడు.

"ఆ సంగతి నాకూ్కడా తెలుసు. వీణ్ణి నాకు తెలిసిన ఒక కొండగుహలో దాచివస్తాను." అన్నాడు తేజసింహుడు.

ఒక నౌకరుని పిలిచి దేవీసింహుడనే పేరుగల మరొక జిత్తులమారిని పిలిపించాడు. అతడు తేజసింహుని బంధువు కూడా. దేవీసింహుడు తేజసింహునికి యేమాత్రం తీసిపోడు. దేవీసింహుడు వచ్చినతర్వాత తేజసింహుడు అహ్మాద్‌ను తిరిగి మూటగట్టి భుజాన వేసుకొని 'నావెంట రానీతో పనుంది' అని దేవీసింగుతో కలిసి వెళ్ళిపోయాడు. దోవలో దేవీసింహుడు గురువుగారిదగ్గర మూటను తీసుకొని తానే అహ్మాద్‌ను మోసుకొనిపోయాడు.

ఇద్దరూ పట్టణం విడిచి ఒక అడవిగుండా నడిచి ఒక పర్వతం దగ్గరకు చేరుకున్నారు. అక్కడ ఒక యిరుకుసందు గుండా వెళ్ళి భయానకమైన గుహాంతర్భాగంలో ప్రవేశించారు. ఆ గుహలో కొంతదూరం నడిచి వెళ్ళిన తర్వాత కొద్దిగా ఒకచోట వెలుగు కనిపించింది. అక్కడ ఆగి తేజసింహుడు దేవసింహుని మూటవిప్పమని ఆజ్ఞాపించాడు.

దేవసింహుడు బదులిచ్చి "గురువుగారూ! ఇది చాలా విచిత్రమైనచోటు. నేనింతవరకు చూడనేలేదు. బహుశా యిక్కడకు యెవ్వరూ రాలేరు; వచ్చినా తిరిగి వెళ్ళలేరు" అన్నాడు.

"దేవసింహా! ఈ చోటు నాకుతప్ప యితరులెవ్వరికీ తెలియదు. నువ్వు నా ప్రాణ మిత్రుడవని వనుండి నిన్నిక్కడకు తీసుకొచ్చాను" అన్నాడు తేజసింహుడు.

"నేను నీ దాసుణ్ణి. తమ దయవల్లనే, నేనింత వుపాయశాలినయ్యాను. అవుసరమైతే ప్రాణదానం చెయ్యటానికి కూడా నేనెప్పుడూ సిద్ధమే, అన్నాడతడు.

"నేను చెప్పేవిషయాలన్నీ శ్రద్ధగావిను. ఆ ఎదురుగా కనిపించే రాతిద్వారాన్ని నేనుతప్ప యితరులెవ్వరూ తెరవలేరు. నాకు మాయాజాలాన్ని నేర్పిన నా గురువుగారికిమాత్రం తెలుసు. పాపం! ఆయనకూడా యిప్పుడు ఈలోకంలోలేరు. ఇప్పుడు నాకుతప్ప ఇంకెవరికీ తెలియదు. ఇప్పుడు నే నీ రహస్యాన్ని నీకు చెప్తాను. నేను బాధించి తీసుకొనివచ్చినవాళ్ళందరిని ఇక్కడ ఖైదీ చెయ్యి. ఇందులో బంధింపబడిన ఖైదీలను చేతులూ, కాళ్ళు కట్టనవసరంలేదు. జాగ్రత్తకోసం ఒదు

లుగా ఒక బేడీ కాలికివేస్తే చాలు. వాళ్ళుకూడా కాస్తా అటూ ఇటూ తిరగగలుగుతారు. ఖైదీల ఆహారపానీయాలను గురించి నీవేమీ చింతపడనవసరంలేదు. యీ గుహలో ఒక సెలయేరువుంది. అదెప్పుడూ పారుతూవుంటుంది. ఇక్కడ మేడి చెట్లు చాలా వున్నాయి. యీ మాయగాణ్ణి యిందులోనే బైదుచేద్దాం, తర్వాత నీవు మన మహారాజుతో ఆరోగ్యం సరిగా లేదనీ నెలరోజులు సెలవుతీసుకో. ఆ శలవుదినాల్లో గాలి మార్పుకు ఎటన్నా వెళతాననిచెప్పు, నే నక్కడుండి సెలవు యిప్పిస్తాను. అప్పుడు నీవు నీ వేషము మార్చి విజయగఢ వెళ్ళు. అక్కడేవుండి సంగతులన్నీ తెలుసుకో. ఎప్పటికప్పుడు నాకు విశేషాలు తెలియజేస్తూవుండు; వీలుచిక్కినప్పుడు శత్రువుల్ని బంధించి ఈ గుహలో పడవెయ్యి” అని దేవీసింహునికి తేజసింహుడు ఒక కార్యక్రమాన్ని ఇచ్చాడు. ఇంకా అనేక విషయాలు దేవీసింహునికిచెప్పి తేజసింహుడు రాతిద్వారాన్ని తెరుపటానికి వెళ్ళాడు. ద్వారం పైభాగంలో ఒక పెద్దపులి ఆకారం తయారుచేయబడి వుంది. దానినోట్లోనుండి చెయ్యి పూర్తిగా లోపలికి పెట్టవచ్చు. తేజసింహుడు దేవీసింహునితో “దీనినోట్లో చేయిపెట్టి నాలుకను బైటికిలాగు” అన్నాడు. అతడు ఆ విధంగా చేశాడు. నాలుక బైటికి లాగటంతోనే ఒక పెద్దధ్వనితోపాటు రాతిద్వారం తెరుచుకొంది. అప్పుడును మూటకట్టుకొని యిద్దరు లోనికి వెళ్ళారు. అదంతా ఒక విశాల మైదానం, మైదానానికి నాల్గు దిక్కులా ఎత్తయిన పర్వతాలు వున్నాయ్. ఆ పర్వతాలమీదికి మనుష్యులెవ్వరూ ఎక్కలేరు. మధ్యగా ఒక సెలయేరు ప్రవహిస్తుంది.

గుంపులు గుంపులుగావున్న మేడిచెట్లతో ఆ ప్రదేశమంతా శోభాయమానంగా వుంది. నలుదిక్కులా పర్వతాలు క్రింది నుండి పైదాకా రకరకాల చెట్లతో భయానకంగా వుంది. పెద్ద పెద్ద రాళ్ళు ఏనుగులవలె కనుపిస్తున్నాయి. పైనుంచి దుముకుతున్న సెలయేళ్ళు భయంకరధ్వనులు చేస్తున్నాయ్. గాలి తాకిడికి చెట్లు ఒకవిధమైన చప్పుడు చేస్తూ మధ్య మధ్య నెమళ్ళు నృత్యం చేస్తుంటే అతి మనోహరంగా వుంది. క్రింద పడమటి దిక్కునుండి తూర్పుకు ప్రవహించే సెలయేటికి రెండు వైపుల నేరేడుచెట్లు ఎత్తుగా పెరిగివున్నాయ్. ఆ చెట్లనుండి నేరేడుపండ్లు పండి నీటిలో పడిపోతున్నాయి. నీళ్ళుకూడా ఏమంత లోతుగాలేవు. పర్వతాల్లో గుహాలు నోళ్ళు తెరుచుకొని వున్నాయి. మొత్తంమీద ఆ ప్రదేశమంతా సంవత్సరాల తరబడి వున్నా మానవుల ఆరోగ్యం చెడిపోకుండా ఆహ్లాదకరమైనదిగా వుంది.

తెల్లవారింది. సూర్యుడు వుదయించాడు. తేజసింహుడు అహ్మాదును కట్టినమూట విప్పాడు. అతని నడుముకు కట్టబడిన మాయామంత్రవస్తువుల్ని తీసుకున్నాడు. కాళ్ళకు బేడీలువేశాడు స్పృహ తెప్పించాడు. తెలివితెచ్చుకున్న అహ్మాద్ తానున్న ప్రదేశాన్ని చూచి చచ్చానురా భగవంతుడా అనుకున్నాడు. తేజసింహుడు "ఏమయ్యోయ్! యిటుచూడు ఇప్పుడునీవు మాఖైదీవి" అన్నాడు. అహ్మాదు అతన్ని చూచాడు. అతని ప్రాణాలు తన్నుకున్నాయ్. అతని కళ్ళయెదుట కేతకి ఆకారం తిరుగాడసాగింది. నోటినుంచి మాట పెగలలా.

ఆహ్మాదును సెలయేటి ఒడ్డునవదలి జిత్తులమారు లిద్దరూ బైటికివచ్చారు. దేవీసింహునితో తేజసింహుడు "నీవు లాగిన యీ పెద్దపులి నాలుకను తిరిగి లోనికి తోసివెయ్యి" అని ఆజ్ఞాపించాడు. అతడు ఆ విధంగా చేశాడు.

నాలుక లోనికి నెట్టటం తోటే రాతిద్వారం గమ్మత్తుగా మూసుకపోయింది.యిద్దరూ ఇంటిముఖం పట్టారు.

ఒకజాము ప్రొద్దెక్కింది. ఇద్దరూ వీరేంద్రసింహుని వద్దకు చేరారు. "ఇంత ఆలశ్యమైందే! ఆహ్మాదును ఎక్కడ ఖైదీ చేశారు?" అని అడిగాడు.

"ఒక కొండ గుహలో దాచాము. యీవాళ మీకా స్థలం చూపిస్తాలే. మన దేవీసింహుణ్ణి మాయామాపంలో విజయగఢలో వుండమని చెప్పాను. అతడావిధంగా వుంటే నాకు చాలా శ్రేయంగా వుంటుంది" అని తేజసింహుడు చెప్పి వీరేంద్రసింహునిజ్ఞి సంతోషపెట్టాడు.

ఇద్దరూ స్నానపూజాదులు ముగించుకొని దేవీసింహునితో కలసి రాజదర్బారుకు వెళ్ళారు. అక్కడ దేవీసింహుడు, మహారాజును సెలవుకోరాడు. రాజుకి శలవివ్వటం ఇష్టంలేక "ఇక్కడే నీకు మందిచ్చే ఏర్పాటుచేస్తాను" అన్నాడు. కానీ చివరకు వీరేంద్రుడు, తేజసింహుడు చెప్పినమీదట శెల విచ్చాడు. దర్బారు విరమించిన తరువాత వీరేంద్రుడు తండ్రితో రాజమహాలుకు వెళ్ళిపోయాడు. తేజసింహుడుకూడా తండ్రి వెంట ఇంటికి వెళ్ళాడు. అక్కడ దేవీసింహుని ప్రయాణ సన్నాహాలు పూర్తిచేయించి యింకా చెప్పవలసిన మాటలు చెప్పి విజయగఢకు తరలించాడు.

మరునటిదినం తేజసింహుడు వీరేంద్రునితో కలసి అమ్మా దును ఖైదుచేసినచోటికి వచ్చాడు. రాజకుమారుడా ప్రదేశాన్ని చూచి "నాకీ ప్రదేశం చాలా ఆనందదాయకంగా వుంది" అన్నాడు.

"నాకూ మొదట అట్లాగే అనిపించింది. గురువు గారి ఆజ్ఞవల్ల మనస్సు మార్చుకున్నాను. ఆ విశేషం తర్వాత చెప్తాలే" అన్నాడు తేజసింహుడు.

ఆ మాటలువిన్న వీరేంద్రుడు ఆ స్థల విశేషాన్ని చెప్ప మని పట్టుపట్టాడు. తప్పనిసరియై తేజసింహుడు గురువు చెప్పిన విశేషాలు ప్రియమిత్రునికి విన్నవించాడు. ఆవిషయాలు తెలుసుకొన్న మీదట వీరేంద్రుడు మహదానంద భరితు డయ్యాడు. అతడంతగా ఆనందభరితుడు కావటానికి కారణ మేమిటో ఆ స్థలమహాత్మ్యం అసలేమిటో ముందుముందు వివరిస్తాను.

మిత్రులిద్దరూ అక్కడినుండి ప్రయాణమై ఇల్లుచేరారు. రాజకుమారుడు "మిత్రమా! నా శక్తి సామర్థ్యాలిప్పుడు చాలా అభివృద్ధిచెందాయి. ఇప్పుడు నాకు జయసింహుని ఎదు ర్కొంటానని మనస్సుపోతోంది" అన్నాడు.

"మీ రావిధంగా తలపెట్టటం సంతోషించ దగ్గదేగాని మనమిప్పుడు యేమాత్రం త్వరపడినా చంద్రకాంత ప్రాణాలకు ముప్పు వాటిల్లటం తథ్యం. అసలు జయసింహు ఆతురత చెందుతారెందుకు? కొంచెంఆగి ముందుముందు యేమౌతుందో చూడండి. రేపు నేను అక్కడికి వెళ్తాను. అమ్మాద్‌ను పట్టుకొచ్చిన తర్వాత శత్రువులు యేమనుకుంటు

న్నారో తేల్చుకుంటాను. మరొకసారి మిమ్మల్ని తీసుకొని వెళ్తాను." అని తేజసింహుడు అనటంతోటే వీరేంద్రుడు "కాదు; యిప్పుడే నేను మీ వెంట తప్పకవస్తాను. మగ వాణ్ణయి యెన్నాళ్ళు యీ విధంగా పిరికిపందనై మూల కూర్చుంటాను." అన్నాడు.

"అయితే సరే నడవండి. నా అభ్యంతరం యేమీలేదు. కాని మహారాజు నడిగి వేటకొరకు నాలుగైదురోజులు శెలవు తీసుకొండి. మన సరిహద్దుల్లో డేరా వేద్దాం. అక్కడనుండి చంద్రకాంత నివాసం రెండున్నర కోసుల దూరముంటుంది. మనకు బాగా వీలుగా వుంటుందికూడా." అన్న తేజసింహుని మాటలకు వీరేంద్రుడు సమ్మతించాడు. చివరికి కార్యక్రమం ఆవిధంగానే నిర్ణయించబడింది.

కొన్నాళ్ళ తర్వాత సురేంద్రసింహ మహారాజువద్ద అతని కుమారుడు వీరేంద్రసింహుడు వేటకొరకు ఎనిమిదిరోజులు శెలవు తీసుకొన్నాడు. తనకు ప్రాణసమానంగా వుండే కొద్దిమందితో ప్రయాణమై పోయాడు. సూర్యాస్తమయ మాసన్నమైంది. నౌగఢ విగఢ రాజ్యాలకు సరిహద్దున పరివారం కొరకు డేరా వెయ్యబడింది. అక్కడే రాత్రి మకాం చేశారు. తేజసింహుడు విజయగఢ వెళ్ళే మొదట కార్యక్రమం నిశ్చయమైంది.

# 7

అహ్మద్ అపహరింపబడినతర్వాత నాజిం ఉదాసీనుడై కూర్చున్నాడు. క్రూరసింహునికి తేజసింహుడు తన నెక్కడ ఎత్తుకొనిపోతాడోనని ఆందోళన హెచ్చింది. అయినా అతడు ప్రతిరోజూ జయసింహ మహారాజుకు వీరేంద్రసింహునిపై పితూరీలు చెప్పటం మానుకోలేదు.

ఒకరోజున నాజిం క్రూరసింహునికి తండ్రిని చంపవలసిందిగా సలహా యిచ్చాడు. ఆవిధంగా చంపినట్లయితే జయసింహుడు తప్పనిసరిగా నిన్నే మంత్రిగా వేసుకుంటాడని, అప్పుడు నీకు సంక్రమించిన అధికారంవల్ల పనులన్నీ అతి సునాయాసంగా నెరవేరగలవని నచ్చచెప్పాడు. చివరకు ఆవిధంగానే క్రూరసింహుడు తన తండ్రికి విషంపెట్టి చంపివేశాడు. మహారాజు కుపథసింహుని మరణానికి చాలా విచారించాడు. కొన్నాళ్ళపాటు అసలు దర్బారుకే రాలేదు. నగరం కుపథసింహుని మరణంవల్ల శోకసాగరంలో మునిగిపోయింది.

క్రూరసింహుడు తండ్రి మరణానికి దుఃఖంలో మునిగిపోయిన వానిలా నటించాడు. దినకర్మలు పూర్తయ్యేవరకు వేరుగా పడకను మార్చాడు. పగలల్లా లోకాన్ని వంచించటంకోసం తండ్రికోసం భోరుభోరున యేడ్చి రాత్రి కాగానే నాజింతో కలసి చంద్రకాంతను చేసుకొనేవిధివిధానాలనుగురించీ, తేజసింహుని బంధించటాన్నిగురించి పన్నాగాలు పన్నుతుండేవాడు. అదేరోజులలోనే వీరేంద్రుడు వేట సేనతో విజయగఢ సరిహద్దులలో మకాం వేసి వున్నాడు. ఈ విషయాన్ని క్రూర

సింహునికి నాజీం అందజేసి "వీరేంద్రుడు మన సరిహద్దుల కిప్పుడు చంద్రకాంతకోరకే వచ్చిచేరాడు. దురదృష్టవశాత్తు యిప్పుడే అహ్మద్ లేకుండాపోయాడు గాని అతడున్నట్లయితే చాలా బాగుండేది. అయినా చూద్దాం" అని చెప్పి రహస్యాన్వేషణకు బయలుదేరాడు.

తేజసింహుడు వీరేంద్రునివద్ద శెలవుతీసుకొని విజయగఢ ప్రవేశించాడు. అక్కడ మంత్రి కుపథసింహుడు మరణించటం ప్రజలంతా దుఃఖంలో మునిగివుండటం తెలుసుకొని వీరేంద్రునివద్దకు తిరిగివచ్చాడు. సోదకం వెళ్ళిన తర్వాత రెండు రోజుల్లో జయసింహుడు క్రూరసింహుని తన మంత్రిగా వేసుకుంటాడనే విషయాన్నికూడా తెలుసుకొనివచ్చాడు.

"చంద్రకాంతకోరకు తన తండ్రినికూడా హత్యచేసిన క్రూరుడు మహారాజును మాత్రం హత్యచెయ్యడనే హామీయేమిటి?" అని తన సందేహాన్ని వెలిబుచ్చాడు వీరేంద్రుడు.

"నిజమే! వీలుచూచుకొని ఆ దుర్మార్గుడు మహారాజును కూడా హత్యచేయక పోడు! అందుకని రెండు మూడు రోజులపాటు చంద్రకాంత మహలులోనికి వెళ్ళకుండా దర్బారులో ప్రవేశించి అక్కడ విశేషాలు తెలుసుకుంటాను. ఈ లోపలే వీలుదొరికితే చూద్దాం" అన్నాడు తేజసింహుడు.

"అవేం కుదరదు, ఈవేళ చంద్రకాంతను కలుసుకొని తీరాలి"అన్నాడు వీరేంద్రుడు.

"తొందరపడకండి; తొందరపాటు పనులన్నిటినీ పాడుచేస్తుంది."

"యేది యేమైనా నేను వెళ్ళితీరాలి" తేజసింహుడు ఎంతగా బ్రతిమిలాడినా చంద్రకాంతా వియోగభారంలో వున్న వీరేంద్రుడు అతని మాటల్ని పెడచెవిని పెట్టాడు. చివరకి విజయగఢ వెళ్ళటానికే సిద్ధమయ్యాడు. చేసేది యేమీ లేక తేజసింహుడు కూడా అతన్ని అనుసరించాడు.

సాయంకాలమైంది. మిత్రులిద్దరూ డేరాబయట షికారు చేస్తున్నారు. సేవకుల్ని పిలిచి 'ఒకవేళ మేము రావటం ఆలస్యమైతే యేమీ భయపడకండి' అని చెప్పి విజయగఢకి ప్రయాణమైనారు.

కొద్దిగా ప్రొద్దుపోయింది. చంద్రకాంత ఉద్యానవనంలో ప్రవేశించింది.

చీకటిరాత్రి కావటంవల్ల మిత్రులిద్దరూ ఉద్యానవనంలో ప్రవేశించటానికి అంతగా ప్రయాస పడవలసిన అవసరం లేకపోయింది. కావలావాళ్ళ కళ్ళుగప్పి తాటి సహాయంతో వనంలో ప్రవేశించారు. అక్కడ దట్టంగా పెరిగిన ఒక చెట్టు క్రింద నిలబడి నలుదిక్కులూ పరికిస్తున్నారు.

తోట మధ్యభాగంలోని జలయంత్రం దగ్గర చలువరాతిమీద కూర్చుని చంద్రకాంత, చపల, చంప మాట్లాడుకుంటున్నారు. చపల మాట్లాడుతున్నదన్న మాటేగాని దిక్కులు వెతకటం మానలేదు.

చంద్రకాంతను చూచిన వీరేంద్రునికి శరీరం పులకరించింది. మర్మవేదనకు గురైన అతడు కొంతసేపటికి స్పృహ లేకుండా పడిపోయాడు. తేజసింహుడు మాత్రం గాభరా పడకుండా వెంటనే సంచిలోనుంచి భస్మం తీసి అతనికి వాసన

చూపి తెలివి తెప్పించాడు. "ఇదేమిటండీ; పరాయిచోటికి వచ్చికూడా యీ విధంగా స్పృహదప్పి పడిపోతారు" కాస్త సంభాళించుకోవాలి మరి. మీరిక్కడే వుండండి. నేను వెళ్ళి విషయాలన్నీ తెలుసుకొని మిమ్మల్ని తీసుకొని వెళ్ళతాను." అని చెప్పి తేజసింహుడు ఆ చెట్టు నీడనుండి చెలికత్తెలతో కూర్చున్న చంద్రకాంత దగ్గరకు వెళ్ళాడు.

"యేమండీ; ఎన్నాళ్ళటికి మీరు తిరిగి వచ్చేది? ఇదేనా మీ మర్యాద. యిప్పుడైనా మీరొక్కరే వచ్చారల్లే వుందే!" అంది చంద్రకాంత. తిరిగి "వారిని ప్రేమించినదాని ప్రతిఫలం యిదే అయితే నేను యేవిధంగా జీవించగలను" అని యేడ్వసాగింది.

తేజసింహుడు చంద్రకాంత దుర్దశకు చింతించి "ఎందుకమ్మా! అలా ఇదైపోతావ్! విశేషాలు పూర్తిగా తెలుసుకోకుండానే చేతగాని తనాన్ని బయటపెట్టుకుంటే లాభం యేముంది! అయితే వుండు యిప్పుడే రాజకుమారుణ్ణి తీసుకు వచ్చి నీముందు హాజరుపరుస్తాను" అనిచెప్పి తేజసింహుడు వీరేంద్రసింహుడున్న చోటుకి వెళ్ళి అతణ్ణి వెంటబెట్టుకొని తీసుకొచ్చాడు.

వీరేంద్రసింహుని చూసేసరికి చంద్రకాంతకు పట్టలేని ఆనందం కలిగింది. ఇద్దరూ గాఢంగా కౌగలించుకుని కన్నీరు మున్నీరుగా విలపించారు. పరస్పరం కాసేపు దెప్పిపొడుపు మాటలతో కాలం గడచిపోయింది.

కాలవైచిత్ర్యం చూశారా! రహస్యాన్వేషణ సాగిస్తున్న నాజిం హఠాత్తుగా అచ్చటికివచ్చి చేరుకున్నాడు.

ఆనందసాగరంలో తేలియాడుతున్న అచ్చటి జనాన్నిచూచి ద్వేషానలంతో దహించుకు పోసాగాడు. ఆ వెనువెంటనే తిరిగి క్రూరసేనుని వద్దకు వెళ్ళాడు. గాబరా చెందివున్న నాజింను చూచి "ఎందుకోయ్ అలా భయపడతావ్" అని ప్రశ్నించాడు క్రూరసింహుడు. "ఏముంది! మన మనుకున్నంత పనీజరిగింది. మన నేర్పరితనాన్ని ప్రదర్శించే సమయం ఆసన్నమైంది. ఈ సమయంకూడా చేయిజారి పోయిందంటే మీ రిక శాశ్వతంగా దురదృష్టవంతులేనని చెప్పక తప్పదు." అన్నాడు నాజిం. "నీ మాటలు నాకేం అర్థం కావటంలా. జరిగిన సంగతేమిటో అసలు చెప్పు" అని రెట్టించాడు క్రూరసింహుడు. "విషయ మేముంది. వీరేంద్రుడు చంద్రకాంత వద్దకు వచ్చి చేరుకున్నాడు. ఇప్పుడు వుద్యానవనంలో అంతా కలసి ఆనందసాగరంలో మునకలు వేస్తున్నారు" అన్నాడు నాజిం.

ఈ వార్తలు వినేసరికి క్రూరసింహుని కండ్లు మిరుమిట్లు గొలిపాయి. సమస్త ప్రపంచం ఉదాసీనంగా అభాసించింది. ప్రస్తుతం అతడు తండ్రి మరణంతో బైటికిరాలేక ఇట్లో కూర్చున్నాడు. పదమూడురోజులనుంచి బయట మొహమైనా చూడలా. అతనికిప్పుడే ఈవార్త పిడుగుపాటుగా వచ్చిచేరింది. హఠాత్తుగా లేచి నిలవబడి శోకపరితప్తమైన తన శరీరాన్ని సంస్కరించకుండానే జయసింహ మహారాజువద్దకువచ్చి చేరాడు. జయసింహుడు క్రూరసింహుని రాకను గమనించి "సోదక మైనా తీరకముందే ఈవిధంగా నీవు బయటికి రావటం నాకు ఆందోళనకరంగా వుంది." అన్నాడు.

"మహారాజా మీరే మా తండ్రులు. మరణించిన నా తండ్రి కేవలం కన్నాడు. సంరక్షించే భారం మీ చేతుల్లో వుంది. మీరే నా గౌరవాన్ని మంటగలిపితే నా జీవితం ఇంక ఎందుకు ? వృథా నన్ను లోకులే విధంగా పరిగణిస్తారు" అని అన్నాడు క్రూరసింహుడు. "ఏమంటున్నావ్ ? మన గౌరవం మంటగలిసే పని ఏం జరిగిందో చెప్పు? అన్నాడు కోపంగా జయసింహుడు. "ఒక పనికిమాలిన మనిషి—" అని క్రూరసింహుడు వాక్యం పూర్తిచేయక మునిపే "అత డెవరో త్వరగా చెప్పు. బహుశా వాణ్ణి మృత్యుదేవత వరించి వుంటుంది" అన్నాడు పండ్లు కొరుకుతూ జయసింహుడు. "వీరేంద్రసింహుడు" క్రూరసింహుడు ఆ వ్యక్తిని కాస్తా బయటపెట్టాడు. "వాడికెంత పొగరు. నన్నే ఎదిరిస్తాడా ? అవమానపరచే సంగతి వేరు. నీ మాటలు నాకేం అర్థంకావటంలేదు. విడమర్చి చెప్పు. ఎక్కడా వీరేంద్రసింహుడు." అని అడిగాడు వీరేంద్రసింహుడు.

"తమ రాజాంతఃపుర ఉద్యానవనంలో" అని చెప్పాడు క్రూరసింహుడు. ఈమాట వినేసరికి మహారాజు కోపోద్దీపితుడై వణకసాగాడు. "ఇప్పుడే వెళ్ళి ఉద్యానవనాన్ని ముట్టడించండి." అని తక్షణం ఆజ్ఞాపించాడు.

# 8

వీరేంద్రుడు చంద్రకాంతతో తియ్యతియ్యని కబుర్లు చెబుతున్నాడు. చపలతో తేజసింహుడు కేరింతలు కొడుతున్నాడు. పాపం ! చంప ఆ జంటల ముఖాలు చూస్తూ

కూర్చునివుండిపోయింది. హఠాత్తుగా ఒక నల్లని భయంకరమైన మనిషి ఎర్రని కళ్ళతో లంగోటా బిగించి ఎగురుతూ దూకుతూ మధ్యకి వచ్చి చేరాడు. రావటంతోటే అతని భయంకరమైన కోరలను విప్పి తేజసింహుని వైపు చూపించాడు. "జాగ్రత్త సోదరా! రాజుగారికి తెలిసింది. నా మాట విను గురూ!" అని చెప్పి ఆ భయంకరమైన మనిషి అక్కడ నుండి వెళ్ళిపోయాడు. వెళుతూ వెళుతూ చంప కాలు ఒకటి పుచ్చుకొని కొంతదూరం ఈడ్చుకొని వెళ్ళి అక్కడ వదలి పెట్టాడు. ఇదిచూచి యీ పిశాచం యెక్కడనుండి వచ్చిందని అందరూ భయపడ్డారు. చంపమాత్రం భోరున యేడ్చింది. కాని తేజసింహుడు మాత్రం వెంటనే లేచి వీరేంద్రుని చెయ్యి పట్టుకొని "త్వరగా లేచి నడువు. ఇక మనం యిక్కడ వుండగూడదు" అన్నాడు. చంద్రకాంత దిక్కుగా తిరిగి "మేము త్వరగా వెళ్ళే యేర్పాట్లు నువ్వేమీ చెయ్యకు. మహారాజు వచ్చేసరికి మీరంతా యిప్పుడు కూర్చున్నట్లుగానే కూర్చొని వుండండి" అని ఆజ్ఞాపించాడు.

"ఇంత త్వరపడాల్సిన అవసరం యిప్పుడేమొచ్చింది, అసలిప్పుడు వచ్చే వాడెవ్వడు?" అని ప్రశ్నించింది చంద్రకాంత.

"ఇప్పుడు మాట్లాడటానికికూడా అవకాశంలేదు" అని తేజసింహుడు వీరేంద్రుని వెంట తీసుకొని తాడు సహాయంలో బయటికి వెళ్ళిపోయాడు.

వీరేంద్రుడు యీ విధంగా వెళ్ళిపోవటం చంద్రకాంతకు ఏమంతసుఖప్రదమనిపించలేదు. "ఏమిటీ విచిత్రం. ఆ పిశాచాన్ని

చూసి నా గుండెలు అదిరిపోయాయి. ఏమిటిదంతా? మీ కైనా తెలిసిందా ?" అని దుఃఖపూరిత నయనాలతో చపలను ప్రశ్నించింది.

"నాకూ సరిగా తెలియటంలేదు. వీరేంద్రసింహుడు యిక్కడకు వచ్చాడన్న వార్త మహారాజుకి తెలిసింది ఆయ యిక్కడకు వస్తున్నాడని మాత్రంవూహించాను" అన్నదిచపల.

"మాయగాళ్ళతో నాకేమి శత్రుత్వమో తెలియకుండా వుంది" అన్నది చంప.

ఇదేవిధంగా కొంతసేపు ఆశ్చర్యకరమైన సంఘటనని గురించి చెప్పుకోవటం జరిగింది. ఇంతలో వనం నాలుగు దిక్కులా మనుష్యులు ముట్టడించిన చప్పుడైంది. చపల "మనల్ని సైనికులు ముట్టడించార"ని అన్నదో లేదో ఎదురుగా మహారాజు రానే వచ్చాడు. ఆయనను చూడటంతోటే అందరూ లేచి నిలబడ్డారు. చంద్రకాంత ముందుకు వెళ్ళి తండ్రి గారికి పాదాభివందనంచేసి "ఈ సమయంలో మీ రిక్కడ..." అని మౌనం ధరించింది.

"యేమీలేదు. నిన్ను చూచి పోవాలనే కుతూహలంతో వచ్చాను. ఇక నువ్వు ఇంట్లోకి రా. ఇక్కడెందుకు ? పైన మంచుపడుతుంటే ! ఆరోగ్యం పాడవదూ?" అంటూ మహారాజు రాజమహలు దిక్కుగా వెళ్ళాడు. అందరూ మహారాజును అనుసరించారు. జయసింహుడు/ తన గదిలో ప్రవేశించి సిగ్గుతో "నా అమాయకమైన బిడ్డపై ఈ క్రూరసింహుడు అభాండాలు ఎందుకు వేస్తున్నాడో అర్థంకాకుండా వుంది. వాడి మనస్సులో యేదో దుర్బుద్ధి

వుండివుండాలి. అనవసరంగా అపవాదులు సాగించాడు. ఈ సంగతి అమ్మాయికి తెలిస్తే యేమనుకుంటుంది! ఇటువంటి నీచుడిముఖంకూడా చూడకూడదు. ఇటువంటిపనులు తిరిగి యెప్పటికీ చెయ్యకుండా శిక్షించటంకూడా అవసరం" అని తనలో అనుకొని వెంటనే హరిసింహుడనే కావలావాణ్ణి పిలిచి క్రూరసింహుని హాజరుపెట్టవలసిందిగా ఆజ్ఞాపించాడు.

హరిసింహుడు క్రూరసింహుని వెతుక్కుంటూ చివరికి తోటలో సైనికులతో కలసి కులాసాగా వుండగా చూచాడు. అతని దగ్గరకు వెళ్ళి 'మహారాజు పిలుస్తున్నార'ని చెప్పాడు. క్రూరసింహుడు అదిరిపడి "దొంగ దొరకలేదా యేమిటి? నన్నెందుకు పిలవటం? నాముందేగదా రాజు మహాలులోనికి వెళ్లాడు. అయినా యేమి చేస్తున్నారు?" అని ప్రశ్నించాడు.

ఇప్పుడే వచ్చారు. చాలా కోపంగా వున్నారు. మిమ్మల్ని తీసుకురమ్మని ఆజ్ఞాపించారు." అని సమాధానం చెప్పాడాతడు.

క్రూరసింహుడు వణకుతూ హరిసింహునివెంట మహారాజు వద్దకు వెళ్ళాడు.

"యేరా క్రూరా! అమాయకురాలైన చంద్రకాంత మీద నీలాపనిందలు మోపటమేనా నీపని. తోటముట్టడించిన యింతమంది మనుష్యులు యేమనుకుంటారనే బుద్ధికూడా నీకు లేదా? వీరేంద్రుడున్నాడని అబద్ధాలు యెందుకు కూశావురా చవటా!" అని మహారాజు క్రూరసింహుణ్ణి నానాతిట్లు తిట్టాడు.

మనం ప్రశ్నించామంటే అతడు యిట్టే చెప్పగలడు. ఆయన కొన్నాళ్ళపాటు యిక్కడకొచ్చి మీకు సహాయం చేస్తే మీ పని తేలిగ్గా అవుతుంది. చునార్‌గఢ పెద్దగా దూరం కూడా లేదు. యిద్దరం వెళ్ళి ఆయన్నిక్కడకు తీసుకొద్దాం.”

క్రూరసింహుడు వడిగల రెండు గుర్రాల్ని తెప్పించి డబ్బు బాగా చేత పుచ్చుకుని నాజీను తీసుకొని చునారగఢకు పయనమై వెళ్ళాడు. రాజుగారు కబురంపిస్తే జబ్బుతో పడివున్నారని చెప్పేట్టు యింటిదగ్గర యేర్పాటు చేశాడు.

# 9

వీరేంద్రుడు, తేజసింహుడు తోటనుంచి బయటపడి డేరాల దిక్కుగా వెళ్ళారు. మకాంకు చేరుకునేసరికి అర్థరాత్రి యింది. వీరేంద్రసింహుని డేరాలో వుంచి వెంటనే తేజసింహుడు అహ్మద్ వేషం వేసుకొని క్రూరసింహుని యింటికి చేరుకున్నాడు. అప్పటికే క్రూరుడు చునారగఢకు వెళ్ళిపోయాడు. జాగ్రత్తకోసం యింటివద్ద వుంచిన మనుష్యులు అహ్మద్‌ను చూచి ఆశ్చర్యపడి “అహ్మద్ యిన్నాళ్ళటినుంచి యెక్కడున్నావ్?” అని అడిగారు.

“యెక్కడికో ఒక చోటుకి వెళ్ళాగాని క్రూరసింహుడు యెక్కడున్నాడో చెప్పండి?” అని అహ్మద్ ప్రశ్నించాడు.

అక్కడివారు సంగతులన్నీ చెప్పి “నువ్వూ చునారగఢకు వెళ్ళు” అని ప్రోత్సహించారు.

'సరే'నని చెప్పి మాయారూపంతోనున్న తేజసింహుడు తిన్నగా మకాంలోనికివచ్చి విషయాలన్నీ వీరేంద్రునికి తెలియ జేశాడు. తెల్లవారిన తర్వాత తేజసింహుడు నెత్తిముండనం చేయించుకొని ముఖంమీద దుమ్ము జల్లుకొని గోలపెట్టు కుంటూ విజయగఢ దర్బారులో ప్రవేశించాడు. అతని ఆకారాన్ని చూచి జయసింహ మహారాజు ఎవరో; ఏమిటో కనుక్కోమని ఆజ్ఞాపించాడు.

"అయ్యా! నేను రామలాల్ అనే క్రూరసింహుని నౌకరుని, క్రూరసింహుడు మీ మీద కోపంతో చునారగఢ మహారాజు ఆశ్రయానికి వెళ్ళాడు. ఎంత చెప్పినా వినకుండా మీ తప్పూ పులుసూయిన్నాళ్ళుతిని అక్కడికి చేరాడు. అడ్డగించినదానికి ప్రతిఫలంగా నన్నునాలుగుతన్ని నాదగ్గరున్న వన్నీ వూడుచుకొనిపోయాడు. నాకిప్పుడు తిండానికన్నా దిక్కులేకుండాపోయింది. నాకిక మీరేదిక్కు" అని అన్నాడు తేజసింహుడు.

అందరూ తేజసింహుణ్ణి ఓదార్చారు. రాజుగారు మండి పడ్డాడు. క్రూరసింహుడు ఎక్కడికి వెళ్ళాడో తెలుసుకొని రమ్మని వెంటనే కబురంపించాడు. 'జబ్బుపడ్డాడ'ని కబురొ చ్చింది. దానిమీదట తేజసింహుడు అంతా అబద్ధం మహా రాజా! మీకు మహమ్మదీయులంతా వ్యతిరేకులు. ఇంకెవరి నైనా పంపండ'ని విన్నవించాడు. రాజు ఈసారి ఆస్థానపండితు డొకణ్ణి పంపాడు. అతడు తిరిగివచ్చి 'మహారాజా! క్రూరుడు యింట్లోమాత్రంలేడు. ఎక్కడికి వెళ్ళాడో యెవ్వరూ చెప్పటం లేదు." అని చెప్పాడు. అయితే వాడు "తప్పక చునారగఢకే

వెళ్ళి వుంటాడనుకొని రాజు క్రూరసింహుని కావలావాడి నౌకరని తప్పించాడు. ఆ కావలావాడిని చావదన్నగా వాడు క్రూరసింహుడు చునారగఢకు వెళ్ళాడని చెప్పాడు.

జయసింహా మహారాజు మండిపడి ఈ విధంగా ఆజ్ఞాపత్రాన్ని జారీచేశాడు.

1. ఒక గంటలోపల క్రూరసింహుని యింట్లో స్త్రీ పురుషులు రాజ్యం విడిచిపెట్టి వెళ్ళిపోవాలి.

2. అతని యిల్లు లూటీ చేయాలి.

3. అతని సంపద రాంలాల్ ఒక్కడూ మోసుకొని పోగలిగినంత మోసుకుపోనిచ్చి మిగతాది ఖజానాలో జమ కట్టాలి.

4. రాంలాలు అంగీకరిస్తే నౌకరీ లభిస్తుంది.

రాజాజ్ఞ జారీ కాగానే ముందుగా రాంలాల్ క్రూరసింహుని యింటికి వచ్చాడు. అక్కడివారు ముందుగా అతణ్ణి మోయగలిగినంత డబ్బును తీసుకోమన్నారు. అతడు ఆశకొద్దీ పదివేల మొహరీలను మోసుకొని దారిపట్టాడు. అతని ఆశ చూచి నవ్వుకున్నారు.

క్రూరసింహుని యిల్లు లూటీ చేయబడింది. అతని పరివారమంతా విలపిస్తూ నెత్తిన కొంగువేసుకొని చునారగఢకు వెళ్ళారు.

తేజసింహుడు తిరిగి దేవేంద్రుని దగ్గరకు చేరుకున్నాడు. తాను చేసిన పనంతా చెప్పి పదివేల మొహరీలు రాజకుమారుని ముందుంచాడు. రాజకుమారుడు సంతోషంతో తన చేతి వజ్రపుటుంగరాన్ని తేజసింహునికి బహుమానంగా యిచ్చాడు.

తేజసింహుడు రాజకుమారుని దీవించి "ఇక మనయింటికి వెళ్ళి పోదాం. అక్కడనుంచి నేను చునార్ గఢకు వెళ్ళాలి." అన్నాడు.

## 10

క్రూరసింహుని దుర్వస్థలగాథ రాజ్యమంతా వ్యాపించింది. అంతఃపురంలో స్త్రీజనమంతా ఎంతగానో సంతోషించారు. చంద్రకాంత తల్లియైన రత్నగర్భ ఆనందానికి అంతులేదు.

మహారాజుతో రాణీరత్నగర్భ "చంద్రకాంత పుట్టక ముందునుంచీ యిక్కడకు వచ్చి పోతూ వుండే వీరేంద్రుణ్ణి యిప్పుడు మీరు రానీకుండా యెందుకు చేశారు. మనఅమ్మాయి పుట్టిన తర్వాతకూడా అతడు చాలాకాలంవరకు వస్తూవుండే వాడు. కలిసి ఆడుకుంటూ వుండేవారు. అందుకే వీళ్ళిద్దరిమధ్య యింత ప్రగాఢ ప్రేమ యేర్పడింది. ఆరోజుల్లో మీరుకూడా సురేంద్రసింహునితో చాలఆదరంగా వుండేవారు. ఆయన మీరు చెప్పినట్లు వింటుండేవాడుకూడా. అప్పుడు మీరు చంద్రకాంతను వీరేంద్రునికిచ్చి వివాహం చేస్తాననికూడా అన్నారు. మీఅభిప్రాయాన్ని క్రూరసింహుడు చాడీలు చెప్పి చెడగొట్టాడు." అని అన్నది.

"రాణీ! వీరేంద్రునిపై ద్వేషం కలగటానికి కారణ మేమిటో యిప్పుడు నాకు తెలిసివచ్చింది. అంతా ఆ శనిగాడే చేశాడు" అన్నాడు రాజు.

"చూడండి! వాడు చునార్‌గఢకు వెళ్ళి యేంచేస్తాడో! శివదత్త సింహుని మనమీాదకు రెచ్చగొడతాడు." అన్నది రాణి.

"చూద్దాం! అన్నిటికీ ఆపరమేశ్వరుడే వున్నాడు. ఆదుష్టుడు నీవు చెప్పినట్లుగానే యేదో ఒక పితలాటం లేకుండా వూరుకోడు." అన్నాడు మహారాజు.

జయసింహ మహారాజుకిప్పుడు యెవరిని మంత్రిని చేసుకుందామా అనే విచారం పట్టుకుంది. మంత్రిలేకుండా రాజవ్యవహారాలు కొనసాగేటట్టు లేవు. చివరికి ఉపమంత్రిగా వున్న హారిదయాళసింహుని మంత్రిగా నియోగించాడు. హారిదయాళుడు విశ్వాసపాత్రుడేగాక దయాంతరంగుడు; ఎవరినీ ఇంతవరకు బాధించి యెరుగడు.

# 11

క్రూరసింహునికి వీరేంద్రసింహుని తేజసింహుని హాత మార్చి నాగఢ రాజ్యాన్ని సర్వవిధ్వంసం చెయ్యాలనే పట్టుదల హెచ్చింది. నాజింతో కలిసి చునార్‌గఢ ప్రవేశించి శివదత్త సింహుని దర్శనం చేసుకున్నాడు. "విశేషాలు ఒంటరిగా మనవిచేస్తాన"ని రాజుతో చెప్పాడు.

ఏకాంతంగా రాజు క్రూరసింహుణ్ణి పిలిచి విశేషాలు అడిగాడు. క్రూరుడు జయసింహమహారాజుమీాద అంతులేనన్ని చాడీలుచెప్పి "మహమ్మదీయులందరూ యిప్పుడు మన పక్షానే వున్నారు. విజయగఢను ఆక్రమించుకోవటం చాల

తేలిక. అదీగాక జగదేక సుందరియైన చంద్రకాంత మీకు దక్కగలదని" ఆశపెట్టాడు. శివదత్తుడు క్రూరుని మాటలన్నీ నమ్మాడు. కాని "ఇంతతొందరగా యుద్ధానికి దిగవద్దు. మొదట మంత్రగాళ్ళతో పని ప్రారంభిద్దాం. నువ్వు జగన్నాథ పండితుణ్ణి, నలుగురు మంత్రగాళ్ళను వెంటబెట్టుకొని విజయగఢకు వెళ్ళు. అక్కడ వాళ్ళుచేసే చిత్రవిచిత్రాలు చూడు—అవసరమైతే సైన్యాన్ని తీసుకొని వస్తాను. అని సలహా యిచ్చాడు. ఆప్రకారం శివదత్తుడు బదరీనాథ పండితుడు, పన్నాలాల్, రాంనారాయణ, భగవాన్‌దత్త అనే మంత్రగాళ్ళను క్రూరసింహునికి అప్పగించాడు.

ఇంతలో పహరావాడొచ్చి "రాజా! క్రూరసింహుని పరివారమొచ్చి ద్వారందగ్గర నిలబడింది. యేమి ఆజ్ఞ" అని నిలబడ్డాడు.

శివదత్తుడు అందరినీ లోనికి తీసుకువచ్చాడు. వాళ్ళు అక్కడ జరిగిన విశేషాలన్నీ చెప్పారు. క్రూరసింహునికి ప్రాణం లేచిపోయినంత పనైంది. అహ్మాద్ మీతోపాటు వచ్చాడా? " అని ప్రశ్నించాడు శివదత్తుడు. "అహ్మాదు ఎక్కడున్నాడు? " అన్నాడు నాజిం.

" అరే! అక్కడకువచ్చి మీదగ్గరకు వెడతానని చెప్పాడే? " అన్నారు నాజిం పరివారం.

" నిజంగానా? ఐతే వాడు తప్పకుండా తేజసింహుడై వుంటాడు. వాడే వెళ్ళి రాజుగారికికూడా చెప్పియుండాలి. యీకుతంత్రమంతా వాడిదే " అన్నాడు నాజిం. క్రూరసింహుడు కుమిలి కుమిలి యేడ్వసాగాడు. శివదత్తుడు వోదార్చి

"నేను దీనికి ప్రతీకారము చేస్తాలే. నీవిక్కడే వుండు." అని వాగ్దానం చేశాడు.

కొన్నాళ్ళు గడచిన తర్వాత కుమారసింహుడు విజయ గఢ వెళతానని మహారాజుతో చెప్పాడు. రాజు ఏర్పాటుచేయ టానికిమనుష్యులను పంపించాడు. వాళ్ళవెంట జగన్నాథపండితు నితోసహా అనేకమందిమంత్రగాళ్ళు తంత్రగాళ్ళుతమతమమంత్ర సామగ్రితో బైలుదేరి వెళ్ళారు. వీరేంద్రుడు, తేజసింహుడు నాగడ కోట దాటి చంద్రప్రభా నదీతీరాన సహచరబృందంతో కూర్చునివున్నారు. రాజకుమారుడు వుదాసీనంగా వున్నాడు. శోభాయమానమైన ఆ ప్రకృతి వాతావరణం అతని వియోగ భారాన్ని మరింత హెచ్చించింది.

ఇంతలో ఒక కాషాయివస్త్రాలు ధరించిన, సాధువు తాంబురామీటుతూ నదీతీరాన కూర్చుని తత్వాలు పాడు తున్నాడు.

"కూ్రరుడు వెళ్ళెను చునారుకూ
తెచ్చెను నలుగుర జిత్తులమారులా
పండితుడొక్కడు వున్నాడూ,
బహునేర్పరిగాడతడూ
కూర్చున్నావేం కునికిపాట్లతో,
తెలివిగ బ్రతుకుము తప్పించుకొని"

యీ తత్వం తేజసింహుని చెవిని పడింది. అటు తిరిగి చూచాడు. సాధువు వీళ్ళదిక్కుకే తిరిగి పాడుతున్నాడు. అతడు తేజసింహునిచూచి పళ్ళికిలించి అక్కడనుంచి లేచి పోయాడు.

వీరేంద్రుడు చంద్రకాంతను ధ్యానిస్తూ కూర్చున్నాడు. అతడికి పాడినవాడెవడో కూడా తెలియలా. తేజసింహుడు భుజం పట్టుకొని "విన్నావా?" అన్నాడు. "లేదు." అన్నాడు వీరేంద్రుడు. "చెప్తాను లే" అని తేజసింహుడు వీరేంద్రుని వెంటబెట్టుకొని ఇంటికివచ్చాడు.

యిద్దరూ ఒక గదిలో కూర్చున్నారు. తేజసింహుడు "క్రూరసింహుడు శివదత్తుని సహాయంకోసం వెళ్ళాడు నీకు తెలుసుగా? వాడక్కడకు వెళ్ళిన కారణం చెప్పతాను విను. వాడక్కడ ఒక జ్యోతిష్యుని కలుసుకు మంత్రగాళ్ళను సంపాయించాడు. వాళ్ళు చాలా ఉద్దండులు. నాజిం కూడా వాళ్ళ వెంటవున్నాడు. మనమిప్పుడు సావధానచిత్తులమై వుండాలి. యిక నేను యిప్పుడు కార్యక్రమం ప్రారంభిస్తాను... వాళ్ళ ముఠాలోనుంచి మనవైపుకు తప్పకుండా ఒకడు వస్తాడు. వాడు నిన్ను బంధించాలని ప్రయత్నిస్తాడు. మీరు అతి జాగ్రత్తగా వుండండి. నా వెంట వీడి మీరు ఎవరివెంటా వెళ్ళరాదు. ఎవరేమిచ్చినా తినకూడదు. పూల వాసన చూడకూడదు. వాళ్ళు నా వేషములో వచ్చినా రావచ్చు. నా కని గుడ్డుమీద ఒకమచ్చవుంది. దానినిబట్టి నన్ను గుర్తు తెలుసుకో. యీ రోజునుండి నేను మీదగ్గరకు వచ్చినప్పుడు నా కంట్లో మచ్చను దాచిపెట్టి మాట్లాడుతాను. కప్పివుచ్చి ఆ విధంగా చెయ్యకుండా ఎవరైనా వస్తే అందులో మోసం వుందని భావించుకోవాలి" అన్నాడు.

మంత్రి జామురాత్రి కాగానే తేజసింహుడు మంత్ర సామగ్రితో అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

# 13

పురుష వేషంలో చపల రహస్యాన్వేషణ కొరకు పట్ట ణం బయటికివచ్చింది. సగంరాత్రి గడచింది. ఆమెకు హఠా త్తుగా నాగథ వెళ్ళి తేజసింహునితో కలవాలని బుద్ధిపుట్టింది. ఆ ఉద్దేశంతోనే ఆమె నడక సాగించింది. అటునుంచి తేజ సింహుడు మామూలు రూపంతోనే విజయగఢ దిక్కుగా వస్తున్నాడు. తలవని తలంపుగా యిద్దరూ మధ్యదారిలో కలుసుకున్నారు. చపల స్త్రీకంఠంతో "ఎక్కడికి వెళు తున్నారు?" అనడిగింది.

తేజసింహుడు చపలను గుర్తుపట్టి "మంచి సమయానికి కనిపించావు. లేకపోతే నిన్ను కలుసుకోటానికి నానా అగ చాట్లుపడాల్సివచ్చేది. నీతో చాలా అవసరమైన పనివుంది; ఇటుకూర్చో" అన్నాడు.

ఇద్దరూ ఒకచోట కూర్చున్నారు. తేజసింహుడు క్రూరసింహుడు చునారగఢనుంచి ఒక జ్యోతిష్కునితోను, నలుగురు మంత్రగాళ్ళతోనూ బయలుదేరిన వృత్తాంతమంతా చెప్పి "మనిద్దరం యిప్పుడు జాగ్రత్తగా వుండకపోతే జయసిం హునికి అపాయం జరగటమే గాక చంద్రకాంత కూడా మనకు దక్కకుండా పోతుంది." అని హెచ్చరించాడు. చపల యేం చెయ్యమంటారని ప్రశ్నించింది. తేజసింహుడు "నేను మీా కొత్తమంత్రియైన హరిదయాళ సింహుని పట్టుకొని అతని స్థానంలో నేను మంత్రిగా చెలామణీ అవుతా. నేనుమంత్రిగా వుండటంవల్ల అధికారమంతా నా చేతులో వుంటుంది. నువ్వ

జాగ్రత్తగా వుండి రోజుకు ఒక్కసారైనా పీలువాచుకొని నన్ను కలుసుకుంటూ వుండు. నేను మంత్రిగానే వుంటాను గనుక నన్ను కలుసుకోవటంకూడా అంత కష్టమైన పనికాదు. మామూలు వేషంలోనే మంత్రిగారింటికి వస్తూవుండు. నేను మంత్రిగా వుంటాను" అని చెప్పాడు.

ఇంకా అనేక విషయాలు తేజసింహుడు చపలకు చెప్పాడు. చపల విజయగఢకు వెళ్ళిపోయింది.

తేజసింహుడు ప్రాతఃకాలమయ్యేసరికి అత్తరుసాహెబ్‌గా మారి విజయగఢలో ప్రవేశించాడు. రోజంతా సంపన్నుల వెంట తిరిగి సాయంకాలానికి హారిదయాళుడు వుండే చోటుకు చేరాడు. మంత్రిగారు స్నేహితులతో కలిసి పొద్దు పుచ్చుతున్నాడు. తేజసింహుడు తనది లక్నో పట్టణమని ప్రసిద్ధిచెందిన అత్తరు పన్నీరు తయారుచేస్తానని చెప్పి మంత్రి గారికి మచ్చుకి కొంచెం వాసన చూపించాడు. మంత్రి తాను చూచి మిగతా మిత్రులకుకూడా వాసన చూపించాడు. వెంటనే అందరూ మూర్ఛిలి పడిపోయారు. తేజసింహుడు హారిదయాళ సింహుని మూటగట్టి ఎత్తుకొని పోయాడు.

త్వరత్వరగా నడిచి నడిచి తేజసింహుడు అహ్మద్‌ను దాచిపెట్టిన పర్వతగుహాదగ్గరకు చేరుకున్నాడు. హారదయాళుని కూడా ఆ గుహాలో పడేసి అతని మంత్రి దుస్తుల్ని, మొహరు గల ఉంగరాన్ని తీసుకొని బయటపడ్డాడు. అతనికి తిరిగి స్పృహ వచ్చేట్టు చెయ్యటంగాని కాలికి బేడీలు వెయ్యటంగాని చెయ్యలేదు. విజయగఢలో ప్రవేశించి మంత్రిగా రూపం మార్చుకొని మంత్రిగృహంలో ప్రవేశించాడు.

ఇక మంత్రిగారింట్లో హారదయాళుడు లేకపోవటం అందర్నీ ఆందోళన పరిచింది. రాత్రి పొద్దుపోయేవరకు మిత్రులకు తెలివి రాలేదు. తెలివి వచ్చిన మీదట అందరూ ఏం జరిగిందని ప్రశ్నించారు. వాళ్ళకు తెలిసినంతవరకూ చెప్పి మంత్రిగారు యేమైపోయిందీ తెలియదని తెల్లమొఖం వేశారు. మంత్రిపుంగవుని పరివారమంతా ఆ రాత్రంతా నిద్రాహారాలు మాని అంతా గాలించారు. చివరికి తెల్లవారింది. దూరాన్నుండి తేజసింహుని మంత్రి హారదయాళసింహుడు ఠీవిగా రావటాన్ని అందరూ గమనించి శాంతచిత్తులైనారు.

మంత్రిమిత్రులు మాండు మంత్రిని 'ఎక్కడికి వెళ్ళార'ని ప్రశ్నించారు.

"ఎక్కడికి వెళ్ళట మేమిటి? మనకు అత్తరు అమ్మటానికి వచ్చిన సాహెబ్ వట్టి మోసగాడు. అది తెలిసి నేను వాడి అత్తరు పరిగా వాసనైనా చూడలేదు. లేకపోతే నాకూడా మీగతే పట్టేది. మీరు పడిపోవటం గమనించి వాడి వెంటబడ్డా. వాడు దొరక్కుండా పోయాడు. రాత్రంతా నాకు వాడిని గాలించటంతోటే సరిపోయింది" అని సమాధానించాడు.

ఇంతలో లోపలనుండి దాసీలు భోజనానికి రావలసిందిగా కబురు తెచ్చారు. నిద్ర ముంచుకొస్తున్నదని చెప్పి ముందుగా మాయమంత్రి శయనగృహంలో ప్రవేశించాడు. మిత్రులు యెవరిదోవన వాళ్ళు వెళ్ళిపోయారు.

దర్బారు వేళకు తేజసింహుడు మంత్రిగా హాజరయ్యాడు. ఎవరూ అతన్ని గుర్తుపట్టలేదు. అందరూ శిరస్సులు వంచి ప్రణామం చేశారు. హరదయాళు మోస్తరుగానే మంత్రి వ్యవహారాలు దిద్దుకురావటం ప్రారంభించాడు. మహారాజు వేంచేసినతర్వాత "రాజా! శివదత్తుడు క్రూరసింహునికి సహాయపడినట్లు వేగులవాళ్ళు నా కందించారు. యిప్పుడు క్రూరుడు ఒక జ్యోతిష్కునితోను నలుగురు మంత్రగాళ్ళతోను రాజ్యంలో ప్రవేశించారు. మన మిప్పుడు చాలా జాగ్రత్తగా వుండాలి. మహమ్మదీయులు కూడా మనకు వ్యతిరేకు లయ్యారు. చూస్తే మనకు మంత్రగాళ్ళెవరూ లేనేలేరు. యే క్షణంలో రాజద్రోహం జరిగినా జరగవచ్చు" అని హెచ్చరిక చేశాడు.

"అవును; ముసల్మానులు మనకు వ్యతిరేకమైన సంగతి రుజువైంది. మీరిప్పుడు రక్షణ ఏర్పాట్లు యేంచేశారు?" మహారాజు ప్రశ్నించాడు.

ఇంతలో మంత్రి దృష్టి ఒక కావలావానిపై బడింది. అతడు చాటు చాటుగా ఇదంతా పరిశీలిస్తున్నాడు. వెంటనే అతణ్ణి పట్టుకోవలసిందిగా మంత్రి ఆజ్ఞాపించాడు. కాని కావలావాని వేషంలోవున్న ఆ మాయగాడు ఎవరికీ దొరక్కుండా పసిగట్టుకుని పోయాడు. మంత్రిగా తేజసింహుడు క్రిందికి దిగకూడదుగనుక హరదయాళసింహునిగానే నటించక తప్పలేదు.

"మహారాజా! ఇప్పుడే మీ కళ్ళముందు జరిగిన సంఘటనబట్టి నా అనుమానం నిజమేనని తేలింది" అన్నాడు మంత్రి. రాజు అంగీకార సూచకంగా తల వంకించి నాటి సభ చాలించి మంత్రిని తీసుకొని ఏకాంత చర్చలు ప్రారంభించాడు.

మంత్రి మహారాజు తనకు శివదత్తుడంటేవున్న భయాందోళనలన్నింటినీ వెలిబుచ్చి కర్తవ్యాన్ని ఆలోచించవలసిందిగా ప్రార్థించాడు.

"మహారాజా! మంత్రగాళ్ళను యెదుర్కొనటానికి మంత్రగాళ్ళే అవసరం. మన రాజ్యంలో మంత్రతంత్రాలు తెలిసినవాళ్ళెవరూ లేకుండా పోయారు. అందుచేత మీరిప్పుడు విశ్వాసపాత్రుడైన ఒకమంత్రగాడిని సంపాదించవలసివుంది. బహుశా మీకు తెలుసుననుకుంటాను. మంత్రి సురేంద్రసింహునికొడుకు తేజసింహుడు గొప్ప మంత్రగాడు. మీకు అభ్యంతరం లేకపోతే అతణ్ణి రప్పిస్తే అన్నివిధాల మంచిది. సురేంద్రసింహుడుకూడా మీరంటే అమితమైన భక్తిగలవాడు! వీరేంద్రుణ్ణి మీరు రానీయకపోయినా సురేంద్రుడు ఏమీ అనుకోని వుండడనే నే ననుకుంటున్నాను" అన్నాడు మంత్రి. మహారాజు కొంచెంసేపు ఆలోచించి "నీవు చెప్పినవన్నీ వాస్తవమే! అనవసరంగా విరోధాన్ని కొనితెచ్చుకున్నాను. ఇప్పుడు నేను మళ్ళీ సహాయము కోరాలంటే చాల సిగ్గుగా వుంది" అన్నాడు.

"జరిగిందేదో జరిగిపోయింది. యిప్పుడుమీరు వాటన్నిటిని తలచుకొని సందేహించవద్దు" అని మంత్రి రాజుగారికి అనేకవిధాల సురేంద్రసింహునితో మిత్రత్వానికి ప్రోత్సహించాడు. రాజు చివరికి ఒప్పుకున్నాడు.

"నాకు చాలా సంతోషంగా వుంది. నేనే స్వయంగా నాగధకు వెళ్తాను. మీరు మాత్రం మీ మొహరుతో సురేంద్రునికి ఒకఉత్తరం వ్రాసి యివ్వండి" అన్నాడు. జయసింహా మహారాజు ఆదేవిధంగా చేశాడు.

మంత్రి మహాశయుడు రాజుగారి దగ్గరనుండి శె...తీసు కొని యింటికివచ్చాడు. సాయంకాలం తనను కలుసుకోటా నికి వచ్చిన చపలతో విశేషాలన్నీ తెలియజేశాడు. చపల తేజ సింహుని బుద్ధిచాతుర్యాన్ని ఎంతగానో మెచ్చుకొని ఇక త్వర లోనే చంద్రకాంత, వీరేంద్రుల సమాగమం సిద్ధించగలదని ఆశించింది.

హరదయాళసింహుని వేషంలో వున్న తేజసింహుడు తన వేషం మార్చుకొని నౌగఢకు ప్రయాణమై వెళ్ళాడు.

# 14

నౌగఢ, విజయగఢ రాజ్యాలు రెండూ పర్వత ప్రాం తాలు. దట్టమైన అడవులతో నిండివున్నాయి. ఈ ప్రాంతాల్లో చంద్రప్రభ, కర్మనాశ అను రెండునదులు ప్రవహిస్తున్నాయి. ఈ నదీ ప్రవాహప్రాంతాలు మరింత గట్టమైనఅడవులతో నిండి వున్నాయి. అనేక వృక్షజాతులతో ఈఘోరారణ్యాలు క్రూర మృగాలను తమ గర్భంలో దాచుకొని ఘూర్జిల్లుతుంటాయి. గ్రామసీమలన్నీ దారీ డొంకా లేక ప్రయాణీకులకు అనేక చిక్కులు తెస్తుంటాయి. కాలు కదిపి ప్రయాణం ప్రారం భిస్తే చాలు అడుగడుగున వాగులు అడ్డుతగులుతూ వుంటాయి. పర్వతాలనిండా భయానకమైన గుహలు నోళ్ళు తెరుచుకొని మృత్యుముఖా లన్నట్లుగా కనిపిస్తూంటాయి.

చునార్ గఢనుండి బయలుదేరిన నాజిం, క్రూరసింహుల ముఠా నిర్జన పర్వతప్రాంతంలో విడిదిచేశారు. ఎవరికి వారు మాయారాజ్యాన్ని ప్రయోగించటానికి వెళ్ళినా అవసరం

కలిగినప్పుడు అడవిలో ఢంకా మ్రోగించి అక్కడకు అందరూ చేరుకోవాలని సంకేతం యేర్పాటుచేసుకున్నారు. మాయల ముఠాలో అందరికంటె చతురుడైన బదరీనాథుడు ముందుగా అందరినీ రాజాంతఃపురంలో ప్రవేశించి అక్కడ ప్రతివిష యాన్ని జాగ్రత్తగా పరిశీలించి రావలసిందిగా ఆజ్ఞాపించాడు. ఆ విధంగా అందరూ పలువేషాలు వేసుకొని కోటలో ప్రవేశించారు. వీరందరికీ నాజిం అక్కడి విశేషాలన్నీ వివరంగా తెలియచేశాడు.

చివరికి అందరూ తిరిగి కలుసుకొని యెవరెవరు యే పని చెయ్యాలో నిర్ణయించుకొన్నారు. భగవానదత్తుడు చపల వేషం వేసుకొని నాగధలోని వీరేంద్రుని మోసం చేయుటానికి బయలుదేరాడు. వీరేంద్రుని ద్వారంముందు నిలిచి కాపాలవానితో "రాజకుమారునికి విజయగఢనుంచి చపల వచ్చిందని తెలియజెయ్యి" మని చెప్పాడు. అతడు వెళ్ళి వీరేంద్రునికి యీ సంగతి చెప్పగా చంద్రకాంతను ధ్యానిస్తూ కూర్చున్న వీరేంద్రుడు సంతోషపడి "వెంటనే లోపల ప్రవేశ పెట్టుమ"ని ఆజ్ఞాపించాడు.

మాయాచపల లోన ప్రవేశించింది. రాజకుమారుడు సాదరంగా ఆమెను చెంత కూర్చోపెట్టుకొని మాట్లాడ సాగాడు. చంద్రకాంత యోగక్షేమాలు అడిగి తెలుసుకున్నాడు. "మీధ్యానంతప్ప ఆమెకు యితరమైన ధ్యాస లేమీ లేవు. చచ్చిందీ, బ్రతికిందీ కూడా మీరెప్పుడూ తెలుసుకోవాలని పిస్తూ వుంటుంది. వుండలేక యివాళ నన్ను పంపించింది. ఇదుగో చంద్రకాంత స్వయంగా తన చేతిలో

పనసపండు ఒలిచి తొనలు పంపించింది. వీటిని మీరు తప్పకుండా తినాలని ఒట్టేసుకుంది." అని చెప్పింది చపల.

వీరేంద్రుడికి చంద్రకాంతిమీది వ్యామోహం బాగా తలకెక్కివున్న కారణంగా వెనకా ముందూ ఆలోచించకుండానే పనసతొన నోటికి అందిచబోయేసరికి ఎదురుగా తేజసింహుడు రావటం చూచాడు. తేజసింహుడు వీరేంద్రుని ప్రక్కగా చపల కూర్చొని వుండటమూ, పక్కనే పనస తొనలు వుండటమూ గమనించి వెంటనే "ఆగు, నోట్లో వేసుకోకు" అని వారించాడు.

ఆమాటవిని వీరేంద్రుడు ఆగి ఎందుకు అని ప్రశ్నించాడు.

"ఎందుకేమిటి? నేను వెళ్ళేప్పుడు నీకెన్నివిధాల చెప్పినా గుడ్డిగా మంత్రగాళ్ళచేతుల్లో చిక్కుకొని పోతావు. చపల యెన్నడైనా యిక్కడకు వచ్చిందా? ఈమె నిజమైన చపల అవునో కాదో ఆలోచించావా?" అని అన్నాడు తేజసింహుడు.

తేజసింహుని మాటలు విని తెలివితెచ్చుకున్న వీరేంద్రుడు చపల దిక్కుగా చూచాడు. చపల తన సంగతి బయట పడిపోయిందని తెలుసుకొని వెంటనే చూరకత్తి తీసి తేజసింహుని మీదికి వురికింది. వీరేంద్రుడు వెంటనే మాయగాడి చూరకత్తి వున్న చెయ్యిని గట్టిగా పట్టుకొని బొడ్లో చెయ్యివేసి ఎత్తి పట్టాడు.

"నేలకేసికొట్టేవు. చచ్చిపోతాడు. మాయలవాళ్ళ వృత్తే యిదిగా! అని తేజసింహుడు వారించాడు.

వీరేంద్రుడు భగవానదత్తుని క్రిందికి దించాడు. తేజసింహుడు అతనికి మత్తుమందు వాసనచూపి దుప్పటిలో మూటగట్టి ఒక ప్రక్కనబెట్టి విశేషాలు చెప్పసాగాడు. వీరేంద్రునికి జయసింహ మహారాజు సురేంద్రసింహ మహారాజుపేర వ్రాసిన ఉత్తరం చూపించాడు. వీరేంద్రుడు చాలా సంతోషించి తేజసింహుని తన హృదయానికి హత్తుకున్నాడు.

తేజసింహుడు ఆ రాత్రి అక్కడేవుండి మరునాటి వుదయం మాత్రగాణ్ణి కట్టిన మూట భుజాన వేసుకొని గుహలోకి వెళ్ళాడు. అక్కడ అహ్మద్ నేలయేటి ఒడ్డున నిద్రపోతున్నాడు హారదయాళసింహుడు మాత్రం ఒక రాతిమీద కూర్చొని ఆలోచిస్తున్నాడు.

హారదయాళుడు తేజసింహుని చూచి "తేజసింహా! నేను నీకేమి అపకారము చేశానని నువ్వు నన్ను ఖైదీ చేశావు?" అనడిగాడు.

తేజసింహుడు నవ్వి "నువ్వు నేరస్థుడవే గనక అయితే అహ్మద్‌కు వేసినట్లే నీకూ బేడీలు వేసేవాడు. కాని నువ్వు నిర్దోషివి. అయినా నిన్నొక్కరోజు నిర్బంధించడంవల్ల నాకు కొన్నిపనులు పూర్తవుతాయని నీకపకారం తలపెట్టాను. క్షమించు. ఈవేళ నిన్ను విడిచిపెడుతున్నాను. విజయగఢ మొత్తంమీద పెద్ద మనుష్యులైన మీ సహాయం నేనెప్పుడూ అభిలషిస్తాను." అన్నాడు.

"నీకు తెలుసుగదా నేనెవరిపక్షమయింది. నేనెప్పుడూ మీ యిద్దరి క్షేమాన్నే కోరుకునేవాణ్ణి. అయినా నన్నిక్కడ యెవరు బంధించారో తెలియక మొదట తికమక పడ్డాను.

అహ్మాద్‌ను చూచినతర్వాత ఇది నీ పనే అనుకున్నాను. అది సరేగాని, సన్నిక్కడ బంధించి వుంచడంవల్ల నీ పనులేమయి నవో చెప్పు" అని మంత్రి అన్నాడు.

"నేను మీ వేషం వేసుకొని...మీ అంతఃపురంలో మాత్రం ప్రవేశించలేదు." ముందుగా ఈ విషయం మంచిదని తెలియజేశాడు తేజసింహుడు.

"నా బిడ్డడివిగా చూచుకునే నువ్వు మా అంతఃపురం లోకి వెళితేమాత్రంమేం! అసలు సంగతిచెప్పు" అన్నాడు మంత్రి.

తేజసింహుడు జయసింహ మహారాజు వ్రాసిన ఉత్తరాన్ని చూపించి తాను ధరించిన మంత్రిదుస్తుల్ని తిరిగి అతని కిచ్చేవేశాడు. మీరు ఈ దుస్తుల్ని ధరించి మా రాజుగారి దగ్గరకువెళ్ళి ఈ ఉత్తరాన్ని చూపించి నన్ను పంపించవలసిందిగా కోరండి. అప్పుడు నేను మీ వెంట వస్తాను. లేకపోతే చునారగఢనుండి వచ్చిన ముశా విజయగఢ రాజ్యాన్ని విధ్వంస్వంచేసి శివదత్త సింహుడు ఆ స్థానాన్ని ఆక్రమించుకుంటాడు. నేను మీవెంట వచ్చి శత్రువుల్ని హతమారుస్తాను. మీరుమాత్రం మహమ్మదీయులను దూరంగావుంచి హిందువుల్ని దగ్గరకుతీయండి. మా రాజకుమారుని గుర్తుంచుకొని మీ మహారాజువద్ద అతన్నిగురించిన ప్రశంశావాక్యాలు పలుకండి. ఆవిధంగా జేస్తే వీరేంద్రుడుకూడా ఒకనాడు మీ సహాయం ఆర్థించే అవకాశముంటుంది.

హారదయాళసింహుడు తేజసింహుడు చెప్పినవన్ని చేస్తానని ప్రమాణం చేశాడు.

తేజసింహుడు తాను తెచ్చిన మూటవిప్పి అందులోని భగవానదత్తునికి కాళ్ళకు బేడీలు వేసి స్పృహ తెప్పించి వదలి పెట్టాడు. చుగారుగఢనుంచి వచ్చిన మంత్రగాళ్ళందరూ తేజసింహునికి తెలుసు. తేజసింహుడుకూడా వాళ్ళను తెలుసు.

తేజసింహుడు హారదయాళుని తీసుకొని రాతిద్వారం దగ్గరకు వచ్చాడు. అక్కడ "దయచేసి మిమ్మల్ని స్పృహ తప్పి పోయేట్లుగా నన్ను చేయనియ్యండి. బైటకు వెళ్ళిపోయిన తర్వాత స్పృహ తెప్పిస్తాను" అని తేజసింహుడు హారదయాళుని కోరాడు. అందుకు అతడు సమ్మతించాడు. తేజసింహుడు అతడు చెప్పిన విధంగా హారదయాళుని బయటికి తీసుకొచ్చాడు.

రాజధాని చేరుకున్న హారదయాళుడు వంటరిగా సురేంద్రసింహుని దర్బారులోకి వెళ్ళాడు. రాజు అతన్ని గౌరవించి కుశలప్రశ్నలు వేసినమీదట జయసింహ మహారాజు రాసిన ఉత్తరం ఇచ్చాడు. ఆ వుత్తరం సురేంద్రసింహుడు తన మంత్రిచే చదివించి సంతోషించినవాడై హారదయాళునితో "వాస్తవానికి నా రాజ్యం మీరాజుగారిదే, నిరంభ్యంతరంగా తేజసింహుని తీసుకెళ్ళవచ్చు" అని సెలవిచ్చాడు. మూడు రోజులపాటు హారదయాళుడు రాజధానిలో వుండి నాల్గవనాడు మహారాజు యిచ్చిన కానుకలతో తేజసింహుని తీసుకొని పయనమై వెళ్ళాడు.

విజయగఢ చేరుకున్న మీదట జయసింహుడు సురేంద్రసింహుని ఔదార్యానికి ఎంతో మెచ్చుకున్నాడు.

తేజసింహుణ్ణి సాదరంగా స్వీకరించాడు. ఇప్పుడు తేజసింహునికి విజయగఢ రాజ్యంలో హరదయాళునితో సరిసమానమైన గౌరవస్థానం లభించింది.

## 15

తేజసింహునికి శివదత్త సింహుని దగ్గరనున్న మంత్రగాళ్ళందరూ తెలుసు. అందులో ఇప్పుడు వచ్చిన నలుగురూ ఎవరెవరో తెలియలేదు. అందుచేత అతడు గుహలో బంధించిన భగవాన్‌దత్తుని వేషము వేసుకొని అడవిలో అటూ ఇటూ తిరుగుతున్నాడు. అతనికి ఎవ్వరూ కనిపించలేదు. చివరకతడు దగ్గరలో చెట్టుమీద కనిపించిన ఢంకా మ్రోగించాడు. ఆ ధ్వని విని ముగ్గురు మంత్రగాళ్ళు, జగన్నాథపండితుడు అక్కడికి వచ్చి చేరారు. వాడు భగవాన్‌దత్తుని చూచి "ఏమోయ్ నౌగఢ వెళ్ళలా! ఖాళీ చేతుల్తో వచ్చావే" అన్నాడు.

తేజసింహుడు ఆ వచ్చినవాళ్ళెవరో గుర్తుపట్టి "ఇప్పుడు తేజసింహునిముందు నా పప్పు లుడకలా. మీలో ఒకరు నా వెంట వస్తేగాని పని జరుగదు" అన్నాడు.

"సరే నేను నీ వెంట వస్తానులే. ఈ వేళటికి రాజమహాలుకు వెళ్ళి పని చూద్దాము రా!" అని అన్నాడు పన్నాలాల్.

"అట్లాగే వెళ్ళదాము కానీ ముందు నాకు ఆకలి వేస్తున్నదోయ్" అన్నాడు తేజసింహుడు.

"మత్తుమందు తప్ప మా దగ్గరేమీ లేదు. బజారు వెళ్ళి ఏమైనా తెచ్చావంటే అందరం తిందాం" అన్నాడు జ్యోతిష్యుడు.

"అయితే ఒకడు నా వెంట రండి" అని తేజసింహుడు పన్నాలాల్‌ను వెంటబెట్టుకొని బజారుకు వెళ్ళాడు. దోవలో పన్నాలాల్ "తేజసింహుడు యీ ప్రాంతంలోనే తిరుగుతున్నాడటగానీ, మనం వేషాలు మార్చుకుందాం" అన్నాడు.

తేజసింహుడు వేషం మారిస్తే తన బండారం కాస్తా బైటపడుతుందని "ఫర్వాలేదులేవోయ్ ఈ రాత్రిపూట ఎవరు కనబడతారు" అన్నాడు. వేషం మార్చటానికి శంకిస్తున్న భగవాన్ దత్తునిపై పన్నాలాలుకి అనుమానం కలిగింది. అతణ్ణి పరీక్షించాలని ప్రయత్నంచేశాడుగాని చీకట్లో అతని ప్రయత్నం నెరవేరలా. కాని అనుమానం మాత్రం పోలేదు. అతణ్ణి బెదిరించి నిజం తెలుసుకోవాలని బొడ్లోనుండి కత్తిదూశాడు. తేజసింహుడు వెంటనే గమనించి పన్నాలాలుని కదలకుండా పట్టుకొని బాగా తన్ని స్పృహతప్పేట్టు చేసి మూటగట్టుకొని పట్టణం దిక్కుగా వెళ్ళాడు. ఆ రాత్రి పన్నాలాలుని తన దగ్గర వుంచుకొని ఉదయం దర్బారుకి తీసుకొనివెళ్ళాడు.

ఇక్కడ రామనారాయణ, బదరీనాథ్, జగన్నాథసండితుడు బజారుకి వెళ్ళినవారికోసం ఎంతసేపు యెదురుచూచినా వాళ్ళజాడ కానరాలేదు. ఆ రాత్రి యెవరూ యేమీ చెయ్యలేదు. బహుశా యిద్దరూ పట్టుబడిపోయారేమోననుకొని ఉదయం వేషాలు మార్చి వెతకటానికి ప్రయాణమైనారు. మొట్టమొదట దర్బారుకి వెళ్ళారు. అక్కడ తేజసింహుడు దర్బారులోనికి వెళ్ళుతూ సిపాయిలతో పన్నా లాలుని తీసు

కొని వెళ్ళటం చూచారు. వాళ్ళుకూడా దర్బారులోనికి వెళ్ళారు.

తేజసింహుడు పన్నాలాలును రాజుగారిముందు నిల బెట్టి తాను కుర్చీలో కూర్చున్నాడు. రాజుగారు "ఎవరిని తీసుకొచ్చావ్" అని తేజసింహుని ప్రశ్నించాడు.

"రాజా! మనరాజ్యంలో తిరుగుతున్న మంత్రగాళ్ళల్లో ఒకణ్ణి పట్టుకొచ్చాను. మీ యిష్టమొచ్చిన శిక్ష చెప్పండి" అన్నాడు తేజసింహుడు.

మహారాజు తనదృష్టిని నేరస్థునిమీదికి మరల్చి 'నీ పేరేమిటి' అని ప్రశ్నించాడు. అందుకు సమాధానంగా 'మక్కార్ ఖాన్ అనే ఐయ్యార్ ఖాన్' అని చెప్పాడు. అతని సమాధానానికి రాజునవ్వి 'ఇతణ్ణి జైలుఖానాలో పెట్టి బంధించి గట్టి పహరా యివ్వండి' అని ఆజ్ఞాపించాడు. రాజాజ్ఞమేరకు భటులు పన్నాలాల్ని బంధించి జైలుఖానాకు తీసుకొని వెళ్ళారు. మహారాజు తేజసింహుని బుద్ధిచాతుర్యానికి మెచ్చు కొని నూరు బంగారునాణాలు బహుమానంగా యిచ్చాడు.

రాంనారాయణ, బదరీనాథుడు, జ్యోతిష పండితుడు వేషాలు మార్చి దర్బారులో ఈ తమాషా అంతా చూస్తూనే వున్నారు. పన్నాలాలుకి జైలుశిక్ష విధించబడిన తర్వాత ముగ్గురూ బయటకు వచ్చి ఒక యెత్తేశారు. బదరీనాథుడు తేజసింహుని వేషం వేసుకొని, మిగతా యిద్దరూ భటులుగా తయారై పన్నాలాలుని తీసుకొని వస్తున్న సిపాయిలకు యెదు రుగా వచ్చారు. తేజసింహుడు సిపాయిలతో "ఆగండి; ఈ మాయగాణ్ణి నాకు అప్పగించమని రాజుగారు తిరిగి మరొక

ఆజ్ఞను జారీచేశారు. వీడు ఖైదులో వుంటే అక్కడివారందర్నీ యేదో ఒక మాయచేసి పారిపోతాడు" అని అన్నాడు. భటులకు ఖైదీని పట్టుకొన్నది నిజానికి తేజసింహుడేనన్న సంగతి బాగా తెలుసు. అందుచేత పన్నాలాలుని అతనికి అప్పగించి పారవేశారు. మాయవేషంలో వున్న తేజసింహుడు పన్నాలాలుని తీసుకొని అడవిమార్గం పట్టాడు. భటులు ఈ సంగతి తెలియజేయటానికి తిరిగి దర్బారుకి వెళ్ళారు. అక్కడ తేజసింహుడు యథాస్థానంలో కూర్చొనివుండటం చూచి భటులు హడలిపోయారు. తేజసింహుడు భటులను చూచి ఖైదీని యేమి చేశారని గద్దించి అడిగాడు. భటులు వణుకుతూ 'స్వామీ! మీరేగదా విడిపించుకొని వెళ్ళారు' అన్నారు. 'నేను విడిపించుకొని వెళ్ళటమేమిటిరా; అప్పటినుంచి యిక్కడే కూర్చునివుంటేను!' అన్నాడు తేజసింహుడు. భటులు నిర్విణ్ణులై శిలా ప్రతిమల్లా నిలబడిపోయారు. మహారాజు తేజసింహుణ్ణి "యేం జరిగింద"ని ప్రశ్నించాడు.

"జరిగేదేముంది; మంత్రగాళ్ళు నా వేషం వేసుకొచ్చి ఖైదీని విడిపించుకొనిపోయారు" అన్నాడు తేజసింహుడు. దాని మీద రాజుగారికి తీవ్రమైన కోపంవచ్చింది. కాని తేజసింహుడు భటులదేమీ తప్పులేదని వారించాడు.

పన్నాలాలు ద్వారా విశేషాలన్నీ తెలుసుకొని భగవాన్ దత్తునికూడా తేజసింహుడే మాయచేసి వుంటాడని మాయల ముఠా ఒక నిశ్చయానికి వచ్చి "అతడెక్కడున్నాడో తెలియజేయవలసింది"గా జ్యోతిషపండితుణ్ణి ప్రశ్నించారు. జగన్నాథ పండితుడు గవ్వలు విసిరి యేదో గుణించి 'భగవాన్ దత్తుని ఉత్త

తంగా రెండు కోసుల దూరంలో వున్న కొండ గుహలో తేజసింహుడు బంధించి వున్నాడ'ని చెప్పాడు. అందరూ గుహ దిక్కుగా పయనమయ్యారు. పండితుని సూచనల మేరకు అందరూ గుహలో ప్రవేశించారు. వాళ్ళ యెదురుగా రాతి ద్వారం కనిపించింది. గాని దానిని తెరిచేవిధమేమిటో యెవరికీ అర్థంకాలేదు. జ్యోతిషపండితుడు తిరిగి గవ్వలువిసిరి ద్వారాన్ని తెరిచే మార్గాన్ని గురించి అనేక లెక్కలు వేశాడు గాని అతనికి మార్గమేదీ దొరకక 'ఇదేదో ఇంద్రజాలంతో కూడుకొని వుంది. దీన్ని తెరవటానికి యేదైనా మార్గం ఆలోచించాలి' అని చెప్పాడు. చేసేదేమీ లేక అందరూ వెనక్కి తిరిగివచ్చి ఆలోచనలో పడ్డారు.

## 16

రహస్యాన్వేషణ కొరకు తేజసింహుడు విజయగఢ నుండి బయటికి బయలుదేరి వెళ్ళాడు. అతడు చాలా దూరం వెళ్ళగా వెళ్ళగా అక్కడ వీరేంద్రుడు ఒక చెట్టుక్రింద కూర్చుని ఉండటం చూచాడు. అతనికి యెదురుగా ఒక చంపినదుప్పి వేయబడివుంది. ఒక పక్కగా నిప్పు రాజుతూవుంది.

వీరేంద్రుడు తేజసింహుని చూడగానే గట్టిగా పిలిచి దగ్గర కూర్చుండబెట్టుకున్నాడు. "విజయగఢలో యిన్నాళ్ళ నుంచి యేమిచేస్తున్నా"వని అడిగాడు.

"అక్కడ మీ పనే చేస్తున్నానయ్యా!" అన్నాడు తేజసింహుడు. "చంద్రకాంతను చూచావా ?" అని అడిగాడు వీరేంద్రుడు.

"ఎక్కడయ్యా! తీరికలేకుండా వుంది. ఈమధ్య ఒక మాయగాణ్ణి పట్టుకున్నాను. రాజుగారు వాడికి జైలుశిక్ష విధించారు. వాణ్ణి జైలుకు తీసుకుపోతున్న దారిలో ఎవడో నా వేషం వేసుకొచ్చి విడిపించుకొనిపోయాడు. అప్పటినుండి మళ్ళీ దొరకలేదు" అని చెప్పాడు.

"వాళ్ళా అసాధ్యులే!" అన్నాడు రాజకుమారుడు.

"ఇప్పటికి అయిందేదో అయిందిగాని మొత్తంమీద వాళ్ళల్లో బదరీనాథు డొక్కడే నన్నేమైనా చెయ్యగలిగితే చేసేది. అయితే నువ్విక్కడున్నావేమిటి? వెంటయెవరూ కూడా లేరల్లేవుంది!" అన్నాడు తేజసింహుడు.

"ఎందుకులేరూ! రావటానికి చాలామంది వచ్చారు. మధ్యాహ్నందాకా వేట జరగలేదు. అంతలో యీ దుప్పి కంటబడితే తరుముకుంటూ యిక్కడ కొచ్చాను. ఇక్కడ కొట్టగలిగా. ఆకలి బాగా వేస్తుంటే దీన్ని కాల్చుకుని తిందామని యిప్పుడే కూర్చున్నాను. అంతలో నువ్వొచ్చావు. మిగతావాళ్ళు ఎంతదూరాన వున్నారో తెలియటంలేదు. కానీ తిందాం" అన్నాడు రాజకుమారుడు,

ఇద్దరూ కులాసాగా దుప్పి మాంసాన్ని చక్కగా మసాలాతో కలిపి కాల్చుకొని తినటం ప్రారంభించారు. రాజకుమారుడు ఆకలిముఖాన యెక్కువగా తినలేకపోతున్నానని మసాలా తుడిచి కొద్దిగా తిన్నాడు. తేజసింహుడు మొహమాటం లేకుండా లగాయించాడు. యిద్దరూ సెలయేటి చల్లనినీళ్ళు తాగి నౌగఢకు ప్రయాణమై వెళ్ళారు.

కొంతదూరం వెళ్ళినతర్వాత తేజసింహుడు "ఎందుకో తల తిరుగుతోంది" అన్నాడు. "వేడి చేసిందల్లే వుందిలే" అన్నాడు రాజకుమారుడు. కొంతదూరం వెళ్ళి తేజసింహుడు క్రింద పడిపోయాడు. విజయసింహుడు ఆతురతగా తేజసింహుణ్ణి గుర్రంమీద వేసుకొని వాయువేగ మనోవేగంతో విజయ గఢకు చారిపట్టాడు. కొంతదూరంవెళ్ళి గట్టిగా బిగులు వూదాడు. క్షణకాలంలో క్రూరసింహుడు, పన్నాలాలు, రాంనారాయణ, జ్యోతిషపండితుడు వచ్చి చేరుకున్నారు. పన్నాలాలు సంతోషము పట్టలేక రాజకుమారుని వేషంలో వున్న బదరీనాథుని చాలా మెచ్చుకున్నాడు. బదరీనాథుడు మూట క్రిందకు దించి రాం నారాయణతో "నువ్వీ గుర్రాన్ని నాగఢకు తీసుకొని వెళ్ళి యెక్కడనుంచి దొంగిలించి తెచ్చావో అక్కడే కట్టేసిరా" అన్నాడు. బదరీనాథుడు తేజసింహుని కట్టినమూటను భుజాన వేసుకుని చునారగఢకు దారిపట్టాడు.

రెండుమూడు రోజులనుంచీ తేజసింహుడు దర్బారుకు హాజరు కాకపోవటం జయసింహ మహారాజుగమనించి మంత్రిని 'తేజసింహుడు కనిపించటం లేదేమ'ని అడిగాడు. మంత్రి "నాకున్నూ ఆర్థంగాకుండా వుంది" అని తేజసింహుని ఇంటికి వెళ్లాడు. అక్కడికివెళ్ళి విచారించగా భటులు– "మాకున్నూ తెలియదన్నారు."

తేజసింహు డంతర్ధానం కావడం హరదయాళునికి ఆందోళన కలిగించింది. అతడు అనేకమంది వేగులవారిని దేశం నలుమూలలకీ పంపించాడు. తాను స్వయంగా ఒక వుత్తరం వ్రాసి నౌగఢ రాజ్యానికి మంత్రి జీతసింహునికి వర్త

మానం పంపించాడు. దూతతో 'నీవు తిరుగు సమాధానాన్ని మహారాజు దర్బారుకు రావటానికి పూర్వమే తీసుకొని రావలసిందిగా' ఆజ్ఞాపించాడు. అతడు హుటాహుటిని నాగఢకు వెళ్ళి మంత్రి సత్తముని కలుసుకొని వృత్తాంతం అందించాడు. జీతసింహుడు లేఖనుచూచుకొని తేజసింహుడు తప్పకుండా మాయలవాళ్ళ చేతుల్లో చిక్కుకొని వుంటాడని భావించుకొన్నాడు. తిరుగు సమాధానంగా "అతడిక్కడ లేడు" అని వ్రాసి దూతను పంపించేశాడు. జీతసింహుడు గూఢచారులను పావించి తేజసింహుని అన్వేషించ, నాజ్ఞాపించాడు. మరునాడు సురేంద్రసింహ మహారాజుకి దర్బారులో తేజసింహుని విషాదవార్త నందించాడు.

తండ్రి ప్రక్కగా కూర్చొనివున్న వీరేంద్రుడు ప్రియ మిత్రుడు కానరాకపోవటం తెలుసుకొని తానుకూడా వెతకటానికి అనుజ్ఞ ఇయ్యవలసిందిగా ప్రార్థించాడు.

"రాజకుమారా! మీరు సమర్థులన్న విషయం నిర్వివాదం. అయితే మాయాజాలం తెలిసిన తేజసింహుని అపహరించినవారు తప్పకుండా మాయగాళ్ళే అయివుంటారు. మాయగాళ్ళెప్పుడూ తమ చేత జిక్కిన మాయగాడిని బంధిస్తారుగాని చంపరు. అందుచేత సమర్థుడైన మన తేజసింహుడు తన మాయాజాలంతో పదిపన్నెండురోజుల్లో తప్పించుకొని తప్పకుండా రాగలడు. అంతకూ రాకపోతే అప్పుడే చూచుకుందాం" అని మంత్రి రాజకుమారుని వారించాడు.

మహారాజు తేజసింహుని వెతకటానికి మంచియేర్పాట్లు చెయ్యమని చెప్పి నాటికి సభ చాలించాడు.

విజయగధలో మంత్రి నాగధలోకూడా తేజసింహుడు లేడని తెలుసుకొని చాలా విచారించాడు. జయసింహ మహారాజు తాన్నై తాను తన అవసరంకోసం సురేంద్రసింహ మహారాజు దగ్గరనుంచి రావించుకొన్న యువకుడు కనిపించకపోవటం సిగ్గుచేటుగా భావించి రాణీరత్నగర్భదగ్గర యెంతగానో విచారించాడు. అక్కడనుండి ఆవార్త చపల చెవినికూడా పడి తన ప్రియునికి పట్టిన దురవస్థకు తల్లడిల్లిపోయింది. ఆమె చంద్రకాంతదగ్గర తేజసింహుని అంతర్థానవార్తను విన్నవించి కన్నీరు మున్నీరుగా విలపించింది.

ఆమె దుఃఖాన్ని తెలుసుకున్న చంద్రకాంత తేజసింహునిపై ఆమెకుగల గాఢానురక్తిని అర్థంచేసుకుంది. చపల చంద్రకాంతను ప్రియాన్వేషణకై దేశాటన చేయటానికి సెలవిమ్మని కోరింది. చంద్రకాంత దానికిసమ్మతించి "నీవు చేసేపని కేవలం నీ స్వార్థమేకాక నా అవసరంకూడా ఉంది. ఎందుచేతనంటే తేజసింహుడు లేని నా ప్రియుడైన వీరేంద్రుని కలుసుకోవటం నాకుకూడా దుర్లభమే" అన్నది.

చపల తన మాయాజాలపు సామానులతో దాసీ ణాత్యులు ధరించే చీరలు నగలు ధరించి ప్రియాన్వేషణకు బయలుదేరి పోయింది. పోతూ "చంపవన్న రాజకుమారిని కంటికి రెప్పగా కాపాడవలసిందిగా" ఆజ్ఞాపించింది.



# 17

చపల అసాధారణమైన స్త్రీ. అసాధారణ సౌందర్యంతో బాటు ప్రజ్ఞా విశేషాలకుకూడా నిలయమైనట్టిది. ఇద్దరుముగ్గురు మనుషులను అవలీలగా ఎదుర్కొనగలదు. సమస్త శాస్త్రాలు ఆమెకు కంఠోపాఠాలు. మాయాజాలంలో అందెవేసినచేయి. నృత్య, నాట్య, సంగీతాలలో ప్రజ్ఞాధురీణ. ఆమె సాధారణంగా బయటికి వెళ్ళవలసివచ్చినపుడు తన సౌందర్యాన్ని అఘాత పరచుకునే వెళుతుంది. దానికి కారణం ఆమె సౌందర్యం జనసందోహాన్ని వెర్రులెత్తించటమే.

అది సాయంకాల సమయం. అప్పుడే సూర్యుడస్తాద్రిని చేరుకున్నాడు. మరొకవైపున చంద్రుడు తన చల్లని కిరణాలను ప్రసరింపజేయ సుద్యుక్తుడౌతున్నాడు. చపల మామూలు వేషంలోనే వెళుతోంది. మాంత్రిక సామగ్రి వున్న సంచి చంకనవేసుకొని తాడుచుట్టనునడుముకు బంధించి ఒకచూరకత్తిని గుప్తంగా పెట్టుకొని అడవిమార్గం పట్టింది. ఆమెకు ఒకవైపున తేజసింహుని వియోగం బాధిస్తోంది. ఆ బాధలో ఆమె ఎందుకు ప్రయాణమైనదీ ఎటు పోతుందీకూడా అగమ్యగోచరంగా వుంది. కంటివెంట అశ్రుధారలు సంతతప్రవాహంగా ప్రవహించి చారికలు కట్టాయి. బయర్లుకమ్మిన కండ్లతో ఆమె ఎదురు దెబ్బతినకుండా నడక సాగించలేకపోతోంది. అయినా ఆమె వాటిని లెక్క చేయటంలేదు. ఎదురొచ్చిన నదిలో పడిపోయిన తర్వాతగాని ఆమెకు తనకర్తవ్యం దృగ్గోచరంగా లేదు. ఆమెకు తేజసింహుడు 'చునాతగధ' మాయలవాళ్ళచేతిలోచిక్కు

కున్నాడన్న అనుమానం నిశ్చయమై అటు దిక్కుగా ప్రయాణం సాగించింది. అనేక యిక్కట్టులు దాటిన మీదట ఆమె ఆరాత్రిని ఎలాగో గడిపింది. తెల్లవారిన తర్వాత ఆమె తన వేషాన్ని పురుష సిపాయిగా మార్చుకుంది. 'చునారగఢ' ప్రవేసించింది. మనసులో తేజసింహుని విడిపించి గాని జలపానం సయితం చేయనని ప్రతిజ్ఞ చేసుకుంది. 'చునార గఢ'లో ప్రసిద్ధి చెందిన 'ఘసీటాసింహుడనే మాయలవాని ఇల్లు సమీపించింది. ఆమెకో ఉపాయంతట్టి వెంటనే పన్నాలాల్ వేషం వేసుకుని, ఘసీటాసింహుని ఇంటిలో ప్రవేశించింది. అతడు "ఏం పన్నాలాల్ యిప్పుడెవర్ని తీసుకొచ్చావ్" అన్నాడు.

"ఎవరినీ తీసుకొని రాలేదు. కాని రెండు రోజులనుంచి నాజీం కనిపించటంలేదేమిటి ?" అని పన్నాలాల్ వేషములో నున్న చపల ప్రశ్నించింది.

"ఇక్కడ లేడే" అన్నాడతడు.

"అయితే అతణ్ణి ఎవరు పట్టుకున్నారు. విజయగఢలో మాయలవారెవరూ లేరే" అన్నది.

"ఆ సంగతి మాకు తెలియదు. ఉన్న తేజసింహుడు మాత్రం ఖైదీఅయ్యాడు. అతణ్ణి కోటలో బంధించాము."

"సరే ఐతే నాజీం ఎక్కడున్నాడో తెలుసుకొస్తా" అని వెళ్ళిపోయిందామె.

ఇప్పుడు చపల మనస్సు స్థిరపడింది. ఆమెకు తేజసింహుడు 'చునారగఢ'లోనే ఉన్నాడని స్పష్టపడింది. ఆమె ఊరు విడిచి గంగానదీ తీరాన ఆలోచిస్తూ కూర్చుంది. సంచిలో నుంచి కొద్దిగా ఆహారం తీసుకు తిని గంగాజలం సేవించింది.

ఇవ్వడామె ఒక గాయకి వేషమేసుకుంది. సహజంగానే ఆమె సౌందర్యవతి గనుక అంతగా ఆమె దిద్దుకోవలసిన పని లేక పోయింది. అక్కడనుండి కోట గుమ్మంవద్దకు చేరి ఒకచోట కూర్చొని పిల్లనగ్రోవితో విషాదభరిత విరహావేదనా గీతాలు ఆలపించ సాగింది.

అర్ధరాత్రి గడచింది. శివదత్తసింహ మహారాజు రాజమహాలు పైభాగాన మహారాణితో కలసి ఆనందసాగరంలో మునిగియున్నాడు. ఇద్దరూ చపల మనోహరమైన గీతాలను చెవులు రిక్కించి వినసాగారు. ఆనందం పట్టలేక ఒక దాసీని పిలిచి ఆ పాడుతున్న మనిషిని లోపల ప్రవేశపెట్ట వలసిందిగా ఆజ్ఞాపించాడు.

రాజాజ్ఞ నందుకున్న భటుడు పరుగెత్తుకొనిపోయి చూడగా అక్కడొక సుకుమారవదన తియ్యని గొంతుతో పాడటం చూచాడు. అతడామెతో మీ పాట వినటానికి రాజుగారు మిమ్మల్ని లోపలికి ప్రవేశపెట్టమన్నారని సెలవియ్య జేశాడు. ఆమె మారు మాటాడకుండా అంతఃపురంగా ప్రవేశించి మళ్ళీ పాడసాగింది. ఆమె గాన మాధుర్యానికి మహారాజు పరవశుడైనాడు. చపలను సకలమర్యాదలతో విడిది చేయించ నాజ్ఞాపించాడు.

ఆ మరునాడు రాజు చపలను రావించి 'ఎక్కడి దాన' వని ప్రశ్నించాడు.

చపల "మాది గ్వాలియర్. నాపేరు రంభ. మాతండ్రి గొప్ప గాయకుడు. నేనొక యువకుణ్ణి ప్రేమించి అతనిని పోగొట్టుకొని యీ విధంగా తిరుగుతున్నాను. అత డేదర్బారు

లలోనైనా కనిపిస్తాడేమోనని నా ఆశ. గాయకుడు గనుక అతడు దర్బారులలోనే ఉండగలడను కొన్నాను" అని సమాధానం చెప్పింది.

మహారాజు, చపల గానమాధుర్యం తనివితీరనివాడై ఒక గానసభను ఏర్పాటు చేయించాడు. ఆమె కోరికమీద సమర్థులైన వాయిద్యగాళ్ళను పిలువ నంపాడు. సమావేశం ప్రజాసమూహంతో కిటకిటలాడిపోయింది. ఆమె సహజసౌందర్యానికి ముగ్ధులుకానివారెవరూ లేరు. ఆమె గొంతెత్తి రసవాహినులు జాలువారినట్లుగా పాడసాగింది.

కొంతసేపు పాడినతర్వాత "రాజా, ఒకసారి నేను 'నౌఘష' రాజైన సురేంద్రసింహుని ఆస్థానంలో గానసభను జరిపాను. అటువంటి పాట నాజన్మలో నేను పాడలేదు. దానికి కారణం ఆ రాజు మంత్రికొడుకైన తేజసింహుడు నాకు తోడుగా ఆలాపన చేయటమే. ఆ తర్వాత మొన్న మళ్ళీ తిరిగి అక్కడికి వెళ్ళాను. కాని తేజసింహు డక్కడ లేడు. అతడి నెవరో అపహరించారట. అందుచేత అక్కడ పాడకుండానే తిరిగి వచ్చివేశాను" అని చపల ఒక అబద్ధం ఆడింది.

రాజు ఆలోచించకుండానే "అరె! అతడా! అతడు ఇప్పుడు నా దగ్గరే ఉన్నాడు. కాని ఖైదీ. అతణ్ణి విడిచిపెట్టటం కష్టం. అయినా అతడిప్పుడు గానసభలో పాల్గొనడు." అన్నాడు.

"నా పేరు వింటే అతడు తప్పకుండా పాల్గొంటాడు. కాని అతణ్ణి పిల్చే పద్ధతొకటుంది" అన్నది రంభ.

'ఏమిటా పద్ధతి' అని అడిగాడు రాజు.

"ఇరవైసంవత్సరాలకంటే ఎక్కువ వయసులేని బ్రాహ్మణ యువకుడు అతణ్ణి తీసుకరావటానికి ఒంటరిగా వెళ్ళాలి. ఒక వేళ పారిపోతాడని భయంవుంటే కాళ్ళకు బేడీలు వేయవచ్చు. ఆలాపన చేయటాని కతనికి మంచివీణకూడా సంపాదించాలి" అన్నది రంభ.

"ఇదీ ఒక్క గొప్పపనేనా" అన్నాడు మహారాజు. దూరంగా "చేతారాం" అనే ఇరవైసంవత్సరాల బ్రాహ్మణ బాలకుడు కన్పించాడు. అతనిని తేజసింహుణ్ణి తీసుకొనిరావ టానికని వినియోగించటం జరిగింది. అతడు తేజసింహుణ్ణి తీసుకరావటానికి వెళ్ళాడు. తేజసింహుడు బ్రాహ్మణయువకు నితో కలసి బయలు దేరాడు, ఈ విధంగా తీసుకరావటానికి కారణం తన స్నేహితులెవరో వచ్చివుంటారని తేజసింహుడు పసిగట్టాడు. అతడు సభాప్రాంగణంలో ప్రవేశించి రంభను చూచాడు. "వచ్చావా తేజసింహా, రా, నీ కోసం రంభ ఎదురుచూస్తూవుంది. నీవాహాడు ప్రయోగించిన వీణానాదం ఎన్న టికీ మరువలేము" అన్నది చపల.

తేజసింహుడు ఆమె చపలయని గుర్తించి "వచ్చానా రంభా. మరణఘడియల్లోకూడా నీతో కలసిపాడటం నాకు సంతోషదాయక మైనట్టిది." అన్నాడు.

తేజసింహునికి మంచి వీణ ఒకటి యిచ్చారు. అతడు మీటటం ప్రారంభించాడు. రంభ పాట మొదలైంది. సదస్యు లంతా మంత్రముగ్ధులై వింటున్నారు. మహారాజు తన్ను తాను మరచిపోయాడు.

ఒకపాట పూర్తయిన తర్వాత తేజసింహుడు వీణను క్రిందపెట్టాడు. "ఇంకా పాడాలి" అన్నాడు రాజు.

"రాజా, నేను రోజుకొకపాట తప్పితే ఎక్కువ పాడను. కావలిస్తే రేపు మళ్ళా వస్తాను." అని అన్నాడు తేజసింహుడు.

రంభకూడా "ఇదే యితని మొండిపట్టండీ. సురేంద్రుడు చెప్పినా కూడా వినకపోయాడు. ఐనా యిప్పుడేం పోయిందీ? రేపు మళ్ళీ విందువుగానిలే" అన్నది. మహారాజు చేసేదేమీ లేక ఆనాటికి సభ చాలించాడు. తేజసింహుడు తిరిగి జైలులోకి పంపబడ్డాడు.

శివదత్త మహారాజుకి తేజసింహుడు వీణవాయిస్తుంటే రంభ పాడుతుంటగా వినాలనే కోరిక ఎక్కువైంది. రెండవరోజు తిరిగి సంగీత కచ్చేరి ఏర్పాటుచేయించి అదే బ్రాహ్మణ యువకునితో తేజసింహుని జైలునుండి రప్పించాడు. ఆనాడుకూడా తేజసింహుడు ఒకేఒక పాటకు వీణ వాయించి కట్టిపెట్టాడు. అప్పటికీ మహారాజుకి తృప్తితీరలేదు. మరొకసభ జరిపించాడు. అందరూ వచ్చి కూర్చున్నారు. రంభ కచ్చేరీ ప్రారంభము కావటానికి గంటముందు బ్రాహ్మణ యువకుని వేషంతో జైలు ఖానాకు వెళ్ళింది. కావలివాళ్ళు, బ్రాహ్మణయువకుని వెంట తేజసింహుని పంపించే అలవాటు ప్రకారం అతన్ని బైటకి తీసి పంపారు. చేతారాం వేషంలో వున్న చపల కొంతదూరం సాగిన తర్వాత తేజసింహుని బేడీలు తప్పించి అడవిమార్గం పట్టి తీసుకొనిపోయింది.

చపల చాలా దూరం వెళ్ళి తన నిజరూపం ప్రదర్శించింది. తేజసింహుడు ఆమెను ఎంతగానో మెచ్చుకున్నాడు.

చపల "మీకంటే నేనేమీ గొప్పదాన్ని కాదు. నన్ను మీరు పొగడకండి" అని అన్నది. తేజసింహుడు "నే నెంత గొప్పవాడినైనా నాకుకూడా అప్పుడప్పుడు ఇతరుల సహాయం కావలసి వుంటుంది" అని అన్నాడు. "సరే ఆ మాటలకేమి గానీ ఇప్పుడు మీరు శివదత్తునికి మీ ప్రతాపం చూపించ దలచారా లేదా?" అని అడిగింది. "నీ యిష్టం ఎట్లావుంది?" అని అడిగాడతడు. "ఖాళీచేతులతో వెళ్ళకూడదనే నా అభి ప్రాయం" అన్నది చపల.

ఇద్దరూ శివదత్తుని మోసగించే కార్యక్రమాన్ని గురించి చాలాసేపు ఆలోచించుకొని ఒక దట్టమైన అడవిలోకి వెళ్ళి పోయారు.

# 18

శివదత్త మహారాజు సంగీత సభకు విచ్చేశాడు. ఎంత సేపటికీ రంభగుంభనంగానే వుండటం గమనించి కబురంపిం చాడు. చేతారాం మామూలుగా జైలుఖానా వైపుకు వెళ్ళాడు. కొంతసేపటికి రంభ మహాములో లేదని కబు రొచ్చింది. రాజు ఆశ్చర్యపోయాడు. అతనికి రంభపై ఎక్కువ మక్కువ. అందుచే ఆమెను వెతికించటానికి మనుష్యులను పంపాడు. ఇంతలో చేతారాంవచ్చి తేజసింహుడు లేడని కబురు తెచ్చాడు. రాజు మరీ హైరానపడ్డాడు. సంగీతసభ రసాభాస మైంది. సదస్యులు తిరిగి వెళ్ళిపోయారు.

"మహారాజా! ఆగాయకి తప్పక ఎవరో మాయావి అయివుంటుంది. తేజసింహు విడిపించుకుపోవటానికే వచ్చింది" అని మంత్రగాళ్ళు జోస్యం చెప్పారు.

"అంత తెలివిగలవాళ్ళు ముందుగానే ఎందుకు తెలుసుకోలేకపోయారు? సంగీతం వినడానికి చెవి కోసుకుంటే సరిపోతుందనుకున్నారా? మీకు మంత్రగాళ్ళనిపించుకోటానికి సిగ్గన్నా లేదా?" అని రాజు మాయావులను ఎత్తిపొడిచాడు.

రెండవనాటి దర్బారుసమయంలో ఒక భటుడు "రాజా! వాళ్ళిద్దరిని అడవిలో చూచాను" అన్నాడు. వెంటనే రాజు వాళ్ళను పట్టి తెండని ఆజ్ఞాపించాడు. దానికి భటుడు "ఆ విధంగా వాళ్ళు దొరకరు. ఘసీటసింహుని, చున్నీలాలుని నా వెంట పంపితే వారిని తేలిగ్గా పట్టుకోవచ్చునన్నాడు. అందుకు రాజు సమ్మతించి, మాయావుల నిద్దరిని భటునివెంట పంపాడు. భటుడు తేజసింహుడు తనకు కనిపించిన చోటుకు వచ్చాడు. అక్కడెవరూ లేరు.

ముగ్గురూ అడవిలో కొంతసేపు వెతికారు. అంతలో వాళ్ళకు ఎదురుగా గొల్లపడుచు నెత్తిని పాల దుత్తతో ఎదురైంది. ఆమెను "నీ కెవరైనా యీ అడవిలో ఒక మగవాడు ఆడది కనిపించారా?" అని అడిగారు. ఆమె "అప్పుడు ఇంతకు ముందే నా దగ్గర పాలుకొన్నారు!" అని చెప్పింది. ఆమెను బహుమానంగా వాళ్ళు నాలుగు పైసలు ఇవ్వబోయారు. ఆమె "మీ డబ్బులు పూరికేనే వద్దుకాని ఆ పైసలతో నా పాలు కొని త్రాగండి. నాకు పట్టణానికి వెళ్ళవలసిన పని

లేకుండ పోతుంది.” అన్నది. అందుకు వాళ్ళు సమ్మతించారు. గొల్లపిల్ల పాలదుత్తదించి పాలుపోసింది. ముగ్గురూతాగారు. ఆమె పైసలు తీసుకొని ముందుకుసాగింది.

కొంతదూరం వెళ్ళినతరువాత ముందు భటునికి తల తిరగటం ప్రారంభించింది. ఆ తర్వాత మాయావులిద్దరికి తల తిరిగింది. ముగ్గురూ నేలపై పడిపోయారు. గొల్లపిల్ల అక్కడే మరుగునవుండి వీళ్ళు పడిపోవటం గమనించి అక్కడకు వచ్చిచేరింది. ముందుగా మందుతీసి భటునికి వాసనచూపించింది. అతనికి తెలివి వచ్చింది. అతడు తేజసింహుడు. భటుని వేషం మార్చుకున్నాడు. ఘనీటసింహుని, చున్నీలాలుని మూటలు గట్టుకొని చపలా, తేజసింహుడు నౌగఢకు దారిపట్టారు.

# 19

చునారుగఢకు తేజసింహుణ్ణి విడిపించటానికి చపల వెళ్ళిన తర్వాత చంప ఒంటరిగా వుండిపోయింది. ఆమె మాయావులతో ఎక్కడ తంటాలు వస్తాయోనని భయపడ సాగింది. అందుకని చంప మాయావులతో బాధలేకుండా హాయిగా వుండటానికి ఒక ఉపాయము ఆలోచించాలను కొంది. ఆ ప్రకారం ఆమె ఒక లేపనం నూరి సిద్ధంచేసింది. ఆ లేపనం చంద్రకాంత శయనాగారములో నీళ్ళతో కలిపి వాకిళ్ళకు రెండుగజాల దూరంలో లోపలా, బైటా అలికేసి, తాను రాజకుమారి మంచము దగ్గరగా వండుకొనేది. ఆ లేపనం ప్రభావం ఏమిటంటే ఆరిపోయినతర్వాత ఎవ్వరైనా

దానిమీద కాలువేస్తే టపాకాయ మోస్తరుగ పెద్ద ధ్వని వస్తుంది. చూట్టానికి ఏమీ కనుపించదు. ప్రతిరోజూ ఉదయం చంప దాన్ని నీళ్ళతో కడిగివేసేది. రాత్రికి మళ్ళా అలికేది. ఒకనాడు చంప మరొక తమాషా చేసింది. అదేమిటంటే మట్టితో చంద్రకాంతవంటి మూర్తిని మలిచి చంద్రకాంత ఏ రంగులో వుందో ఆ రంగే దానికివేసింది. ఆ ఆకారాన్ని మామూలుగా చంద్రకాంతపండుకునే మంచముమీద పడుకో పెట్టి దుప్పటి కప్పింది. ముఖముమాత్రం బైటికి కనుపిస్తుంది తలకింద దిండు పెట్టింది. కొద్దిగా మంచంపై వెలుగు పడ నిచ్చింది. మంచంచుట్టూ తాను తయారుచేసిన లేపనం పూసింది. ఆ రాత్రికి చంద్రకాంతను మరోగదిలో పడుకోమంది. ఆమె పడుకున్న గది తలుపులకు కూడా లేపనంపూసింది. చంద్రకాంత గది పక్కగా తానొక గదిలో దీపం ఆర్పి నిద్రపోయింది.

ఆర్ధ రాత్రియైన తర్వాత బొమ్మ పెట్టినగదిలో టపాకాయ పేలిన శబ్దంవచ్చింది. ఆ ధ్వనివిన్న చంప త్వరగా లేచి వెళ్ళి కిటికీతలుపులు మూసి జనాన్ని కేక వేసింది. దాసదాసీలంతా పోగయ్యారు. ఒకరువెళ్ళి చంద్రకాంతగదిలో దొంగలు ప్రవేశించారని మహారాజుతో చెప్పారు. రాజు పదిమంది భటులతో వచ్చాడు. అందరు వచ్చి తలుపులు తెరచి చూడగా అందులో మాయావులైన రాంనారాయణ, పన్నాలాల్ వున్నారు. చాలామంది వారిని పట్టుకోటానికి ఎగబడ్డారు. ఆ మాయావులు కత్తులుదూసి అనేకమందిని గాయపరచారు. చివరకి పట్టుబడ్డారు. మహారాజు వారిని జైలులో

బంధించవలసిందిగా ఆజ్ఞాపించాడు. చంపతో విశేషాలు అడిగి తేజసింహుని చపల ఎక్కడున్నదని అడిగాడు. జబ్బు పడిందని చెప్పింది చంప. అంతటితో రాజు తిరిగి వెళ్ళిపోయాడు.

మరునాటి ఉదయం మాయావులను రాజదర్బారులో హాజరుపెట్టారు. వారిని నీ పేరేమిటని ప్రశ్నించగా పన్నాలాల్ 'శిరశ్ఛేదసింహుం' డని చెప్పాడు. మహారాజుకి అతని వంకర సమాధానాలకు కోపంవచ్చింది. తిరిగి వాళ్ళను జైలులో బంధించవలసిందిగా ఆజ్ఞాపించాడు.

ఆ తర్వాత మహారాజు మంత్రి హరదయాళ సింహుని రావించి తేజసింహుని విశేషాలు తెలుసుకొన్నాడు. మంత్రి తేజసింహుని జాడ తెలియరావడంలేదని విచారంగా చెప్పాడు. అందుమీదట రాజు "అయితే శివదత్తుడు ఏక్షణంలోనైనా మనమీదకు దండెత్తిరావచ్చును. నీవు రాజ్యంలో మహమ్మదీయులను ఒకకంటితో కనిపెట్టివుండు. సాధ్యమైనంతవరకు ఉద్యోగాలలో మహమ్మదీయులకు బదులుగా హిందువులు నియోగింపబడేటట్లు చెయ్యి." అని ఆజ్ఞాపించాడు.

మంత్రి హరదయాళుడు రాజాజ్ఞకు తన సమ్మతిని తెలియచేశాడు.

# 20

తేజసింహుణ్ణి పట్టుకోటానికి ఘసీటసింహుని చున్నీలాలుని పంపించి శివదత్తసింహుడు దర్బారు చాలించాడు.

రంభ కలిగించిన సంరంభాతిశయం అతణ్ణింకా విడిచిపెట్టలేదు. మహారాణి అతనిని రంభను నా దగ్గరికి రప్పించి పాడిస్తానన్నా రేమైందని ప్రశ్నించింది. "ఇంకెక్కడి రంభ! ఆమె మమ్మల్నందరినీ మోసగించి పారిపోయింది. ఇంకెక్కడి సంగీతమ"ని తప్పుకున్నాడు. ఆ తర్వాత తన ఆలోచనా మందిరానికి వెళ్ళి 'ఈ రంభ యెవరై వుండాలి. ఆమె తేజసింహుని విడిపించుకొనిపోవటానికి ఇంత ప్రయత్నం ఎందుకు చేసింది. బహుశా అతనిపై ఈమెకు ప్రేమ జనించివుండకపోదుగదా! అయ్యో రంభా! నా హృదయాన్ని గాయపరచి వెళ్ళిపోయావా? నిన్ను వెతికి పట్టుకోవటానికికూడా నా కెటూ దిక్కుతోచకుండా వుంది' అని అనేకవిధాల పరితపించసాగాడు. రంభా సంస్మరణలో అతని హృదయం అల్లకల్లోలమై రాత్రంతా మేలుకొనే వుండి పోయాడు. ఉదయం దర్బారుకు వచ్చి తేజసింహుని వివరాలు అడిగి తెలుసుకోగా యింకా యేమయిందీ తెలియలేదని తెలిసింది. ఆ విషయం రాజును మరీ కలచివేసింది. ఇంతలో రాజు దృష్టి బదరీనాథ్, నాజిర్, జ్యోతిష్యుడు, శృంగారసింహుడు వున్న చోట పడింది. వాళ్ళు రాజుకు నమస్కరించి ఒకమూల కూర్చున్నారు. వాళ్ళంతా విషాదపూరిత ముఖాలతో వున్నా ఎవరూ పట్టించుకోలేదు. దర్బారు చాలించి ఏకాంతంగా కూర్చుని ఆ మాంత్రికులను పిలిపించుకున్నాడు. వాళ్ళు సిగ్గుపడుతూ వచ్చి ఒక్కొక్కరుగా కూర్చున్నారు. రాజు విజయనగరం నుంచి ఎప్పుడు వచ్చారని ప్రశ్నించాడు. అందుకు బదరీనాథుడు సమాధానంగా "అయ్యా! భగవాన్‌దత్తుని తేజసింహుడు ఖైదు చేశాడు." అని చెప్పాడు.

"పన్నాలాల్, రామ్‌నారాయణులను చంపా అనే ఆడది పట్టుకొన్నది. మిగతా మేమందరమూ బతికి బయటపడ్డాం. వాళ్ళ మనుష్యుల్లో ఒక్క తేజయసింహుణ్ని పట్టి మీకిచ్చాం. అంతకంటె ఎక్కువ మేమేమీ చేయలేకపోయాం."

రాజు "ఇంకెక్కడి తేజసింహుడు. అతన్ని ఒక ఆడది విడిపించుకొని పోయింది. కావటానికి ఆమె ఆడదే కాని ఆమె ఎవ్వరో తెలియలేదు. తేజసింహుణ్ణి తీసుకొని వెళ్ళింది సరే; వెళ్ళేప్పుడు చునీలాలు, ఘసీటసింహుల పైకూడా చేయిచేసుకున్నట్టుగా భావిస్తున్నాం. వాళ్ళిద్దరూ వెతకటానికని వెళ్ళి యింతవరకూ అజ లేకుండా పోయారు. క్రూరసింహునికి సహాయమని వెళ్ళితే నాకు నష్టమే జరిగింది. సరే మీరిప్పుడు గాయకిగా వచ్చి నా హృదయాన్ని గాయం కలిగించటమేగాక కంటికి కళ్ళల్లోనూ దుమ్ముకొట్టి పోయిన ఆ ఆడది యెవరో జాడతియ్యండి" అన్నాడు.

"మహారాజా ఆ ఆడది చంద్రకాంత చెలికత్తె చపల తప్ప మరెవ్వరూ కాదు" అన్నాడు నాజిం.

"అయితే చంద్రకాంతకంటె చపలే అందమైనదా?" అని ప్రశ్నించాడు రాజు,

"రాజా! చంద్రకాంతముందు చపల యేపాటి అందగత్తె! ఈ ప్రపంచంలో చంద్రకాంత తర్వాత యెన్నతగ్గది చపల ఒక్కతే. అయితే చపల తేజసింహుని వలచింది" అన్నాడు నాజిం.

కొన్ని క్షణాలపాటు శివదత్తసింహుడు గంభీరంగా వుండి "ఏది యేమైనప్పటికీ చంద్రకాంత, చపల నా చేతులలో

చిక్కనంతవరకు మనస్సుకు శాంతికలుగదు" అన్నాడు. కొంత సేపైన తర్వాత "ఈ విషయం జయసింహునికి ఉత్తరంద్వారా తెలియజేస్తాను" అన్నాడు.

"ఉత్తరంవల్ల ప్రయోజనమేముంది?" అన్నాడు.

"నా ఉత్తరాన్ని లెక్కచెయ్యకపోతే విజయగఢం సర్వ నాశనమైపోతుంది" అని చెప్పి మీరమున్షీని పిలిచి "జయ సింహమహారాజుకి చంద్రకాంతను నాకిచ్చి పెండ్లిచేసి, కట్న రూపంలో చపలను ముట్టచెప్పవలసిందిగా లేఖవ్రాయి" అని ఆజ్ఞాపించాడు.

మున్షీ అదేవిధంగా లేఖవ్రాశాడు. రాజుగారు దానిపై తన ముద్రను వేసి పడితె బదరీనాథునితో విజయగఢకు పంపించాడు.

## 21

మరునాడు జయసింహమహారాజు మంత్రితో కలిసి దర్బారు తీర్చి కూర్చొనివుండగా తేజసింహుడు భుజాన పెద్ద మూటతో దర్బారులో ప్రవేశించాడు. రాజూ, మంత్రీ తేజసింహుని రాకకు యెంతో సంతసించి అతనికి ఉచితాస నాన్ని చూపించారు. తేజసింహుడు మూటనుదించి కూర్చున్న మీదట "ఇన్నాళ్ళూ యేమైపోయావో తెలియక మేమంతా కంగారుపడిపోయాం. మీ తండ్రిగారు కూడా చాలా దుఃఖిం చారు" అని అన్నాడు రాజు.

"రాజా మీ సేవకుడు శత్రువుల చేతులలో చిక్కుకొని పోయాడు. మీ దయవల్ల నేటికి విడిపించుకొనివచ్చాను. వస్తూవస్తూ చునార్‌గఢలో మిగిలివున్న యిద్దరి మాయావులను మూటగట్టుకొని తెచ్చాం" అన్నాడు తేజసింహుడు.

మహారాజు సంతోషచిహ్నంగా తేజసింహునికి ఎక్కువ బహుమానాలు సమర్పించి "ఇక్కడ కూడా చంపద్వారా పట్టుబడిన యిద్దరు మాయావులను ఖైదీ చేశాం. వీళ్లను కూడా అక్కడికే పంపించు" అన్నాడు.

తేజసింహుడు మూటవిప్పి మాయావుల నిద్దరికీ స్పృహ తెప్పించి రామనారాయణ, పన్నాలాలులను ఖైదుచేసిన చోటికి పంపించాడు.

"నేను పట్టుబడుటవల్ల నౌగఢలో అందరూ విచారిస్తూ వుంటారు, గనుక అనుమతిస్తే ఒకసారి వెళ్ళి చూచివస్తాను" అన్నాడు తేజసింహుడు. 'తప్పకుండా వెళ్ళు; కాని త్వరగా మాత్రం రావలి' అన్నాడు రాజు. అతని వెంటమంత్రి హరదయాళసింహునికూడా పంపించాడు.

రాజమహలులో ప్రవేశించిన చపలనుచూచి చంద్రకాంత ఆనందభరితురాలై గట్టిగా కౌగలించుకుంది. చపల తాను వెళ్లినదగ్గరనుంచి జరిగిన తమాషాలన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పి చంద్రకాంతకు అత్యంత ఆశ్చర్యాన్ని కలిగించింది. చంద్రకాంత చపలతో శిష్యురాలైన చంప చేసిన ఘనకార్యంకూడా విడమర్చి చెప్పించింది. తన శిష్యురాలుకూడా చాతుర్యాన్ని ప్రదర్శించి యిద్దరు మాయావులను బంధించకలిగినందుకు చపల సగర్వంతో ఆమెను అభినందించింది.

సరిగా తేజసింహుడు హారదయాళుని తీసుకొని నాగ డలో మహారాజు దర్బారు తీర్చివున్న సమయానికి కచేరీ లోనికి ప్రవేశించాడు. సురేంద్రసింహ మహారాజు ప్రక్కగా వీరేంద్రసింహుడుకూడా కూర్చొని వున్నాడు. తేజసింహుని చూచి వీరేంద్రుడు పెన్నిధి దొరికినంతగా సంబరపడ్డాడు. హారదయాళుడు మహారాజుకు మంత్రికి రాజకుమారునికి గౌర వాభివందనం చేశారు. తేజసింహుడు ప్రప్రథమంగా మహా రాజు పాదాలను స్పృశించాడు. రాజు తేజసింహుని లేవనెత్తి ఆశీర్వదించాడు. ఆపిమ్మట తండ్రిని కౌగలించుకొని సాశ్రు నయనాలతో ప్రేమాభివందన మాచరించాడు.

మహారాజు వీరేంద్రుని ప్రక్కగా కూర్చొన్న తేజ సింహుని శత్రువులచేత చిక్కిన వృత్తాంతమంతా తెలుసుకొని కుశల ప్రశ్నలు వేశాడు.

హారదయాళసింహుడు జయసింహ మహారాజు పంపిం చిన కానుకలను సురేంద్రసింహునికి అప్పగించి అందులో రాజకుమారునికిగాను పంపిన యువరాజ దుస్తుల్ని వీరేంద్రునికి కట్టబెట్టాడు. వాటిని ధరించిన వీరేంద్రుని చూచిన సభాసదు లందరూ ఉభయరాజ్యాల స్నేహసుహృద్భావాలకు ఆనం దానందం పొందారు.

నౌగఢ రాజ్యంలో కొంతకాలంపాటు తేజసింహుడు హారదయాళ సింహునితో కలిసి కాలం గడిపాడు. ఒకరోజులో వీరేంద్రుడు తేజసింహుని విడిచిపెట్టకుండ యెప్పుడూ అంటిపెట్టుకుని వున్నాడు. తేజసింహుడు తనను చపల విడ పించిన వైనాన్ని వీరేంద్రునికి ఒంటరిగా తెలియచేసి ఆమె

శక్తి సామర్థ్యాలను మిక్కిలి ప్రశంసించాడు. అయితే వీళ్ళిద్దరికీ చంద్రకాంతతో కలిసి మాట్లాడటం యెలాగా అనే ప్రశ్న వుండనేవుంది.

వారదయాళుడు సురేంద్రసింహ మహారాజుతో తన రాజ్యానికి వెళ్ళటానికి శెలవుకోరి తేజసింహునితో ప్రయాణమై పోయాడు.

తేజసింహుడు విజయగడ రాజ్యానికి చేరుకుని సురేంద్ర సింహుని క్షేమసమాచారాలు జయసింహ మహారాజుకు తెలియ జెప్పాడు

ఒకనాడు జయసింహుడు రాజదర్బారులో ఉండగా శివదత్తుడు పంపిన దూత బదరీనాథుడు ఉత్తరాన్ని తీసుకొచ్చాడు. మహారాజు ఆ ఉత్తరాన్ని చదవవలసిందిగా మంత్రి గారికిచ్చాడు. మంత్రి ఆ ఉత్తరాన్ని చూచి కోపోద్దీప్తుడై "రాజా! ఈ ఉత్తరాన్ని ఒంటరిగా వున్నప్పుడు చదవాలి" అన్నాడు. "సరే అయితే" అని మహారాజు బదరీనాథునికి విడిది యేర్పాటుచేసి తాను తేజసింహుని తీసికొని మంత్రితో కలసి ఆలోచనామందిరం లోనికి వెళ్లారు. అక్కడ మంత్రి శివదత్తుడు వ్రాయించిపంపిన ఉత్తరాన్ని చదివాడు. ఆ ఉత్తరంలోని సమాచారానికి మహారాజు మండిపడి ఉత్తరాన్ని చించి అవతల పారవేశాడు. వెంటనే బదరీనాథుని ఉత్తరానికి సమాధానంగా వెళ్ళిపోవలసిందిగా ఆజ్ఞాపించాడు. క్రూరసింహుడు చునారగఢకు వెళ్ళి ఎటువంటి కుతంత్రాలు పన్నుతున్నాడో రాజుకిప్పుడు విదితమైంది. తేజసింహుడు

"మహారాజా! శివదత్తుడు అచిరకాలంలో మనమీదకు దండెత్తి రాగలడనటంలో యేమాత్రం సందేహంలేదు. మనమిప్పుడు త్వరగా మేలుకుని యుద్ధానికి సర్వ సన్నాహాలు పూర్తిచేసుకోవటం మంచిది. శివదత్తుడు మన రాజ్యానికి మాయావులను పంపించినప్పుడే నాకీ విషయమై అనుమానమేసింది. యిప్పుడీ వృత్తాంతంతో అతని దురుద్దేశమేమిటో బయట పడిపోయింది" అన్నాడు.

"అయినా నేనిప్పుడు భయపడాల్సిన అవసరంలేదు. ఒకవేళ శివదత్తునికి 30 వేల సైన్యంవున్నా నేను మన పదివేల సైన్యాలతోనే అతణ్ని యెదుర్కొనటానికి సర్వసిద్ధంగా వున్నాను" అన్నాడు రాజు.

"ఒక్క పదివేలేమిఖర్మం! మా సురేంద్రసింహ మహారాజుకి ఐదువేల సైన్యం లేదా! ఈ రెంటినీ కలిపితే పదిహేను వేలౌతుంది. మీరొక ఉత్తరం వ్రాసి హారదయాళ మంత్రిని నా వెంట పంపండి నేను సైన్యాలను తీసుకొస్తాను. మీ అనుజ్ఞ అయితే వీరేంద్రసింహుణ్నికూడా తీసుకొస్తాను. అతడు సైన్యాధ్యక్షుడుగావుండి యుద్ధనిర్వహణ చేస్తాడు. అప్పుడు శివదత్తుడు మన కాలిగోటితో సమానంకూడా కాడు. అన్నాడు తేజసింహుడు. మంత్రి తేజసింహుని ప్రణాళికకు తన సమ్మతిని వెలిబుచ్చాడు.

కాని మహారాజు "నీవు చెప్పింది బాగానేవుందిగాని యిప్పుడప్పుడే వీరేంద్రుని యుద్ధంలో దించటానికి నాకు మన స్కరించటంలేదు. అతడెంత యుద్ధతంత్ర నిపుణుడైనప్పటికీ

సురేంద్రసింహునికి అతడెంతగా కొడుకో; నాకూ అంతగానే కొడుకులాంటివాడు. అందుచేత సురేంద్రసింహుని యేవిధంగా ఒప్పించి రాజకుమారుని యుద్ధానికి సంసిద్ధం చెయ్యగలను" అని సంశయాన్ని ప్రకటించాడు.

"మహారాజా! మీరు భయపడాల్సిన అవసరం నాకు కనిపించటంలేదు. మహారాజు యుద్ధభూమిలో చావో బ్రతుకో తేల్చుకొనే సమయంలో యువరాజు యింట్లో విశ్రాంతి తీసుకోవటం భావ్యమా! సురేంద్రుడు యిందుకు సుతరామూ అంగీకరించడు. అంతదాకా యెందుకు వీరేంద్రుడే మీరు చెప్పిన దానికి సమ్మతించడు." అనిసమాధానంయిచ్చాడు తేజసింహుడు.

మహారాజు తేజసింహుని కార్యదక్షతకు సంతోషపడి మహామంత్రిని సురేంద్రసింహ మహారాజుకి ఉత్తరం వ్రాయవలసిందిగా ఆజ్ఞాపించాడు. హారదయాళుడు శివదత్తుడు సింహగఢపై దండెత్తివచ్చే విషయాన్ని వ్రాస్తూ దీనిపై మీ అభిప్రాయం తెలియజేయవలసిందిగా నాగఢమహారాజుకు ఉత్తరాన్ని వ్రాయటం పూర్తిచేశాడు. జయసింహుడు తన రాజముద్రను లేఖపై వొత్తి మరునాటికే తిరిగి రావలసిందని హారదయాళుని నాగఢకు పంపించాడు.

హారదయాళుడు మధ్యాహ్నసమయానికల్లా నాగఢ చేరుకొని ముందుగా జీవసింహుని యింటికి వెళ్లి [illegible] తెలియజేశాడు. ఆ [illegible] మహా[illegible] సింహుడు హారదయాళుని వెంటపెట్టుకొని మహారాజు [illegible]నికి వెళ్ళాడు. అక్కడ వీరేంద్రసింహ యువరాజు కూడా కూర్చొనివున్నాడు. హారదయాళు డుత్తరం రాజుగారికి పంపిన

ఉత్తరాన్ని సురేంద్రునిచేతి కందించాడు. సురేంద్రుడా వృత్తాన్ని చదివి కోపం పట్టలేనివాడై వీరేంద్రునిచేతికి ఉత్తరాన్ని అందించాడు. యువరాజు ఉత్తరాన్ని చదివి సింహాకిశోరంలా లేచి "మహారాజా! రాజధర్మమైన యుద్ధసర్వాణ అంటే నాకు చాలా యిష్టం. మీరు ఆజ్ఞాపిస్తే శివదత్తుడు విజయగఢపై దండెత్తకమునుపే అతనిని బంధించి తీసుకొనివస్తాను" అన్నాడు.

"అంత తొందర పడాల్సిన అవసరం నాకిప్పుడు కనిపించటంలేదు. ముందుగా నువ్వు సైన్యాలను తీసుకొని విజయగఢకు వెళ్ళు. క్షత్రియులకు ఈ ప్రపంచంలో యుద్ధం కంటె ప్రియమైంది మరొకటుండదు. అందువల్ల నీపై నాకు గల ప్రేమ బంధాలనన్నిటిని తెగతెంపులు చేసుకొని జయసింహ మహారాజు సహాయార్థం యుద్ధభూమికి నిన్ను పంపుతున్నాను" అని "మహామంత్రి! ఈ రాత్రి రాత్రే మన సైన్యాలన్నీ సర్వసన్నద్ధమై తెల్లవారేసరికి యువరాజు వెంట విజయగఢ రాజ్యానికి వెళ్ళవలసిందిగా ఆజ్ఞాపించు." అని సురేంద్రుడు ఆజ్ఞలను జారీ చేశాడు.

ఆ రాత్రికి యువరాజు యుద్ధసామానుల నన్నిటినీ జాగ్రత్తచేసి పెట్టుకున్నాడు. చంద్రకాంతను చూడగలనన్న ఉత్సాహం ఒక ప్రక్క, మరొకప్రక్క రణోత్సాహం యువరాజుకి మొత్తంమీద ఆ రాత్రి నిద్రలేకుండా చేశాయి.

# 22

తెల్లవారేసరికి యువరాజు కాలకృత్యాలు తీర్చుకొని యుద్ధపు దుస్తులు ధరించి ఖడ్గధారుడై మాతృశ్రీ నుండి శలవుతీసుకోటానికి బయలుదేరాడు. మహారాణికి చక్రవర్తి పరిస్థితులన్నీ రాత్రే చెప్పాడు. అతడు తన సైన్యాలు సర్వ సంసిద్ధమై యుండటం చూచి సంతోషించాడు. యువరాజు మాతృదేవికి నమస్కరించి పాదాభివందనంచేసి ఆశీర్వదించమనికోరాడు. మహారాణి అశ్రుపూరిత నయనాలతో పుత్రరత్నాన్ని హృదయానికి కౌగలించుకొని వీపు నిమురుతూ "పుత్రా! రణరంగానికి వెళ్ళు. వీరపురుషుల సరసన నీ పేరు శాశ్వతమవుగాక! క్షత్రియకులానికి శిరోభూషణమై నిలువుము! యుద్ధకాలంలో క్షత్రియుల ధర్మం, సాంసారిక ప్రేమపాశాలను త్యజించి రణరంగంలో దూకటమేకదా! నీకు పరమేశ్వరుడు విజయాన్ని ప్రసాదించుగాక" అని ఆశీర్వదించాడు.

జననీ జనకులనుండి శలవు తీసుకొని యువరాజు కోటకి వచ్చాడు. హారదయాళమంత్రి అప్పటికప్పుడే సిద్ధమైయున్నాడు. యిద్దరూ యవనాశ్వాలపై ఎక్కి ముందుకు సాగారు. వెనుకగా సైన్యాలు సముద్రతరంగాల్లా విజృంభిస్తూ ముందుకు సాగాయి. విజయగఢ సమీపించినతర్వాత యువరాజు అశ్వాన్ని దిగి హారదయాళునితో "సేనిక్కడ దిగి అన్ని ఏర్పాట్లూ చేసుకొని, పట్టణంలోనికి వస్తాను" అన్నాడు.

"సరే మీయిష్టం" అన్నాడు హారదయాళుడు. హార దయాళుడు వంటరిగా జయసింహమహారాజువద్దకు వెళ్ళి యువ రాజు ఆగమనాన్ని తెలియజేశాడు. మహారాజు ఆనందానికి మేరలేదు. అతడు సైన్యాలకు ఆచోటు మంచిదేగాని యువ రాజును మాత్రం రాజమహాలులో ప్రవేశపెట్టండి" అన్నాడు.

రాజాజ్ఞమేరకు హారదయాళుడు సామంతపురోహితసమే తంగా యువరాజును కొనితేవటానికి వెళ్ళాడు. తేజసింహుడు కూడా వీరేంద్రునివద్దకు వెళ్ళి శుభాభివందనలు తెలియ జేశాడు. రాజాజ్ఞమేరకు యువరాజు హారదయాళుని వెంట అంతఃపురానికి విచ్చేశాడు. నగరమంతా వీరేంద్రసింహుడు జయసింహ మహారాజ సహాయార్థమై వచ్చాడని తెలుసుకొని ఆనంద తరంగితమైంది.

రాజు స్వయంగా యువరాజుకు స్వాగతంచెప్పి తన దగ్గర కూర్చోబెట్టుకున్నాడు. ఎడమవైపున మహారాణి కూర్చుంది. కుడివైపున యువరాజుకూర్చున్నాడు. నలుదిక్కులా దాసదాసీజనాలు పరివేష్టితమై యున్నది. యువరాజుదృష్టి నలువైపులా ఎవరికొరకో ప్రసరించసాగింది. చంద్రకాంత కిటికీ చాటుననుండి అతణ్ణి కలుసుకోటానికి సిగ్గుపడుతూ చూస్తూ వుండిపోయింది. మహారాజు యువరాజుతో కొంతసేపు గడిపి అక్కడినుండి ముందుగదిలోకి వెళ్లాడు. స్వయంగా తన విశ్రాంతిగదికి సమీపాన ఒకసుందరమైన గదిని యువరాజు కిప్పించాడు. మహారాజునుండి శలవుతీసుకొని యువరాజు తేజ సింహునితో కలసి తన గదికి చేరుకున్నాడు. రాజమహాలులో చంద్రకాంతను చూడలేకపోయినందుకు యువరాజు విచారపడ

సాగాడు. అప్పటి ఆలోచనలన్నీ చంద్రకాంతను ఏ విధంగా వర్ణించగలుగుతానా అనే మరునాటి ఉపాయం జయసింహ మహారాజు దర్బారుకు వెళ్లాడు. యువరాజు దర్బారు దుస్తులుధరించి తేజసింహునివెంట దర్బారుకు వెళ్లాడు. మహారాజు అతనిని తన ప్రక్కగా వున్న ఆసనంపై కూర్చోబెట్టుకున్నాడు. హరదయాళమంత్రి సురేంద్రసింహ మహారాజు వ్రాసి యిచ్చిన ఉత్తరాన్ని జయసింహుని కందించాడు. ఆ వుత్తరాన్ని చదువుకొని సురేంద్రుని సౌహార్ద్రతకు జయసింహుడు సంతసాన్ని వెలిబుచ్చాడు. యువరాజు కొని తెచ్చిన సైన్యాలకు అన్ని ఏర్పాట్లూ చేయవలసిందిగా మహారాజు మంత్రికి ఆజ్ఞయిచ్చాడు. దానికి సమాధానంగా యువరాజు "రాజా మా సైన్యాలకు కావలసినవన్నీ వెంట తెచ్చుకున్నాము" అన్నాడు.

"మా రాజ్యాన్ని పరరాజ్యంగా భావిస్తున్నావా? ఎందుకలా చేశావు? మీకు కావలసిన ఏర్పాట్లు మేమే చేస్తాం. నీవు నేటినుండీ సమస్త సైన్యానికీ సర్వాధికారివై సర్వసన్నాహాలు పూర్తిచేయి." అన్నాడు.

యువరాజు తేజసింహునితో "నీవు వెళ్ళి సైన్యాన్ని మూడు భాగాలుగాచేసి విజయగడను ఇరుదిక్కులా పంపించు. ఒక వెయ్యి సైన్యాన్ని పది విభాగాలుచేసి పది క్రోసుల కొక్కొక్క తెగగా విస్తరించు. గూఢచారులను నలుదిక్కులుగా పంపించు. మీ మహారాజు సైన్య కవాతును రేపు పరీక్షించి ఆ మీదట చేయవలసిన ఏర్పాట్లు చేస్తాను.

జయసింహ మహారాజు మంత్రితో రేపు మన సైన్య విన్యాసాలకు తగిన ఏర్పాట్లు చెయ్యమని ఆజ్ఞాపించాడు.

ఇంతలో గూఢచారులువచ్చి 'చునార్ గఢ' మహారాజు తన ముప్పైవేల సైన్యంతో 'విజయగఢ' మీదికి దండెత్తి వస్తున్నాడనే వార్తను తెచ్చారు. మూడురోజులలో సమీపించగలవనికూడా తెలియజేశారు. యువరాజు "సరే. మీపని మీదమీరు వెళ్ళండి." అని చెప్పి గూఢచారులనుపంపించాడు. మరునాడు ఒక విశాల మైదానంలో జయసింహమహారాజు సైన్యాలు బారులుతీరి విన్యాసాలకు సిద్ధమై యున్నవి. మహారాజు వీరేంద్రునితో కలసి జాగరూకుడై విన్యాసాలను తిలకించటానికి వెళ్ళాడు. అప్పటికే హైదరాలీ మంత్రి మహమ్మదీయులను సైన్యంనుండి చాలవరకు తగ్గించివేశాడు. ఐనా ఇంకొక వెయ్యి మహమ్మదీయ సైన్యం మిగిలివుంది. వారిని చూచి యువరాజు ముఖకవళికలను గమనించిన మహారాజు "వీళ్ళపని పట్టించు." అని అన్నాడు. యువరాజు "ఇప్పుడే వీళ్ళను తొలగించరాదు. అలా చేస్తే వీళ్ళు శత్రువులలో కలుస్తారు. శత్రువులను ఎదుర్కొనటానికి ముందుగా వీళ్ళనే పంపాలనిగా అభిప్రాయం. వీళ్ళ వెనుక ఫిరంగులతో మన హిందూ సైన్యం వుంటుంది. ఒకవేళ మహమ్మదీయుల ప్రవర్తన సరిగా లేక శత్రువులతో కలవటానికి ప్రయత్నిస్తే వెనకనున్న ఫిరంగులతో వీళ్ళను కాల్చి చంపవచ్చును. ఈవిధంగా చేస్తే ఒకసారైనా వీళ్ళతో పనిచేయించుకున్నట్లవుతుంది. అనవసరంగా

చంపటంకంటే యీ పద్ధతి మంచిదికదా?" అన్నాడు. వీరేంద్రుని యుద్ధవిజ్ఞతకు ప్రశంసా పరంపరలు కురిపించాడు.

సైన్య విన్యాసాలు పరీక్షించటం పూర్తయిన తర్వాత యువరాజు మహారాజనుండి వేటకు అనుజ్ఞ తీసుకున్నాడు. రాజు "ఎక్కువదూరం పోకుండా సాధ్యమైనంతత్వరగా తిరిగి రావలసిందని" వినతిచేశాడు. యువరాజువెంట వందమంది అశ్వికులను సహాయంగా నియోగించాడు. వీరేంద్రుడు ఒక మహారణ్యంలో ప్రవేశించి వేటాడటానికి సమయుత్తమయ్యాడు. ఇంతలో తేజసింహుడు అక్కడకువచ్చి "నీవు చెప్పినట్లు చేశాను. నీవు ఇక్కడకువచ్చి కూర్చున్నావేమిటి?" అన్నాడు రాజకుమారునితో, "ఫరవాలేదులే. ఇంతలో ఏమైంది" అన్నాడు యువరాజు.

ఇద్దరూ అహ్మాద్‌ను బంధీకృతుణ్ని చేసిన చీకటిగుహ వద్దకు వెళ్ళారు. మిగతావాళ్ళు తిరిగిపోయారు. మిత్రులిద్దరూ గుహలో ప్రవేశించారు. చీకటిదాటి వెలుగు ప్రసరింపచేస్తున్న చోటికి వెళ్ళేసరికి అక్కడ ఒక పెద్దద్వారం కనిపించింది. రాజకుమారుడు గుర్రాన్ని దిగాడు. తేజసింహుడు "నీవీ ద్వారాన్ని తెరువగలవేమో చెప్పు" అన్నాడు. "ఇదీ ఒక పెద్దపనేనా" అని యువరాజు పెద్దపులి నోట్లో చేయిపెట్టి నాలుక పైకిలాగి రాతి ద్వారాన్ని తెరిచాడు.

"ఇంకా జ్ఞాపకముందే!" అన్నాడు తేజసింహుడు.

"అంతలోనే మర్చిపోతానా" అన్నాడు యువరాజు. ఇద్దరూ గృహాంతర్భాగంలోకి ప్రవేశించారు. అక్కడ శిల యేటి తీరానికి చేరుకున్నారు. అహ్మాద్ భగవాన్‌దత్తు లిద్దరూ

రాతిపై కూర్చొని సంభాషించుకుంటున్నారు. ఇద్దరికాళ్ళకూ బేడీలు తగిలించి వున్నాయ్. ఇద్దరూ యువరాజుకు నమస్కరించి "యిప్పటికైనా మా తప్పును క్షమించండి" అని అడిగారు. "కొన్నాళ్ళపాటు వోపికపట్టండి" అన్నాడు యువరాజు.

ఆ తర్వాత కొంతసేపు ఆ సుందరతరమైన మైదానములో హాయిగా గడిపి ఇద్దరూ బైటికి వచ్చేశారు. తేజసింహుడు "యీద్వారాన్ని మీరే తెరిచారుగనుకమీరే మూసి వేయండి." అన్నాడు యువరాజు ద్వారాన్ని బంధించినమీదట యిద్దరూ వయనమై పోయారు. విజయగఢ సమీపించిన మీదట తేజసింహుడు "మీరు నగరానికి వెళ్ళండి. నేను సైన్యంలోనికివెళ్ళి సమాచారాలు తెలుసుకొని వస్తాను." అన్నాడు. కొద్దిగా ప్రొద్దుపోయిన తర్వాత తేజసింహుడు యువరాజున్న గదికివచ్చి చేరుకున్నాడు. యువరాజుతో "మీరు చెప్పినప్రకారం చేశాను. ఇవాళ పగలల్లా మిమ్మల్ని కలుసుకోవటానికి క్షణంకూడా తీరికలేకపోయింది" అన్నాడు. ఆ మాటకు యువరాజు నవ్వి "యివాళ మధ్యాహ్నమంతా నాతోనే వున్నావు. నన్ను కలుసుకోలేదంటా వేమిటి ?" అన్నాడు. తేజసింహుడు ఆశ్చర్యపడి "యేమిటి? మీరనేది" అన్నాడు.

"అనేదేముంది. ఇవాళ మధ్యాహ్నం మనిద్దరం కలసి, చీకటిగుహాలోకివెళ్ళి, అహ్మద్ భగవానులను చూచి వచ్చాం కదా !" అన్నాడు.

తేజసింహుడు అనుమానంతో యువరాజు ముఖాన్ని చూడ నారంభించాడు. యువరాజుతో "మీతో నేనెక్కడ కలిశానో చెప్పండి!" అన్నాడు.

యువరాజు జరిగిన సంగతంతా చెప్పాడు. తేజసింహుడు "అలాగా! పెద్ద మోసమే జరిగింది. అహ్మద్, భగవానుడు. తప్పించుకొని పోతేపోయారు కాని రాతిద్వారం తెరుచుకొనే విధివిధానం ఇతరులకు తెలిసిపోవటమే దురదృష్టం" అన్నాడు.

"మీరేమంటున్నారో నాకు అర్థంకావటంలేదు."

"అర్థమైతే, మోసంలో ఎందుకు చిక్కుకుంటావు. శివదత్తసింహుని మాయావులు మిమ్మల్ని మోసగించి చీకటి గృహం ప్రవేశించేపద్ధతి తెలుసుకొని పోయారు. ఈ పని బదరీనాథుడే చేసివుంటాడు" అన్నాడు.

యువరాజు తన తెలివితక్కువతనానికి సిగ్గుపడ్డాడు. తేజసింహుడు "అయిందేదో అయిపోయింది. ఈ పాటికి ఖైదీలు తప్పించుకొని పోయ్యేవుంటారు. నేను వెళ్ళి రాతి ద్వారాన్ని తిరిగి తాళం వేసే ఏర్పాట్లు చేస్తాను" అన్నాడు.

యువరాజు "ఇంకా నీవేమి తాళంవేస్తావు. ఆ రహస్యం వాళ్ళకు తెలిసిపోయిందిగా!' అన్నాడు. ఆ ద్వారానికి ఇంకా అనేక తాళాలు ఉన్నాయి. నిజానికి యిప్పటి వాటికంటె మిగిలి వున్నవే చాలా బలమైనవి. కాని వెయ్యటానికి ఆలస్యమౌతుందని నేను వాటిని వాడటంలేదు. ఇక ఇప్పుడు వాడక తప్పదుగా" అన్నాడు.

"వాటి సంగతికూడా నాకు చెప్పవు." అన్నాడు యువరాజు.

“ఇప్పుడొద్దు చునారగడ పతనమై పోయేదాకా నీకా రహస్యం చెప్పను.” అని అన్నాడు తేజసింహుడు.

యువరాజు “సరే నీయిష్టం” అన్నాడు తేజసింహుడు అప్పుడే చీకటిగృహానికి వెళ్ళి రాతిద్వారం మరొకరకమైన ఏర్పాటులతో బంధించివేశాడు. అప్పటికే బదరీనాద్ అహమ్మదులు తప్పించుకొని పోయారు. మరునాడు దర్బారుకు వేగులవాళ్ళువచ్చి “శివదత్తుడు మరింత సాహసానికి ఒడికట్టాడని చెప్పారు. యువరాజు “ఐతే మహమ్మదీయ సిపాయిలను శత్రువులను ఎదుర్కొనటానికి పంపించే సమయ మాసన్నమైంది” అన్నాడు రాజుతో. రాజు “సరే సైన్యాలను వురికించు” అని ఆజ్ఞాపించాడు. యువరాజు తేజసింహునితో మహమ్మదీయ సిపాయీలకు వెనుకగా ఫిరంగులను నడిపించే యేర్పాటులను చేశాడు

# 23

మరునాడు జయసింహ మహారాజు వీరేంద్రుడూ తేజసింహుడూ మహామంత్రితో కలసి యుద్ధవిశేషాలనుగురించి సంప్రదించుకొనుచుండగా కావలావారు పరుగుపరుగున వచ్చి “రాజా అంతఃపురంలో నుండి యెవరో శత్రువులు పారి పోతూవుండడం చూచి మన కావలావాళ్ళు బాణాలు వేశారు. గాని వాళ్ళు గాయపడికూడా తప్పించుకు పోయా ని” చెప్పారు ఈవార్త అక్కడ కూర్చున్నవారందరికి అశనిపాతంలా అందో ళన పరచింది; ఇంతలో అంతఃపురమంతా ఏడ్పులూ మొత్తు

కోళ్ళతో ప్రతిధ్వనించటం మొదలెట్టింది. క్షణక్షణానికి రోదన ధ్వనులు ఎక్కువై రాజవాసం యావత్తూ శోకతరంగితమైపో యింది. రాజకుమారుడు మహారాజు తెల్లబోయికూర్చున్నారు. ఆసమయంలో అనేకమంది దాసీలు పరుగెత్తుకొనివచ్చి ఏడ్పును ఆపుకోవాలని ప్రయత్నిస్తూ "రాజా రాకుమారి చంద్రకాంత ఆమె సఖియ చపలయొక్క శిరస్సులను నరికి ఎవరో ఎత్తుకొని పోయారని చెప్పారు." ఈ వార్త అక్కడివారికి ములుకుల్లా తగిలి గాయపరచింది. జయసింహమహారాజు "అయ్యో! అని నేలపై వ్రాలాడు. యువరాజుముఖాన నెత్తురుబొట్టు లేకుండా పోయింది. మహామంత్రి కండ్లనుండి అశ్రుధారలు ప్రవహించసాగై. తేజసింహుడు శిలాప్రతిమలా తయా రయ్యాడు. కొంతసేపటికి అంతరగా కోలుకొని లోనికి పరుగెత్తు కొనిపోయారు. అక్కడకు వెళ్ళిచూడగా మహారాణి రత్న గర్భ రాజకుమారి శవంమీదపడి భోరుభోరున ఏడ్వటం అంతా చూచారు. రాజకుమారునికి శవాన్ని సమీపించటానికి కూడా శక్తిలేక ద్వారంవద్దనే కుప్పకూలినట్లు కూలిపోయాడు.

చంద్రకాంత, చపల మొండెములు అక్కడ పడి వున్నాయి. గదంతా రక్తరంజితమైపోయింది. మహారాణి "ఓరి దుర్మార్గుడా, ఆడపిల్లను గొంతుకోయ్యటానికి నీకు చేతులెట్లా వచ్చినయిరా. అయ్యో! చంద్రకాంతా నీవు లేనిదే నాకు యీ ప్రపంచంలో యేమి వుంది" అని కన్నీరు మున్నీరుగా విలపించసాగింది.

"క్రూరసింహుని కంఠ్లివ్వాడు చల్లబడి పోయాడు. నా కూతురు లేని విజయగఢ సామ్రాజ్యంలో నా కక్కరలేదు. శివదత్తసింహుని వచ్చి సింహాసనాన్ని అధిష్ఠించమనండి" అని వాపోవసాగాడు.

ఇంతలో తేజసింహుడు పరుగుపరుగున అక్కడకువచ్చి వీరేంద్రసింహుడు స్పృహలేకుండా పడివుండటం గమనించాడు. తేజసింహునికి మిగిలివున్న ప్రాణాలుకూడా వీరేంద్రుని దురవస్థ చూచేసరికి లేచిపోయేటంత పనైంది. అప్పటికే వీరేంద్రుని ముఖాన గాయాలు తగిలి రక్తం వరదలై పారి ఉచ్ఛ్వాస నిశ్వాసములు చల్లబడిపోయినాయి. జయసింహ మహారాజు అతని శవంమీదపడి 'అయ్యో! మీ తండ్రికి నేను ఏమని సమాధానం చెప్పను. మా యిరువురి మరణం యిక్కడే వ్రాసిపెట్టి వుందికాబోలు" అని యేడుస్తున్నాడు.

తేజసింహుడు వీరేంద్రుని శవంమీదపడి రాజకుమారా నాకీ ప్రపంచములో వుండవలసినపని తీరిపోయింది కనుక నీకోసం కన్నీరు కార్చవలసిన అవసరంకూడా నాకు కలగటం లేదు. నేను సంతోషంతో ఇదుగో నీ వెంటనే వస్తున్నాను" అని చెప్పి బొడ్లోనుంచి చురకత్తి దూసి ఆత్మహత్య చేసుకోటానికి చేయెత్తే సరికి ఎవరో ఒకమనిషి అతనిచేతిని గట్టిగా పట్టుకోవటం జరిగింది. ఆపాదమస్తకం సిందూరం పూసుకొని వున్న ఒకమనిషి. తేజసింహుడు తిరిగిచూచేసరికి కన్పించాడు, అతడు.

"ఆత్మహత్య దేనికోయ్
ఆలకించవోయ్ మాట
ఇదంతా మోసం
పరీక్షించు శకం
లేవోయ్ అతిత్వరగా
వెతికివెతికి బయలుదీయి'

అని ఆ మనిషి పకృకికలించి అంతర్ధానమై పోయాడు.

—0—

# రెండవ అధ్యాయం

## 1

ఆసిందూరం పూసుకొచ్చిన వ్యక్తి యెవరో, యెటు నుంచి వచ్చాడో, యేమిచెప్పాడో అర్థంగాక అక్కడున్న వారందరూ గాభరాపడి పోయారు. కాని తేజసింహుడు మాత్రం "మీరెవ్వరూ దుఃఖించకండి. ఈశవాలు చంద్ర కాంత, చపలవికావు, వాళ్ళు జీవించే వున్నారు. ఇదంతా మాయావుల కుట్ర." అని గట్టిగా అన్నాడు.

తేజసింహుని మాటలకు అందరూ చకితులై గుసగుసలు ప్రారంభించారు. అందరూ కళ్ళనీళ్ళు తుడుచుకొని తేజసింహునివంక చూడసాగారు. మహారాణి పరుగెత్తుకొనివచ్చి "నాయనా యేమిజరిగిందో తొందరగా చెప్పు. చంద్రకాంత జీవించే వుందని నీవెట్లా చెప్పగలవు? ఇంతకు ముందు మహాలులో ప్రవేశించిన వాడెవడు?" అని తేజసింహునిపై ప్రశ్నలవర్షం కురిపించింది.

"ఆవచ్చినవాడెవడో నాకు తెలియదుగాని మొత్తం మీద చపలను, చంద్రకాంతను శివదత్తుని మాయావులు తస్కరించుకొని పోయారనిమాత్రం చెప్పగలను. ఈ [illegible] మైన శవాలను మనలను వెతక్కుండా చెయ్యాలని యిక్కడ పారేసి పోయారు." అని తేజసింహుడు చెప్పాడు.

"ఇది మన అమ్మాయిల శవాలు కాదని నీవెట్లా చెప్ప గలవ"ని మహారాజు ప్రశ్నించాడు.

"అదేమంత పెద్దపనికాదు; నడవండి మీకు తెలియ జేస్తాను." అని తేజసింహుడు పదునైన కత్తితీసుకొని చపల శవంయొక్క కాలు నొకదానిని నరికి "ఇందులో ఎముక లున్నాయేమో చూడండి." అన్నాడు. రాజు "అవును; ఇదంతా కర్రలగానే వుంది." అన్నాడు. తేజసింహుడు అదే విధంగా చంద్రకాంత శవాన్నికూడా చూచాడు. అందులో కూడా ఎముకలు కనుపించలేదు.

"చంద్రకాంత జీవించివున్నదిసరే శత్రువుల చేతచిక్కింది గదా!" అన్నాడు రాజు.

"చిక్కినా భయపడ నవుసరంలేదు. నేనిప్పుడే చంద్ర కాంతను, చపలను విడిపించుకొని రావటానికి వెళుతున్నాను" అన్నాడు తేజసింహుడు.

వీరేంద్రుడింకా స్పృహలేకుండానే పడివున్నాడు. అతనికీ విషయాలన్నీ యేమీ తెలియవు. మహారాజుకి వీరేం ద్రుని బతికించాలనే ఆదుర్దా యెక్కువై అనేకమంది వైద్యు లను పిలిపించి చూపించినప్పటికీ ప్రయోజనం లేకపోయింది. తేజసింహుడు వీరేంద్రుని అతని గదిలోనికి చేరవేయించి ఒంటరిగా చికిత్సచేయ నారంభించాడు. అతడు మహారాజుని కూడా లోన ప్రవేశించనీయకుండా చేసి కిటికీ తలుపులుకూడా మూసి వీరేంద్రుని చెవులో "చంద్రకాంత మరణించలేదు. అటునూడు, శివదత్తుని మాయావులు ఆమెను ఎత్తుకొనిపోతు న్నారు. వెనుగెత్తు చంద్రకాంతను రక్షించు! లేకుంటే ఆమె

నీకు దక్కదు. నీ వీరత్వం యిదేగా ? అయ్యో దాసూ శత్రువులు చంద్రకాంతను ఎత్తుకొని పోతుంటే చూచికూడా ఏమీ మాట్లాడవే !"

ఈ మాటలు వినటంతోనే యువరాజు కళ్ళు తెరచి చూచి "ఎవరు చంద్రకాంతను తీసుకొని వెళ్ళేది? ఆమె ఎక్కడ అని అటూ యిటూ చూచాడు. ప్రక్కగా తేజసింహుడు మాత్రం వున్నాడు. అతనిని "చంద్ర బ్రతికున్నదని నాకివ్వాడు చెప్పినదెవ్వరు ?" అని ప్రశ్నించాడు. "నేనే చెప్పాను. ఆమెను శత్రువులు దొంగిలించుకొనిపోయి ఆస్థానంలో కృత్రిమమైన శవాలను పడేసి పోయారు. చనిపోయారని మనం అనుకొని శోకటం మానుకుంటామని వాళ్ళయొత్తు." అని తేజసింహుడు చెప్పాడు. ఎంతకీ వీరేంద్రుడు నమ్మని కారణంగా ఎముకలులేని ఆ శవ భాగాలను తెప్పించి చూపి వీరేంద్రునికి నమ్మకం కలిగించాడు.

"అయితే యిప్పుడు వాళ్ళను విడిపించే వుపాయ మేమిటి?" అని అడిగాడు రాజకుమారుడు.

"నేనిప్పుడేంచేస్తానో చూడు!" అన్నాడు తేజసింహుడు.

వీరేంద్రుడు పునరజ్జీవితుడైనందుకు రాజు, రాణి చాలా సంతోషించారు. రాజు అతనిని కౌగలించుకొని ముద్దాడాడు.

ఉదయమైంది. మహారాజుతో కలిసి రాజకుమారుడు, తేజసింహుడు మాట్లాడుకుంటున్నారు. హరదయాళుడు వచ్చి "నిన్న చంద్రకాంత, చపల హత్యకావింపబడ్డారనే వార్త విని జైలు ఖానాదగ్గర కావలావున్న రక్షకభటులుకూడా మహాలు

లోనికి వచ్చారట. ఆ సమయం చూచుకొని మాయాపులు జైలులో మిగిలివున్న మాయాపులను కూడా విడిపించుకొని పోయారు. దీనితో మనకు దొరికిన శత్రువులు మొత్తం పారిపోయినట్టే" అని చెప్పాడు.

ఈ వార్తవిని అందరూ నిశ్చేష్టులై కూర్చున్నారు. ఇంతలో వేగులవాడొచ్చి "శత్రువులను యెదుర్కొనటానికి పంపిన మహామ్మదీయ సైన్యాలు వచ్చేసరికే శత్రుసైన్యాలు నాలుగుకోసులు యింకా ముందుకి చొరబడివచ్చాయి. వీరా యెదుర్కొనేసరికి మహామ్మదీయ సైన్యాలు పారిపోనాగినయ్. ఇదిచూచి వెనుకపాటునఉన్న మన ఫిరంగి దళం కాల్పులు సాగించి నాలుగోవంతు సైన్యాన్ని హతమార్చాయి. ఆపైన పారిపోవటానికి వీలుచిక్కక మిగతావారు బాగా పోట్లాడి దాదాపు ఒక వేయిమంది శత్రువులను నరికిపారేశారు. ఇక యిప్పుడు వాళ్ళుకూడా మిగిలిలేరుగనుక త్వరగా సహాయం వెళ్ళకపోతే ఫిరంగిదళానికి ముప్పొస్తుంది." అని యుద్ధవార్త నందించి పోయాడు.

ఆ వార్త వినగానే వీరేంద్ర యువరాజు హరిదయాళ మంత్రికి ఐదువేల సైన్యాన్ని యుద్ధభూమికి ఉరికించవలసిందిగా అనుజ్ఞయిచ్చాడు. అంతేగాక ఆ ప్రాంతంలో శిబిర నిర్మాణానికి కావలసిన పరికరాలుకూడా పంపించమని తాను ముఖ్యాహ్నం నుంచి తరలి వెళ్తానని ప్రకటించాడు. మహారాజు తానుకూడా బయలుదేటానికి సంసిద్ధమయ్యాడు. గాని వీరేంద్రుని పట్టుదలవల్ల మానుకొన్నాడు.

తేజసింహుడు తన మకాంలోనికి వెళ్ళి త్వరగా వస్తువులు తెముల్చుకొని బయటపడ్డాడు. ఒక చాటింపువానిని పిలిచి పట్టణాలో "దంతాల బీరంటే యిష్టమున్నవాడు తేజసింహుని కలుసుకోవలసింది"గా దండోరా కొట్టమని ఆజ్ఞాపించాడు. అదేవిధంగా వాడు పట్టణమంతా తిరిగి దండోరా వేశాడు గాని యెవడికీ తేజసింహుని చాటింపువిషయం అర్థంకాలేదు.

# 2

మామూలుగా జయసింహ మహారాజు దర్బారుకు వెళ్ళాడు. యెక్కడా వుత్సాహమనేది లేకుండా అందరి ముఖాలలోను విషాదమేఘాలు తారట్లాడసాగాయి. రాజకుమార వీరేంద్రసింహుడు మహారాజువద్ద శెలవుతీసికొని యుద్ధానికి వెళ్ళిపోయాడు. రాజు సభ చాలించి అంతఃపురంలోనికి ప్రవేశించాడు. అతని హృదయం కన్నకూతురు కోసం తల్లడిల్లి పోతోంది. జీవించివున్న చంద్రకాంత యెటువంటి కష్టాలలో చిక్కుకొని వుందో వూహించలేక పోతున్నాడు.

లోపల మహారాణీ దాసదాసీజనమంతాయి దేశవస్థలో ఉన్నారు. అందరి కంటి వెంట కన్నీరు ప్రవహిస్తూనే వున్నాయి. యెవరూ అన్నపానాలను ముట్టుకోనటం లేదు. అందరూ చంద్రకాంతను తలచుకొని బాధపడుతూనే వున్నారు.

మహారాణి రాజుతో "చంద్రకాంతను వెతికించే యేర్పాట్లేమైనా చేయించారా?" అని అడిగింది.

"తేజసింహుడు ఆ పక్కమీదే వున్నాడు. అవసరమైతే సమర్థులు యింకెందరో వున్నారని నియోగించను! ఉ... వీరేంద్రుడు యుద్ధభూమికి వెళ్ళాడు. ఏమి జరిగినంత తెలియకుండా వుంది" అన్నాడు రాజు రాణికి సమాధానంగా.

## 3

సాయంకాలం కావొస్తోంది, ఒక పచ్చికబయలుపై పదిహేను, ఇరవైకుర్చీలు వేయబడివున్నాయి. అందులో మూడింటిమీద యువరాజైన వీరేంద్రసింహుడు, మహామాయావిద్యైన తేజసింహుడు, సేనాని ఘతసింహుడు కూర్చున్నారు. మిగతా కుర్చీలు ఖాళీగా వున్నాయి. వాటికి తూర్పుదిక్కుగా అర్ధచంద్రాకారంలో వందలాది శిబిరాలు నిలబెట్టబడ్డాయి. మధ్యగ వీరేంద్రుని సైనికులు యుద్ధసామాగ్రులను పరిశుభ్రంచేస్తూ సిద్ధపరుస్తున్నారు. పెద్దపెద్ద శకటాల మీద సర్వసన్నద్ధం చేసిన ఫిరంగులు వుంచబడ్డాయి. దక్షిణదిక్కుగా అశ్వరాజాలు కట్టబడివున్నాయి. వాటికి కొంచెం ముందు మత్తగజాలు సంకెళ్ళతో కట్టివున్నాయ్. పశ్చిమాన వాయిద్యగాండ్లు, సారంగాలను త్రవ్వేఉప్పరులు కొండలను పిండికొట్టేవాళ్ళు, రహస్యపరిశోధకులు ఒక్కడేరాలో వున్నారు. దాని ప్రక్కగా తినుబండారాల డేరావుంది.

యువరాజు సేనాపతితో "నా డేరా శిబిరం తెల్లవారేసరికి 'లోహారా' మైదానానికి చేర్చబడతాయా? అక్కడే నేను శత్రువుల్ని యెదుర్కొంటాను" అని అన్నాడు. తర్వాత

చేర్చబడతాయి. మన సైన్యంకూడా తెల్లవారేసరికి మనసే తరలి ప్రాన్తపాదవశమునుపే అక్కడకు చేరుకుంటుంది. ఆపైన ఎల్లుండినుంచి కూడా మన తడాఖా చూపించవచ్చు. చాలా కాలంనుంచి కూర్చొని, కూర్చొని మన సైన్యాలకుకూడా ఏమీ తోచుబడిలేకుండా వుంది" అన్నాడు సేనాపతి.

ఇంతలో మాయావి దేవీసింహుడు యెదురుగా రావటం గమనించారు. దేవీసింహుడు సమీపించి, రాజకుమారునికి, తేజసింహునికి నమస్కరించాడు. అతనిరాక అక్కడివారందరికీ సంతోషకారణమైంది.

దేవీసింహునితో రాకుమారుడు "విజయగఢలో ఇన్నాళ్ళనుంచి నీవేమిచేస్తున్నావు.?" అని అడిగాడు. "అతడు ఏమిచేసిందీ నేను చెప్తాను" అని తేజసింహుడు "మీరు చంద్రకాంతతోకలసి తోటలో కూర్చొన్నప్పుడు భూత మొకటి వచ్చి ఏదో చెప్పివెళ్ళినమీదట నేను అక్కడనుండి మిమ్మల్ని బలవంతంగా తీసుకొని వెళ్ళాను. ఆభూతమైవచ్చింది యితడే. నౌగఢలోకూడా సాధువేషంలో క్రూరసింహుని వర్తమానం మందించింది యితడే. చంద్రకాంత మరణం రాజమహలులో గగ్గోలు పుట్టించినప్పుడు యితడే చంద్రకాంత మరణించలేదని వచ్చి చెప్పాడు. ఇప్పటికితడు ఇంతపని చేశాడు. ఇతనికి ఒక చోటంటూ లేని కారణాన హృదయం దండోరా వేయుంచింది ఇతనికొరకే!" అని చెప్పాడు.

దేవీసింహుని కార్యసూరతకు రాజకుమారుడు ఆశ్చర్యపడి అతనిని ఘనంగా ప్రశంసించాడు. దేవీసింహుడు "మనం పూర్తిగా విజయాన్ని సాధించేవరకు పొగడ్తలలో కాలం వెళ్ళ

బుచ్చారాక. ఇప్పుడు చంద్రకాంతను విడిపించే మార్గం ఆలోచించాలి. లేకపోతే ఆమె ప్రాణానికే ముప్పురావచ్చు. మనం కేవలం చంద్రకాంతను వెతుకుతూ కూర్చున్నా అటు యుద్ధ ఫలితాలు విషమించవచ్చు." అని అన్నాడు. రాజకుమారుడు "చంద్రకాంత ఎక్కడవున్నదో ఎవరు దొంగిలించారో చెప్పగలవా?" అని దేవీసింహుని ప్రశ్నించాడు. "ఆమెయెక్కడవున్నదో తెలియదుకానీ బదరీనాథుడూ, నాజిం కలసి చంద్రకాంత, చపలను యెత్తుకొని పోయారనిమాత్రం తెలుసు" అని దేవీసింహుడు చెప్పాడు.

తేజసింహుడు "ఇప్పుడు మన శత్రువుల మాయావులందరూ విడిపించుకొని పోతారు. వాళ్ళు తొమ్మండుగురు. మేము ఇద్దరం! ఎక్కడకని చంద్రకాంతను వెతుకుతాం? ఎక్కడకని యుద్ధభూమిలో రాజకుమారునకు సహాయపడతాం?" అన్నాడు.

"ఐనా తప్పదు. ముందుగా మనం శివదత్తుని యెదురొక్కటానికి వెళ్ళదాం. అక్కడే రాజకుమారినికూడా వెతికే ప్రయత్నం చేయించవచ్చు" అని అన్నాడు దేవీసింహుడు.

అర్ధరాత్రివరకూ వాళ్ళంతా యుద్ధనిర్వహణను గురించి సమాలోచించుకొని వారివారి శిబిరాలలో ప్రవేశించారు. రాకుమారుని శిబిరం ప్రక్కగానే తేజసింహుడు దేవీసింహునితో కలసి తన శిబిరంలో విశ్రాంతి తీసుకుంటున్నాడు. సైనికదళం నలుదిక్కులా పహారాయిస్తున్నది. ఒక జాము రాత్రివేళ ఒక చిన్న ఫిరంగిధ్వని వినిపించింది. దాని తర్వాత కొద్దిసేపటికి యుద్ధవాయిద్యాలు ప్రమోగాయి. సైన్యాలు ప్రయాణమై

ముందుకుసాగాయి. వెనుక దిక్కున రాకుమారుడు గజారూఢుడై ప్రయాణం సాగించాడు. ఆ యేనుగుకు నాలుగు దిక్కులా సైనికులు అశ్వారూఢులై రక్షణ యిస్తున్నారు. తేజసింహుడు దేవీసింహుడు, తమ మాయాజాలపు సంచితో కొంతదూరం ముందుగానూ, మరికొంతదూరం వెనుకగానూ తమయిష్టం వచ్చినట్లు కాలినడకన ప్రయాణంచేస్తున్నారు.

జాము ప్రొద్దెక్కింది. వీరేంద్రుని సైన్యాలు శివశక్తి సింహుని సైన్యాలను యెదుర్కొనే ప్రదేశానికి వచ్చి చేరుకున్నాయి. అక్కడ అంతకుముందే జయసింహ మహారాజ సైన్యాలు డేరాలువేసి వున్నాయి. అప్పటికి యుద్ధం ఆగిపోయివుంది. జయసింహుని మహాద్వితీయ సైన్యం పూర్తిగా విధ్వంసం అయిపోయింది.

అన్ని యేర్పాట్లు పూర్తిఅయిన తర్వాత వీరేంద్రుడు తన శిబిరంలో ఒక సమావేశాన్ని యేర్పాటు చేశాడు. ఆసమావేశంలో మీరామున్షిని శివదత్తునికి ఒకఉత్తరం వ్రాయవలసిందిగా ఆజ్ఞాపించాడు. ఆఉత్తరంలో "ఒక పనికిమాలిన వ్యక్తి రెచ్చకొట్టటం మూలంగా జయసింహ మహారాజుపై అనవసరంగా యుద్ధానికి తలపడ్డావ్. అంతేగాక కన్నుమిన్ను కానరాకుండా రాజకుమారిని ఆమె చెలికత్తెనుకూడా దొంగిలించుకొని పోయావని తెలిసింది. ఇప్పటికైనా నీవు మర్యాదగా వారి నిద్దరిని జయసింహ మహారాజుకు గౌరవ పూర్వకంగా అప్పగించు. యుద్ధాన్ని మానుకొని క్షేమంగా ఇల్లుచేరు. లేకపోతే చివరకి నీవు పశ్చాత్తాపపడవలసి వస్తుంది. యుద్ధ రం

... ... పీపుల శక్తి ఝళిపింపులకు నిప్పు ...పూ - ఆన నా బూ ...ండా పోవలసి వస్తుంది. ముందుగానే సెలవుకో!" అని ప్రార్థించాడు.

ఉత్తరం పూర్తయిన తర్వాత "ఈ ఉత్తరాన్ని శివదత్తునికి యెవరు వెళ్ళి అందిస్తారు?" అని ప్రశ్నించాడు యువరాజు.

"నాకు చాలా కాలంనుంచి శివదత్త సింహునితో పోట్లాడాలనే కోరికవుంది. అనుమతిస్తే నేను స్వయంగా ఈ ఉత్తరాన్ని శివదత్తునికందచేస్తాను." అన్నాడు వెంటనే దేవీసింహుడు.

"అంత పెద్ద సైన్యంలోనికి నువ్వు ఒంటరిగా వెళ్ళటం క్షేమంకాదు." యువరాజన్నాడు. తేజసింహుడు వదలాలేదు; 'వెళ్ళనివ్వండి' అన్నాడు. దానికి యువరాజు సమ్మతించి ఒర నుండి ఖడ్గాన్ని దూసి దేవీసింహునికిచ్చాడు. అతడు దానికి వీరాభివాదనంచేసి గైకొన్నాడు. ఉత్తరాన్ని సంచిలో భద్రపరచి తేజసింహుని చరణాలకు నమస్కరించి ప్రయాణమై వెళ్ళిపోయాడు.

శివదత్త మహారాజు అంతరంగికులలో దేవీసింహుని యెవరూ యెరుగరు, వాళ్ళు దూరాన ఒక పెద్ద యుద్ధ శిబిరం నిర్మాణం కావటం గమనించారు. అదే మహారాజు శిబిరమని కూడా అనుకున్నారు. రాజుగారికి వీరేంద్రసింహుని దూత ఒక ఉత్తరాన్ని కొనితెచ్చాడని కబురంపించారు. శివదత్తుడు దేవీసింహుని లోనికి ప్రవేశించటానికి అనుజ్ఞ యిచ్చాడు.

దేవీసింహుడు శిబిరంలోనికి వెళ్ళాడు. అక్కడ శివదత్త మహారాజు బంగారు సింహాసనం మీద అధిష్టించి వున్నాడు.

ఎడమ ప్రక్క సుహోమంత్రి తరువాత రెండువైపులా సే..నా పతులు ఖడ్గపాణులై డాంబికమైన దుస్తులు ధరించి రజితా సనాలపై కూర్చొని ఉన్నారు. వాళ్ళను చూస్తే బహుశా గుండెఆగిమరణించినా ఆశ్చర్యపడనవసరంలేదు. అసౌర్యా... ము మితమైన ఆసనాలలో మాయామాత్రులు, విరాజమానులై వున్నారు. అనేకమంది భటులు చేతులు కట్టుకొని నిలబడి వున్నారు.

దేవీసింహుడు యెవరికీ నమస్కరించకుండానే సభాం మధ్యకు వెళ్ళి నిలబడ్డాడు. ఒక్కసారి తన దృష్టిని నాలుగు వైపులకూ ప్రసరింప చేశాడు. ఆ తరువాత ఒకడుగు ముందుకు వేసి వీరేంద్రసింహ రాకుమారుని ఉత్తరాన్ని సింహాసనం మీద వుంచాడు.

శివదత్తుడు దేవీసింహుని పొగరుబోతుతనానికి మండిపడి "ఒక మత్తగజాన్ని యెదుర్కొనే సాహసం దోమ పాలుతాగటమైనా సరిగా విడిచిపెట్టని వీరేంద్రసింహునికి ఇంత పొగరు పనికిరాదు." అని ఆ ఉత్తరాన్ని చేతిలోకి తీసుకొని చదవకుండానే చించి పారేశాడు. ఉత్తరాన్ని చించివేసేసరికి దేవీసింహుని కళ్ళు ఎరుపెక్కాయి. అతడు శివదత్తుని ఉద్దేశించి "ఎవడి నెత్తిన మృత్యుదేవత కథను త్రొక్కుతుంటుందో వాడి బుద్ధులెప్పుడూ పెడదారినే నడుస్తుంటాయి." అన్నాడు. దేవీసింహుని పరుష వాక్యాలు శివదత్తుని గుండెల్లో బాణాల్లా దూసుకొనిపోయాయి." పట్టుకొండి; ఈ పొగరుబోతుని!" అని ఆజ్ఞాపించాడు. ఆ వెను వెంటనే రక్షకభటులు దేవీసింహునిమీదికి వురికారు. దేవీ సింహుడు కత్తిదూసి ఇద్దరు ముగ్గురు భటుల్ని తలలు తరిగాడు.

ఆ వెంటనే తన మాయాజాలపు సంచిలోనుంచి ఒక బంతిని తీసి నేలకేసికొట్టాడు. అది పేలి ఆ శిబిరాన్ని అల్లకల్లోల పరిచింది. మహారాజు హడలెత్తి అటూ యిటూ ఉరికాడు. ఆ ఉరకటంలో అతని తలపాగ నేలపైబడి అపవిత్రమైపోయింది. అదే క్షణంలో దేవసింహుడు సింహకిశోరంగా లంఘించి తలపాగను చేతజిక్కించుకొని శిబిరం దాటి పారిపోయాడు. అందరూ నిశ్చేష్టులై నిలబడి చూడటంతప్ప యెవరూ యేమీ చెయ్యలేకపోయారు. శివదత్తుడు తన కోపాన్నంతా దర్బారులో కూర్చొనివున్న మాయావులపై వెళ్ళగక్కాడు. "ఎందుకు? మీ మాయలాడితనం? ఇంతమంది మహా మాయావులు చూస్తుండగానే ఒక్కగానొక్క శత్రువుల మాయగాడు అవమానపరచి పోయాడు." అని తిట్టాడు.

అందుకు సమాధానంగా బదరీనాథుడు. "రాజా! మాయావులమైన మేము వేలాదిగా వున్న జనంలోనికి వెళ్ళి పనిచేయవలసి వుంటుంది గాని; ఒక్క మనిషి మీద పదిమంది మాయావులు పడటం జరగదు. కాని ఈసభలో పేరుమోసిన పహిల్వానులు కూర్చున్నారుగదా; వాళ్ళేమీ చెయ్యలేకపోయారేమి?" అన్నాడు.

శివదత్త మహారాజు బదరీనాథునికి సమాధాన మివ్వకుండానే "మంచిది. రేపుచూద్దాం" అనిమాత్రం అనగలిగాడు.

# 4

శ్రీవత్స మహారాజు మణిఖచితమైన తలపాగను దేవిసింహునకు తీసుకొని వీరేంద్రుని శిబిరానికి వచ్చాడు. అక్కడ జరిగిన విశేషమంతా తెలియజేశాడు. తేజసింహుడు తలపాగలోని మణులు పొదగబడిన పట్టీనే తీసి తన సంచిలో వేసుకున్నాడు. యువరాజు అది గమనించి "దానిని నీవేం చేసుకుంటావ్ ?" అని అడిగాడు. అందుకు తేజసింహుడు "నీ పెళ్ళినాడు నేను శివదత్తుని వేషం వేసుకొని దీన్ని తలకు గట్టుకొని పెళ్ళివారి ముందు జండా ఒకటి తీసుకొని నడుస్తాను" అని అన్నాడు. ఆ మాట రాజకుమారునికి నవ్వు పుట్టించినా వెంటనే కళ్ళనుంచి రెండు కన్నీటిబొట్లు నేలపై పడేటట్లు చేసింది. తేజసింహుడు యువరాజు బాధ గ్రహించగలిగాడు. అతనికి కూడా చపలను గురించిన బాధ వుండనే వుంది. దేవిసింహునితో "రేపు యుద్ధం తప్పకుండా జరుగుతుంది. గనుక మనలో ఒకడు ఇక్కడ వుండటం అవసరం. మరొకడు చంద్రకాంతను వెతకటానికి వెళ్ళాలి." అన్నాడు. దేవీసింహుడు "అయితే మీరిక్కడ వుండండి. నేను చంద్రకాంతను వెతుకుతాను" అన్నాడు. తేజసింహుడు "పర్వత ప్రాంతమైన చునారగఢ నీకు బాగా తెలియదు గనుక నీవే ఇక్కడుండు." అని తాను చంద్రకాంతను అన్వేషించటానికి తరలిపోయాడు.

# 5

ఆ రాత్రంతా చంద్రకాంతనుగూర్చిన అనేక ఆలోచనలతో వీరేంద్రుడు కలతనిద్ర చెందాడు. తెల్లవారి శివదత్తుని దిక్కుగా కోలాహలం వినిపించింది. రాకుమారుడు కాలకృత్యాలు తీర్చుకొని యుద్ధానికి సిద్ధమయ్యాడు. వార్తావాహకులు వచ్చి అక్కడివిశేషాలు చెప్పారు. రాకుమారుడు అరబ్బు జాతికి చెందిన మంచి గుర్రాన్ని ఎక్కి రణభూమికి చేరుకున్నాడు. అక్కడ దేవసింహునితో "అనేకమందిని యుద్ధానికి బలిచ్చి రక్తపాతం చెయ్యటం మంచిది కాదని శివదత్తునికి తెలియచేయటం వుత్తమం. ఎవరికి తాము మహావీరులమని గర్వమున్నదో వాళ్ళు మాత్రం పరస్పరం యెదుర్కొని జయాపజయాలు తేల్చుకోవటం మంచిది" అని చెప్పాడు. దేవసింహుడు "సరే" అని రణభూమిలో ప్రవేశించి తన వుత్తరీయాన్ని రెండు, మూడుసార్లు పైకి చూపించాడు. అంతలో అటుదిక్కున వున్న బదరీనాథుడు దేవసింహుని చెంతకు వచ్చి "మాయాకీ జై" అన్నాడు. దానికి ప్రతిగా దేవసింహుడు కూడా "మాయాకీ జై" అన్నాడు. బదరీనాథుడు "యెందుకు పిలిచావు?" అన్నాడు.

"నీతో పనుండి."

"ఏమిటో చెప్పు?"

"మీ సైన్యంలో అధికంగా పురుషులా? స్త్రీలా?"

"మా సైన్యంలో ఆడవాళ్ళ వాసనే లేదు."

"మీ సైన్యంలోని వీరులు మామూలు సిపాయిలు పోట్లాడుకుంటుంటే చూచి ఆనందిస్తారేమో!"

"మా వద్ద కార్యశూన్యులైన వీరులే వున్నారు."

"అంటే పౌరుషం బాగా దున్నగలరనుకుంటాను!"

"పౌరుషమే దున్నుతారో తలలే తరుగుతారో, కలియబడితే తెలుస్తుంది."

"ఐతే ఒకరిపై ఒకరు కలియబడి ఫలితాన్ని తేల్చుకుందాం. అట్లాఅయితే పనికూడా త్వరగా పూర్తిఅవుతుంది పాపం! ఆ అమాయకులైన సిపాయిల ప్రాణాలు తియ్యటమైనా తప్పుతుంది. మా రాజకుమారునితో మీ శివదత్తునికి గుండెలుంటే కలియబడమను." అని దేవీసింహుడు బదరీనాథుని ఒక దోవకు తెచ్చాడు.

బదరీనాథుడు "మా మహారాజుకు మీ రాకుమారుడు గోరెపిల్లతో సమానము" అన్నాడు.

"అయితే ఇంకేం? మీ రాజును సిద్ధంకమ్మను." అని అన్నాడు దేవీసింహుడు.

బదరీనాథుడు తిరిగివెళ్ళి శివదత్తునితో యీ సమాచారమంతా చెప్పాడు. శివదత్తుడు వుగ్రుడై గుర్రానిఎక్కి రణభూమిలో ప్రవేశించాడు. గాలిలో కత్తిని తిప్పాడు. అదీ చూచి వీరేంద్రుడు సిద్ధమై శివదత్తుని తాకిపిల్చాడు. శివదత్తు హేళనతో "ఏమి వీరుడవయ్యా! నీ పరిశ్రమ నీ ముఖమే చెప్పుతుంది! నీవుడవైతే చంద్రకాంతను దొంగతనంగా తీసుకుపోయావేం? వీరులు ఎక్కడైనా దొంగతనం చేస్తారా?" అని పరిహసించాడు. అతనిమాటలు శివదత్తునికికోపకారణ

సైగాయి సమాధాన మివ్వకుండానే ఖడ్గాన్ని రాకుమారునిపై వూశాడు. వీరేంద్రుడు తనఖడ్గంతో శివదత్తుని ఖడ్గాన్ని ఎగరగొట్టేశాడు.

ఆ తమాషా చూచి జనం 'శహభాష్ శహభాష్' అని కేరింతలు కొట్టారు. శివదత్తుడు మరొక ఖడ్గాన్ని తీసి వీరేంద్రునిపై లంఘించాడు. వీరేంద్రుడు ఎదుర్కొన్నాడు. ఇద్దరిమధ్య మధ్యాహ్నంవరకూ పెద్ద యుద్ధం జరిగింది. ఆ తర్వాత శివదత్తుని గుర్రము గాయపడి నేలకొరిగింది. శివదత్తునికికూడా గాయాలు తగిలాయి. అతడు గుర్రాన్నిదిగి రాకుమారుని గుర్రాన్ని చంపడానికి ప్రయత్నించాడు. రాకుమారుడు అది తెలుసుకొని తానుగూడా గుర్రాన్నిదిగి శివదత్తునికి ఒక కొరడా దెబ్బ తగిలించాడు. ఆ దెబ్బతో శివదత్తుని కత్తి చెయ్యిజారి పడి పోయింది. వెంటనే దేవీసింహుడు ఆ కత్తిని దొరకపుచ్చుకొన్నాడు. అప్పుడు శివదత్తునికి వీరేంద్రుని ప్రతాపం తెలిసి వచ్చింది. ఇక లాభంలేదనుకొని శివదత్తుడు తనసైన్యాన్ని వీరేంద్రునిపైకి పురికించాడు. శత్రుసైన్యాలు వీరేంద్రుని ముట్టడించాయి. అదిచూచి రాకుమారుని సైన్యంకూడా తారసిల్లింది. సేనాపతి ఫతహాసింహుడు, దేవీసింహుడు అతి కష్టంమీద రాకుమారునికి సహాయం వెళ్ళియుద్ధంచెయ్య సాగారు. ఇరుపక్షాల పెద్ద యుద్ధం జరిగింది.

శివదత్తుని వీరులందరూ రాకుమారుని కదిలించలేకపోయారు. రాకుమారుడు శత్రుసైన్యాలను వేలాదిగా హతమార్చాడు. సాయంకాలమైంది. ఆ రోజుకి యుద్ధం ముగిసింది. రాకుమారుడు తనశిబిరం చేరుకున్నాడు. బాగాఅలసివున్నాడు.

సేనాపతికి కూడా కొద్దిగా గాయాలు తగిలాయి. అంతా ఆ రాత్రి విశ్రమించారు.

శివదత్తమహారాజు, మహామంత్రిని, వీరాధిపులను కూర్చోబెట్టి కర్తవ్యాన్ని ఆలోచించాడు. వీరేంద్రుడికి సైన్యా-బలం తక్కువగా వున్నా బలాధిక్యతలో శివదత్తునికంటే ఎన్నో రెట్లు మించి వుండటం శత్రువులకు భయకారణమైంది. అందుచేతనే ఆ రాత్రి రాత్రే దొంగచాటుగా రాకుమారుని సైన్యాలపై దెబ్బతియ్యాలని నిశ్చయించుకొన్నారు. ఇంకా రాత్రి మిగిలివుంది. శివదత్తుడు ఐదువందల సిపాయిలతో రాకుమారుని సైన్యాలమీద పడి గట్టిదెబ్బ తీశాడు. పెద్ద గందరగోళమైంది. ఆ చీకటి రాత్రిలో ఎవడు శత్రువో, ఎవడు మిత్రుడో ఎవరికి తెలియనే లేదు. రాకుమారుని సైన్యం తమవారినే శత్రు సైన్యంగా భావించి చంపటం మొదలెట్టింది. ఈ వార్త వీరేంద్రునికి తెలిసి శిబిరం బైటికి వచ్చాడు. దేవీసింహుడు అనేక మందిని కాగడాలు వెలిగించమని ఆజ్ఞాపించాడు. ఆ కాగడాలను తేజసింహుడు స్వయంగా మంచి వుపాయంతో తయారు చేయించాడు. వాటిని వెలిగించటంతోటే రాత్రి పగలుగా మారిపోయింది. ఆ వెలుగులో తెల్లవారేసరికి శివదత్తుని ఐదు వందల సైన్యం కర్పూరంలా హరించుకొనిపోయింది. కానీ వీరేంద్రునికి కాగడాలు వెలిగించటానికి పూర్వం ఒక వెయ్యి సైన్యం నష్టమైంది. ఆ నష్టానికి రక్తపాతానికి వీరేంద్రుడు చాలా నొచ్చుకున్నాడు. తెల్లవారేసరికి యుద్ధం ముగిసింది.

తిరిగి ఇరుసైన్యాలు తారసిల్లాయి. రాకుమారుడు సిద్ధమై శత్రువులలో చొరబడ్డాడు. పెద్దయుద్ధం కొనసాగింది.

ఎవరూ వెనకడుగు వెయ్యటంలేదు. యింతలో తూర్పునుండీ ఉత్తరంనుంచి కొంత సైన్యం అతివేగంగా రావటం కనిపించింది. సైన్యానికి ముందు భాగాన అరబ్బు గుఱ్ఱముపై ఒకవ్యక్తి ఎవ్వరోసిపాయి దుస్తులు ధరించి వీరావేశంతో ముందుకు సాగుతున్నాడు. అతని వెనుక ఐదువందల సైన్యానికి తక్కువేమీలేదు. అతని ఆకృతిని బట్టి సేనాపతిగా భావించవచ్చు. ఆసేనాపతి ముఖాన ముసుగు వ్రేలాడుతోంది. ముందుకొచ్చినకొద్దీమిగతావారి ముఖాలపై కూడా చాటు తెరలున్నాయని తెలియసాగింది.

ఆ సైన్యం శివదత్తుని సైన్యాన్ని వెనక దిక్కుగా గట్టి దెబ్బతీశాయి. వీరేంద్రుడు ఎవరో తనకు సహాయపడుతున్నారని తెలిసి మరింత సంతోషంతో కొదమసింగంలా పోరాడసాగాడు. రెండువైపుల దెబ్బను శివదత్తుని సైన్యం వహించలేకపోయింది. ఆ మరుక్షణంలోనే వెన్నుచూపి పారిపోసాగింది. వీరేంద్రుడు శత్రుసైన్యాలను రెండు కోసులవరకు తరిమికొట్టాడు. చివరికి విజయ ఢంకా మ్రోగించి గ్రామం చేరుకున్నాడు. కానీ తనకు సహాయపడినవారు ఎవ్వరో అతనికి తెలియరాలేదు. వాళ్ళు వచ్చిన దోవనే తిరిగి పోయారుకూడా. ఎవరి కృతజ్ఞతలూ వారికి అవసరం లేకపోయాయి.

శివదత్త మహారాజు యుద్ధసామగ్రులు, శిబిరాలు నాశనమౌనికే దక్కాయి. దేవీ సింహునికి కూడా తమకు సహాయించిన సైన్యం ఎవరిదో తెలియరాలేదు. ఇంతలో ఒక రహస్య పరిశోధకుడు వచ్చి శత్రువులు తిరిగి యుద్ధసన్నద్ధులౌతున్నారని సమాచార మందించాడు.

# 6

చపల, చంద్రకాంతలను అన్వేషించటానికి సైన్యం నుండి విడివడివచ్చిన తేజసింహుడు ఏ దిక్కుగా వెళ్ళాలా అనే ఆలోచనలో పడ్డాడు. శివదత్తుని సైన్యంలో మాత్రం చంద్రకాంతను వెతకవలసిన అవసరం వుండదనుకొని తేజసింహుడు చునారగఢ వెళ్ళటానికి నిశ్చయించుకొన్నాడు. చునారలగఢలో మారు వేషంలో అటూ యిటూ తిరగ నారంభించాడు. ఎంతకీ అతనికి తనకు కావలసిన సమాచారం దొరకలేదు. ఒకనాటి రాత్రి మారు వేషంతో కోటలో ప్రవేశించి వెతకటం ప్రారంభించాడు.

తిరుగుతూ, తిరుగుతూ సమయంచూచి తేజసింహుడు కళ్ళగంతలు కట్టుకొని తాడుచుట్టను విసరి మహాలుపైకి ఎక్కిపోయాడు. అప్పటికి అర్ధరాత్రి గడచింది. పై కెక్కిన తేజసింహుడు దిక్కులు పరికించి చూచేసరికి ఏదో శబ్దం వినిపించింది. ఆ వెనువెంటనే క్రిందికి దిగి ఒక ప్రక్కకు వదిగి చూడసాగాడు. ఎదురుగా ఒక మనోహరంగా అలంకరించిన గది కనిపించింది. దాని గోడలకు అందమైన పటాలు వ్రేలాడగట్ట బడినవి. అంతగా వెలుగులేదు. మిణుకు మిణుకుమంటూ ఒక దీపం వెలుగుతూంది. ఆ గదిమధ్య భాగంలో ఎత్తైన మంచం మీద ఒక స్త్రీ నిద్రిస్తోంది. నాలుగువైపులా అనేకమంది స్త్రీలు నేలపై పడుండి వున్నారు. తేజసింహుడు ముందు గదిలో ప్రవేశించి నెమ్మదిగా దీపాలను ఆర్పేశాడు. ఆ గదిలోకి ఎక్కడనుండో సన్నని వెలుగు మాత్రం ఇంకా ప్రసరిస్తోంది.

గదిశాకిలి ప్రక్క నిలబడి తేజసింహుడు ఒక అందమైన స్త్రీని చూడగలిగాడు. ఆమె కంటి సమీపాన ఒక చిన్న మచ్చ వుంది. దాని వల్ల తేజసింహుడు ఆమె తప్పనిసరిగా శశిదత్తుని రాణి అయి వుంటుందని నిశ్చయించుకున్నాడు. వెంటనే తేజసింహుడు తన సంచిలోనుండి కలం కాగితం తీసి యీ విధంగా వ్రాశాడు.

"ఈ సమయంలో నా హృదయం ఎందుచేతనో, చంద్రకాంతను కలుసుకోవాలని పరితపిస్తున్నది. ఏమైనప్పటికి ఆమెను నేను కలుసుకునే తీరుతాను. ఆమె ఎక్కడ వున్నదీ ఎటు వెళ్ళవలసినదీ నాకు తెలిసిపోయింది.

ఆ తర్వాత తేజసింహుడు రాణి పవళించిన పర్యంక సమీపానికి వెళ్ళి మత్తుమందును ఆమెకు వాసన చూపించాడు. ఆమె స్పృహలేకుండా అయిపోయింది. వెంటనే రాణిని దుప్పట్లో చుట్టి అంతకుముందు వ్రాసిన లేఖను ఆమె తలగడక్రింద పెట్టి తాడు సహాయంతో రాణిని తీసుకొని క్రిందికి వచ్చివేశాడు. కొంతదూరం వెళ్ళినతర్వాత మహారాణిని మరింతగా మత్తిల జేసి ఒక పర్వత గుహలో దాచి తిరిగి కోటలో ప్రవేశించాడు. ఒక ద్వారం చాటున దాగి కూర్చున్నాడు.

## 7

ఉదయమైంది. దాసీలు కళ్ళు నులుముకుంటూ లేచి మంచంమీదకి దృష్టి ప్రసరించారు. అక్కడ రాణి లేదు. అటూ ఇటూ చూచారు. ఎక్కడా కన్పించలేదు. చివరికి కలకలం ప్రారంభమైంది. ఈ వార్త బైటకు పొక్కి అందరికీ

ఆందోళన కలిగించింది. శివదత్తమహారాజు యుద్ధభూమిలో పరాజయం చెంది పది పదిహేనుమందితో కలసి 'చునాగఢ' ప్రవేశించారు, కోటలో ప్రవేశించి మహారాణి అంతర్ధానగాధ తెలుసుకున్నాడు. ఆ వార్త అతనికి మరింత ఆందోళన కలిగించింది. అంతఃపురమంతా శోకపరితప్తమై యున్నది. అసలే అతడు యుద్ధంలో పెద్ద దెబ్బతిని యున్నాడు. అతనికే తిరిగి భార్యా వియోగంకూడా సంభవించి, మరింత దిక్కు తెలియని వానిలా చేసింది. ఎటూ పాలుపోక ఆ రాత్రి రాణి నిద్రించిన మంచం మీదకు చేరి తలగడలో తలదూర్చి పసిపిల్లవానిలా ఏడ్వ సాగాడు. అతనికి తలగడ క్రింద వున్న లేఖ కన్పించింది. తెరచి చూచాడు. అందులో ఏదో వ్రాసి వుంది. ఆ లేఖను చూచుకొని నానా ఆలోచనలు పరి పరి విధంగా పోసాగినాయి. అది మహారాణీ వ్రాసినట్లుగా అతనికి అనిపించలేదు. ఆమె అక్షరాలు అంత కుదురుగా వుండవు అయితే యిది ఎవరు వ్రాసి పెట్టి వుంటారు! ఒకవేళ మహారాణియే వ్రాసియుంటే ఆమెకు చంద్రకాంత వున్న చోటు తెలియదు కదా? ఇప్పుడేమి చెయ్యటం? జాడ తెలియటానికి కోటలో ఒక మాయావియైనా లేడు. ఇంకెవరినైనా పంపిద్దామంటే వాళ్ళకు చంద్రకాంత బంధింపబడ్డచోటు తెలిసిపోతుంది కదా!

ఈ విధంగా మహారాజు అనేక విధాలుగా ఆలోచించి చివరకు తానే చంద్రకాంత బంధింపబడ్డ చోటుకు వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. ఒంటరిగా వెళ్ళినా ఫరవా లేదనుకున్నాడు. కాని సాయంకాలం వెళ్ళడం మంచిదని నిశ్చయించు

పన్నారు. అప్పటికే అనేకమంది మహారాణిని అన్వేషించ టంలో నిమగ్నులై యున్నారు.

సాయంకాలం కాబోతుంది. మహారాజు ఒకగుర్రాన్ని తెప్పించి కోటవిడిచి తూరుపుదిక్కుగా పయనమై పోయాడు. అప్పటికే రాత్రైంది. వెన్నెల కారణంగా అంతా విశదంగా కన్పిస్తోంది. కోటగుమ్మంవద్ద దాగుకొనివున్న తేజసింహుడు మహారాజు ఒంటరిగా వెళ్ళటం గమనించి వెంటాడాడు. మూడు కోసులదూరంవరకూ అతని వెంటే వడివడిగా నడుస్తున్నాడు. మహారాజుకు తనను తేజసింహుడు వెంబడిస్తున్న సంగతి తెలియదు. అప్పుడు మహారాజు గుఱ్ఱాన్ని ఒక ఎండిపోయిన కాలువగుండా పోనివ్వసాగాడు. ముందుకు సాగినకొద్దీ ఆ కాలువ లోతు మరింత హెచ్చసాగింది. రెండువైపులా గట్లు అత్యున్నంతంగా వున్నాయి. గట్ల అవతల కీకారణ్యం. క్రూర మృగాల గర్జనలు విన్పిస్తున్నాయి. ముందుకు సాగినకొద్దీ గట్టున గల చెట్లు ఒకదాని తలలు మరొకటి కలుసుకొనిపోయి కాలువను కన్పించకుండా చేస్తున్నాయి.

ఆ విధంగా ఒక కోసెడుదూరం నడిచాడు. ఇప్పుడు కాలువలో వెన్నెల వెలుగు కిరణాలు సయితం ప్రసరించటం లేదు. ఆ కాలువ యిప్పుడూ పెద్ద సొరంగంగా కన్పిస్తోంది. చీకటి కారణంగా గుఱ్ఱం నెమ్మదిగా నడుస్తోంది. తేజసింహుడు మహారాజును దాదాపు సమీపించాడు. అంతలో కొద్దిగా వెలుగు కన్పించింది. ఆ వెలుగు సమీపాన ఒక చిన్న గుహ కన్పించింది. ఆ గుహ కిరువైపులా నూర కత్తులతో సిపాయిలు కాపలాకాస్తున్నారు. దాదాపు యిరవై మంది

వుంటారు. లోపల ఇద్దరు స్త్రీలు రాతిమీద కూ[illegible] తేజసింహునికి కన్పించింది. వాళ్ళు చపల, చంద్రకాం[illegible] అతడు గుర్తించాడు.

శివదత్త మహారాజును చూచి సిపాయిలు [illegible]రాన్ని అందిపుచ్చుకున్నారు. అతడు దిగాడు. సిపాయిలు రెండు దివిటీలు వెలిగించారు. ఆ వెలుగులో చపల చంద్రకాంతలు మరింతస్పష్టంగా కన్పిస్తున్నారు. చంద్రకాంత ముఖం తేజో విహీనమై యున్నది. ఆమె తల వెంట్రుకలు విరబోసుకొని వున్నాయి. ఎదురుగా ఆహారం పెట్టబడివుంది. దాని నెవరూ ముట్టుకోన లేదు. వాళ్ళ పరిస్థితి కఠినాత్మునికి సహితం హృదయం కరిగించేదిలా వుంది.

మహారాజు రావటంతోటే అటూయిటూ చూచాడు. మహారాణిని వెదకటానికి వచ్చిన అతనికి అంతా అగమ్యగోచరంగా వుంది. ఎవరినీ పల్లెత్తిమాటైనా అడగలేదు. చంద్రకాంతను సయితం తేరిపారచూడకుండానే అతడు గుర్రంపై వెనక్కితిరిగాడు. సిపాయిలకు మహారాజు ఆ విధంగా వచ్చిపోవటం ఆశ్చర్యాన్ని కలిగించింది. కాని ఒక్కడూ అడగలేదు. తేజసింహుడు మహారాజు వెనుదిరిగి పోవటంచూచి అక్కడే ప్రక్కగా దాక్కోవాలని అనుకున్నాడు. యిరుకైన ఆ కాలువలో అతనికి అటువంటి సదుపాయం చిక్కలేదు. పోనీ చెట్ల మీదనుంచి పైకెక్కి పోదామన్నా వీలులేక పోయింది. అందుచేత అతడు రాజుకంటే ముందుగానే కాలువగుండా బైటికి చేరిపోయాడు. రాజు అతివేగంగా పట్టణానికి వెళ్ళిపోయాడు.

తేజసింహునికి వంటరిగా చంద్రకాంతను విడుపించుకొని పోవటానికి మార్గోపాయాలు ఆలోచించసాగాడు. మహారాజు వేషంతో వెళదామనుకున్నా యిప్పుడే రాజు వెళ్ళివచ్చాడయ్యె! ఏదైనా ఉపాయం చేసినా సఫలీకృతుడు కాకపోతే చంద్రకాంత మరొక చోటికి మార్చబడుతుంది. అప్పుడు మరీ కష్టం. అందుచేత అతడు తిరిగి వీరేంద్రుని వద్దకు వెళ్ళాలని నిశ్చయించుకున్నాడు. సైన్య సహాయంతో తప్ప యిరవై మంది సిపాయీలను ఎదుర్కోవటం మామూలు విషయం గాదు.

అదేవిధంగా తేజసింహుడు విజయగడ్ ప్రవేశించాడు. వీరేంద్రునికి చంద్రకాంత వృత్తాంతాన్ని తెలియజేశాడు. "నేను ఇంకెవరినైనా విడిపించవలసి వస్తే ఇంతగా ఆలోచించేవాడినే కాదు. ఏదో ఒక ప్రయత్నం చేసి విఫలుణ్ణయితే పారిపోయి వచ్చేవాడిని. కాని ఇది చంద్రకాంతతో కూడుకున్న విషయం అతి సున్నితంగా ఆలోచించాలి" అన్నాడు తేజసింహుడు. దేవీసింహుడు తేజసింహుని ఆలోచనా క్రమానికి చాల సంతసించాడు. అతనికి చంద్రకాంత వంటి రాకుమారిని స్పృహ తప్పి పోయేలా చేసి మూటగట్టుకొని తీసుకొని రావటం చేయదగని పని అని తెలుసు. తర్వాత తేజసింహుడు శివదత్తునిపై విజయాన్ని సాధించిన వీరేంద్రుని అభినందించి తన వెంట దేవీసింహుని తీసుకొని వెళతానని" చెప్పాడు.

యువరాజు "యిక్కడ యుద్ధం జరిగే అవకాశం కన్పించటం లేదు గనుక నేనుకూడా మీ వెంట వస్తాను. అంతగా అవసరమైతే సేనాపతి ఇక్కడ వుండనేవున్నాడు" అన్నాడు.

అందుకు తేజసింహుడు తన సమ్మతిని తెలియజేశాడు. వీరేం ద్రుడు సంతోషంతో అప్పటికప్పుడే ప్రయాణమై సేనాపతికి తీసుకోవలసిన జాగ్రత్తలను గూర్చి చెప్పి సాయంకాలానికి ప్రయాణమయ్యాడు. రాకుమార్డు గుఱ్ఱంమీద, మారువేషధారు లైన తేజసింహుడూ దేవీసింహులు కాలినడకన ముందు నడుస్తున్నారు. దోవలో వీరేంద్రుడు శివదత్తునిపై యుద్ధం సాగిం చిన విశేషాన్ని తెలియచెబుతూ తనకు సహాయంగా వచ్చిన ముసుగు సైన్యాన్ని గూర్చి కూడా చెప్పాడు. ఆ ముసుగులు వేసుకొని వచ్చిన వారెవరో తేజసింహునికికూడా తెలియక తికమక పడ్డాడు.

వెన్నెలరాత్రి దోవ చక్కగా కన్పిస్తోంది. నాల్గుకోసులు వెళ్ళేసరికి వాళ్ళకు బదరీనాథపండితుడు వంటరిగా కన్పించాడు. అతడు రాకుమారుని దగ్గరకు వచ్చి నమస్కరించాడు. దేవీ సింహుడు "ఏమయ్యా పండితుడా నీవంటివాడు కూడా ఆ దగు ల్బాజీ పంచ జేరటమేమిటి! మా ఆస్థానానికిరా. చూచావా మా యువరాజుని. పులిలాంటివాడు. న్యాయవాది" అన్నాడు.

బదరీనాథుడు "ఇవాళ కాకపోతే రేపైనా అదే జరుగు తుందిలే. నేనుకూడా జిత్తులమారిని గనుక అంత తొందరగా వారు మాత్రం ఏం విశ్వసిస్తారు" అన్నాడు. మరొకసారి రాకుమారునికి నమస్కరించి మరొకదారిని ఘోరారణ్యానపడి కన్పించకుండా పోయాడు. తేజసింహుడు "మనకు తోవలో బదరీనాథుడు కన్పించటం అంత మంచిదికాదు. అతడు తప్ప కుండా మనమెక్కడికి వెళ్ళుతున్నామో ఆరాతీస్తాడు"అన్నాడు.

అందు దేవీసింహుడు "అవును నిజమే. శకునం అంత మంచిగా కన్పించటంలా" అన్నాడు.

"అయితే వంచేద్దాం" అన్నాడు యువరాజు.

"నాకొక ఉపాయం తట్టుతోంది" మనం అరణ్యం మార్గం విడిచి విశాల మైదానమార్గానపోతే వెనుకనుంచివచ్చే వాళ్ళు కన్పించే అవకాశముంటుంది" అన్నాడు తేజసింహుడు.

"అయితే నీవు ముందు నడువు" అన్నాడు రాకుమారుడు.

ఇప్పుడు ముగ్గురు మంత్రులూ అరణ్యమార్గం విడిచి . మైదానానికి చేరుకున్నారు. వెనుకనుండి ఒకడు చూస్తూనే వున్నాడు. ఎవరూ వచ్చేజాడలులేవు. రాత్రంతా ప్రయాణం చేశారు. ఉదయాన్నుండీ ముగ్గురూ ఒక కాలువ మార్గంపట్టారు. కొంతదూరంపోయి పోయి ఆ కాలువలో స్నానసంధ్యాదులు ముగించి మధ్యాహ్నానికి అడవిమార్గం చేరారు. కొంతదూరం గడచినమీదట చంద్రకాంతను దాచివుంచిన గుహామార్గానికి చేరుకున్నారు. తేజసింహుడు సాయంకాలమయ్యేవరకు ఇక్కడే వుండి రాత్రికి ఇక్కడనుండి బయలుదేరుదాం" అన్నాడు.

దానిమీదట ముగ్గురూ అక్కడికి ప్రయాణం చాలించి ఒక డేరా నిర్మించి విశ్రాంతి తీసుకున్నారు. సూర్యుడస్తమించబోయేసరికి తిరిగి ప్రయాణమయ్యారు. ఆ ఎండిపోయిన కాలువమార్గాన ప్రవేశించారు.

ఆ కాలువ మార్గం రాకుమారుని భయోత్పాదం కలిగించింది. లోగడ తేజసింహునికి కొద్దిగా వెలుగు కన్పించిన [illegible] ఇప్పుడు చీకటి వ్యాపించి వుంది. తేజ సింహునికి అను

మానం కలిగి గృహద్వారం సమీపించాడు. అక్కడ అనేక మంది పడివున్నారు. తేజసింహుడు సంచిలోనుండి కాగడా తీసి వెలిగించి చూచాడు. కావలావాళ్ళందరూ గాయాలతో చచ్చిపడివున్నారు. లోపలికి ప్రవేశించి చూస్తే అక్కడ చపల చంద్రకాంత లేదు. వారిసువురి దుస్తులూ చిరిగి దూరంగా పడివున్నాయి. అంతా రక్తం. రాకుమారుడు 'అయ్యో!' అని పడిపోయాడు. తేజసింహుడు "భయపడకండి ఈశ్వరుడు ఇక్కడివరకూ దారిచూపించి రాకుమారి వున్న చోటు చూపించకపోతాడా?" అన్నాడు. రాకుమారుడు "తమ్ముడా చంద్రకాంత జీవించి వున్నదనే నమ్మకం నాకు కల్గటంలేదు." అన్నాడు. "ఆ విధంగా జరగటానికి వీల్లేదు. ఒకవేళ మరణించి వుంటే ఈశవాలలోవాళ్ళశవాకూడా వుండి వుండాలి" అన్నాడు తేజసింహుడు. దేవీసింహుడు "ఇది బకరీవాధుని ఎత్తుగడ కాదుగదా అని సంశయాన్ని వెలిబుచ్చాడు! "ఆవిధంగా అనుకోవటానికి వీలులేకుండా వుంది. అతని ఎత్తుగడే అయితే సిపాయీలను హత్యచేయవలసిన అవసరమేముంది. అయినా చెప్పటానికి వీలులేదు, మన మిక్కడనుండి వెళ్ళటం మంచిది" అన్నాడు తేజసింహుడు.

"పోనీ మహారాణిని దాచివుంచిన చోటుకైనా వెళదాంపద" అన్నాడు దేవీసింహుడు.

అందుమీదట ముగ్గురూ అటువైపు పయనం సాగించారు. అక్కడకూడా మహారాణి లేదు. అందరికీ ఆశ్చర్యం కలిగింది. అప్పటికే అర్ధరాత్రి అయింది. ఏమి చేయటానికి తోచక ముగ్గురూ కూర్చుండిపోయారు. దేవీసింహుడు

"గురువుగారూ నాకొకఉపాయం తడుతోంది. మీరిక్కడే వుండండి. నేనువెళ్ళి జాడ తీస్తాను" అని అన్నాడు

"సరే మే మిచ్చటే ఉంటాం. నీవు వెళ్ళు" అన్నాడు తేజసింహుడు.

దేవీసింహుడు పల్లెటూరు పండితుని వేషంతో పోసాగాడు. చునారగఢ ప్రవేశించాడు. అక్కడ భటుడు కావలా కాస్తున్నాడు. ఒకసీసా చేతిలో పుచ్చుకొని భటుని చెంతజేరి ఒక బంగారునాణాన్ని చూపి "దీనిని మీరు తీసుకొని ఈ సీసాలో ఏమి అత్తరున్నదో చెప్పండి; మేము పల్లెటూరి వాళ్ళం. అక్కడొక అత్తరుసాయిబు వచ్చి యీ అత్తరు చూపించి దీనిని దేనితో తయారుచేశిందో చెపితే ఏడు బంగారు నాణాలు ఇస్తానన్నాడు. మోటువాళ్ళ కేమి తెలుస్తుంది చెప్పండి. అందుకని బయలుదేరి వచ్చాం. మీరు రాజదర్బారుల్లో వుండేవారు. అనేకరకాల అత్తరులు చూచివుంటారు. దయచేసి చెపితే నేను తెల్లవారేసరికి తిరిగి వెళతాను. అప్పటికి గడువు పూర్తవుతుంది" అన్నాడు.

దేవీసింహుని మాటలువిని ఆ భటుడు సమీపంలో వెలుగుతున్న దీపంవద్దకువెళ్ళి అదిబంగారునాణమేనని తెలుసుకొని సంతోష పడ్డాడు. సీసా మూతతీసి గట్టిగా వాసన చూచాడు. ఆ వెంటనే అతని తల తిరిగి స్పృహతప్పి పడిపోయాడు. అతనిని మూటగట్టుకొని దేవీసింహుడు తేజసింహుని వద్దకు వచ్చాడు. అక్కడ అతనికి స్పృహ తెప్పించారు. ఆ భటుడు ఎదురుగా పల్లెటూరి పండితుని చూచి

ఆశ్చర్యపడ్డాడు. దేవీసింహుడు "మీ మహారాణి ఎక్కడ వున్నదో త్వరగా చెప్పు?" అని అడిగాడు.

భటుడు "మా మహారాణి సంగతి అడగటానికి నీ వెవరో చెప్పు" అన్నాడు.

తేజసింహుడు గభాలున లేచి బలంగా ఒక తన్ను తన్ని "అదంతా నీ కెందుకు? చెపుతావా. లేదా?" అన్నాడు.

భటుడు వణుకుతూ "చాలా కాలంనుండి కన్పడటంలేదు. ఎక్కడకు వెళ్ళిందో చెప్పలేం" అన్నాడు.

తేజసింహుడు లాభంలేదను కొని "రాకుమారుని తిరిగి సైన్యంలోనికి వెళ్ళమని చెప్పాడు. అందుకతడు అంగీకరించ లేదు. తేజసింహుడు "అట్లా అనకండి. మీరు లేరని తెలిస్తే శివదత్తుడు మన సైన్యాలమీదపడతాడు" అని చెప్పాడు.

"ఏది ఏమైనా నేను వెళ్ళను. చంద్రకాంత లేని యీ ప్రపంచంలో నా కేంపని" అని రాకుమార్డు మొండిపట్టుపట్టాడు. దానిమీదట తేజసింహుడు రాకుమారునకు ఎంతగానో నచ్చ జెప్పి ఎల్లుండి సైన్యంలోనికి వెళ్ళటానికి అంగీకరించేలా చేశాడు.

తేజసింహుడు ఆ రక్షకభటుని ఒక చెట్టుకుకట్టి దేవీ సింహునితో "నీవు యువరాజును చూస్తూ వుండమని" చెప్పి తాను భటుని వేషంవేసుకొని కోటదగ్గరకు వెళ్ళాడు.

# 8

దేవీసింహుడు రాకుమారుడు వున్న అడివి చాలా భయంకరమైంది. ఎవరూ అక్కడికి ప్రవేశించలేరు. తేజసింహుడు వెళ్ళిన తర్వాత ఇద్దరూ ఒకరాతిమీద కూర్చొని వున్నారు. ఇంకా తెల్లవారలేదు. తూర్పుదిక్కునుండి ఒక రాయివచ్చి వాళ్ళిద్దరి ముందు పడింది. కాని ఎవరికీ తగలలా. దేవీసింహుడు "ఎదురుగా రాక ఎవడా చాటునుండి రాళ్ళు వేసేది"అన్నాడు.

"పెద్దపెద్ద మాటలు చెప్పే కుట్రకుంకలను చాటుగానే చంపాలి." అని సమాధానం వచ్చింది.

ఆమాట రాకుమారునికి కోపకారణమై కత్తిదూశాడు. తేవీసింహుడు అతనిని నివారించి "వాడెవడో నేను పట్టుకుంటాను." అని ఆ దిక్కుగా వెళ్ళాడు.

అతడు ముందుకు వెళ్ళినకొద్దీ ఎక్కడనుంచో రాయి మాత్రం వచ్చిపడేది. మనిషిమాత్రం కనిపించదు. మరొక రాయి వచ్చిపడింది. దేవీసింహుడు ఇంకా ముందుకు వెళ్ళాడు. అతడెవరో తోడేలులా తప్పించుకుంటున్నాడేగాని దేవీసింహుని కంటబడటంలేదు. దేవీసింహుడు అటూ యిటూ వెదికి తెల్లవారిన తర్వాత తిరిగి రాకుమారుడున్న చోటుకు వచ్చాడు. అక్కడ రాకుమారుడు లేడు. చెట్టుకుకట్టిన భటుడు లేడు. ఎంత వెదికినా లాభంలేకుండా పోయింది. అక్కడనుంచి కదులుదామంటే తేజసింహుడు వస్తాడేమోననేబాధ ఒకటుంది. అతడు తిరిగి వచ్చేసరికి ఇక్కడ ఎవరూ లేకుండాపోతే ఎట్లాగని అక్కడే కూర్చుండిపోయాడు.

# 9

త్రేజసింహుడు కాపలావాని వేషంతో కోట గుమ్మం దగ్గరకు చేరాడు. తెల్లవారేసరికి సిపాయిలంతా మేలుకొని తేజసింహుని చూచి "ఏరా జయరాంసింగ్ నీవెక్కడికివెళ్లావు. బదరీనాధుడు తనిఖీచేయటానికి వచ్చినప్పుడు నీవు లేకపోవటం చూచి నిన్ను వెదకటానికి ఎక్కడెక్కడికో వెళ్ళాడు. ఇంకా రాలా. నీమూలాన మాకుకూడా మాటొచ్చింది." అన్నారు. తేజసింహుడు "నా ఆరోగ్యం బాగాలేకపోతే బయటకు వెళ్ళా. అక్కడ వాకటే వాంతులు. ఇప్పటి కడుపు అట్లానే వుంది. బ్రతికుంటే బలుసాకైనా ఏ కొని తినొచ్చు. ఎట్లా ఆపుకోమంటావు చెప్పు. మళ్ళా వెళ్ళవలసి వచ్చింది." అని కడుపు చేతబట్టుకొని వరుగెత్తాడు.

తేజసింహునికి బదరీనాధుడు కాపలావానిని వెదుకు తున్నాడని తెలిసి అక్కడవుండటం మంచిది కాదనుకున్నాడు. కొంతదూరం వెళ్ళి భిక్షుకుని వేషంలో రోడ్డుప్రక్కన కూర్చున్నాడు. ఆతడు బదరీనాధుని కొరకు ఎదురుచూస్తు న్నాడు. కొద్ది సేపట్లోనే బదరీనాధుడు రావటం కన్పించింది. అతనివెనుక నాజిం ఒకమూట ఎత్తుకొని నడుస్తున్నాడు. వాళ్ళతోబాటు తాను చెట్టుకు కట్టిన భటుడుకూడా వున్నాడు.

తేజసింహుడు వాళ్ళనుచూచి ఏదో ఉపద్రవం ముంచు కొచ్చిందనుకున్నాడు. ఆ మూటలో రాకుమారుడో లేక దేవీసింహుడో వుండి వుండాలనుకున్నాడు. అతనికి అక్కడ సహాకరించేవారే లేకపోయారు. వాళ్ళు మూటతో కోటలో ప్రవేశించి తర్వాత తేజసింహుడూ, రాకుమారుడూ, దేవీసిం

హుడు వున్న చోటికి వెళ్ళాడు. అక్కడ దేవీసింహుడు తేజసిం హుని కాళ్ళపైబడి రాకుమారుని ఎత్తుకొని పోయాడని విన్న వించాడు.

తేజసింహునికి పరిస్థితుల విచిత్రప్రభావం తలతిరిగిపోయేట్లు చేసింది. రాజకుమారినీ, చపలనూ విడిపించలేకపోయాడు సరి గదా వున్న రాకుమారునికూడా పోగొట్టుకున్నాడు. ఒకవైపు యుద్ధం, మరొకవైపున ఈ సమస్యలు ఏది ఎట్లా జరుగుతుందో!

# 10

చునార్‌గఢ కోటలో శివదత్తుని నివాస గృహాలలో వీరేంద్రసింహుడు చేతులకూ కాళ్ళకూ బేడీలు వేయబడి విచారసాగరంలో మునిగి కూర్చున్నాడు. చాలమంది స్త్రీలు ఖడ్గధారులై పహారాయిస్తున్నారు. అతడు "అయ్యో చంద్ర కాంతా నీ జాడ తెలియరాలేదుకదా. నీ వెక్కడ వున్నావో ఎటువంటి పరిస్థితులలో నున్నావో ఊహించుకుంటే నా హృదయం బ్రద్దలైపోతోంది. నాకు ఈ బంధిఖానాకంటే నిన్ను గూర్చిన బాధే ఎక్కువగా వుంది. నీవు నీ తల్లిదండ్రులను సుఖంగా చేరుకోగలిగితే నాకీ జైలుజీవితంలో నిద్రాహారాలు లేక మరణించినా సంతోషమే. ఓ భగవంతుడా నాకు నీవు అమితమైన ధైర్యసాహసాలిచ్చావు. రణరంగంలో జంఝా మారుతంలా వీరవిహారం చేయగలిగే నన్ను సంకెళ్ళతో బంధించటం న్యాయమా. సకలైశ్వర్యాలూ సంప్రాప్తింపజేసి చివరికి హృదయాన్ని బాధాపరితప్త మొనరించటంలో నీకు ఆనందం కలిగిస్తోంది" అని విలపించసాగాడు.

అర్ధరాత్రి గడిచింది. దాసీజనం దివిటీలు పుచ్చుకొని వీరేంద్రుడున్న గది ముందుకు వచ్చారు. అతని వెనుక ఎవరో వస్తున్న అలికిడైంది. వీరేంద్రునికి పురుషుడొక్కడూ కన్పించని ఈ మహాలులో తనను వొంటరిగా బంధించిన కారణమేమిటో అర్థంకాలేదు. అందులో శివదత్త సింహుడు గదికి ఎదురుగా వచ్చాడు. వీరేంద్రుడు వులిక్కిపడ్డాడు. కను రెప్పవేయకుండా మహారాజుని చూడసాగాడు. మహారాజున కిరువైపులా చపలా చంద్రకాంతలు వున్నారు. మహారాజు తనకోసం సిద్ధంచేసిన సింహాసనానికి కుడివైపున చంద్రకాంత ఎడమవైపున చపలనూ కూర్చుండబెట్టుకున్నారు. వాళ్ళిద్దరూ మహారాజును ఆనుకొని కూర్చున్నారు.

బాల్యంనుంచీ వీరేంద్రుడు చంద్రకాంతనుఎరుగున్నప్పటికీ ప్రస్తుతం ఆమెవున్న పటాటోపం అతనిని ఆశ్చర్యపరచింది. ఎదురుగా తాంబూలమూ ఆదిగాగల సుగంధద్రవ్యాలూ అమర్చబడి వున్నవి.

ఆ దృశ్యం వీరేంద్రుని దిగ్భ్రాంతుని చేసింది. అతడు "చంద్రకాంత ఆనందంగా శివదత్తసింహునితో కాలం కడపట మేమిటి? ఆమెకు నాపై ప్రేమ తొలగిపోయిందా ఏం. ఆమెకు నేను బంధీకృతుడనై యున్న సంగతి తెలియదా? తెలిసే వుంటుంది. అదుగో! ఆమె నాదిక్కుగానే చూస్తోంది. చపలకేమొచ్చింది! తేజసింహుని ప్రేమించానని మహారాజుతో కులుకుతోందే! పైగా రాజకుమారితో సరిసమానంగా సింహాసనమధిష్టించింది. అందుకే పెద్దలు స్త్రీలు చంచల స్వభావులని పిలిచారు. వీళ్ళని నమ్ముకొనటం పురుషులదే తెలివి

తక్కువ. అయ్యో! నా నొసట యిటువంటి స్త్రీ ప్రేమించే దురదృష్టం వ్రాసిపెట్టవలసి వుందా! రాజవంశంలో పుట్టిన దానికి యీ చెడుబుద్ధి కేల పుట్టవలసివచ్చింది. నా బ్రతుకు నిరర్థకమై పోయింది. నాకిక ఆత్మహత్యే దిక్కు. కాని చంద్రకాంతను చపలను శివదత్తుడు అనుభవించటానికి మాత్రం విడిచిపెట్టి పోరాదు. వీరపురుషుడు స్త్రీ హత్యకు పాల్పడవలసిరావటం కూడా నేనిక్కడ లెక్క చెయ్యను. నాకు యీ లోకానికి ముఖం చూపించవలసిన అవసరంకూడా లేదు. నీచులైన ఈ స్త్రీల నిద్దరిని హతమార్చి నేనుకూడా ప్రాణాలను తీసుకుంటాను. తేజసింహుడుకూడా నా అభిప్రాయాన్నే మన్నిస్తాడు" అని ఒక నిశ్చయానికి వచ్చాడు.

ఇంతలో చంద్రకాంత శివదత్తుని తన బాహువులలో బంధించింది. ఇక వీరేంద్రుడు సహించలేకపోయాడు. బలాన్ని కేంద్రీకరించి సంకెళ్ళను తెంచివేసుకున్నాడు. ద్వారబంధాలను తుత్తునియలు చేసి ఒక్క వూపులో శివదత్తుని కట్టెదుటకు వచ్చి చేరుకున్నాడు. ఎదురుగా వున్న కరవాలాన్ని యెత్తి చంద్రకాంత శిరస్సును ఒక్క దెబ్బతో నరికి పారేశాడు. ఆమె శిరస్సు దూరాన పడిపోయింది. మొండెం అక్కడే క్తరంలోపడి తన్నుకోసాగింది. శివదత్తుడు సిద్ధమయ్యేలోపుగానే చపలనుకూడా ముక్కలుచేసేశాడు. కాని శివదత్తుని మాత్రం ముట్టుకోలేదు.

రాజకుమారుని శక్తిసామర్థ్యాలు చూచిన శివదత్తుడు స్తబ్ధుడైపోయాడు. రక్తసిక్తమైన కరవాలాన్ని చేతిలో పట్టుకొని నిలబడివున్న వీరేంద్రసింహుని యెదుట దేవసింహుడు

తేజసింహుడు హఠాత్తుగావచ్చి నిలబడ్డాడు, తేజసింహుడు "వారెవా! భలేపనిచేశావ్!" అని శివదత్తుని మెళ్ళోకి తాడు విసిరి గట్టిగా లాగాడు. అతడు కూలిపోయాడు. ఆ వెంటనే దేవీసింహుడు శివదత్తుని మూటగట్టుకొని భుజాన వేసుకున్నాడు తేజసింహుడు వీరేంద్రునితో "మీ పరిస్థితి యేమిటో నాకు తెలుసు; ముందు నా వెంట బయటికి నడవండి" అని అంతా కలిసి నిష్క్రమించారు.

# 11

వీరేంద్రసింహునికి చపల, చంద్రకాంతలు మరణించిన మరుక్షణంలోనే యీ ప్రపంచంమీద రోతపుట్టింది. అతనికి తల్లి తండ్రులమీదగానీ, విజయగఢమీదగానీ, యుద్ధంమీద కానీ, తేజసింహుని స్నేహంమీదకానీ, మనసు పోలేదు. ముగ్గురూ కోట విడిచి బైటికివచ్చారు. శివదత్తుని మూట భుజానపెట్టుకొని దేవీసింహుడు ముందు నడుస్తున్నాడు. వెనుకన తేజసింహుడు మధ్యగా వీరేంద్రుడు నడుస్తున్నాడు. రాజకుమారునికి తానెక్కడికి వెళ్ళుతున్నాడో ఆలోచనలేదు. ప్రొద్దెక్కినకొలది వాళ్ళు ఒక పెద్ద అడవిలోనికి ప్రవేశించారు. అక్కడ దేవీసింహుడు మూటను క్రిందకు దించాడు. తేజసింహుడు ఒక రాతిమీద వీరేంద్రుని కూర్చోబెట్టాడు. కానీ అతడు కూర్చోక నిలబడ్డాడు.

వీరేంద్రుని పరిస్థితి ఆందోళనకరంగా పరిణమించింది. తేజసింహుడు అతనిని బ్రతికించలేననుకున్నాడు. రాకుమారుని ముఖము తేజోవిహీనమైంది. మిరిగుడ్లు వేసుకొని పిచ్చి

చూపులు చూడటం ప్రారంభించాడు. అతని దృష్టి ఎటూ మారటంలేదు. చూచినవారికి చంద్రకాంతతో పాటుగానే మరణించాడేమో ననిపిస్తుంది. తేజసింహుడు "నిలబడ్డా వెందుకు?" అని రాకుమారుని రాతిమీద కూర్చోబెట్ట బోయాడు. రాకుమారుడు మోకాళ్ళు వంచకుండానే క్రిందకు పడిపోయాడు. తల వగిలింది. నెత్తురు చెమర్చింది. అప్పటికి కనురెప్పలు మూయలేదు. శ్వాస ఆగి, ఆగి నడుస్తుంది.

రాకుమారుడు మరణించాడని తేజసింహుడు విల పించ సాగాడు. ఆ పరిస్థితి దేవీసింహునకు కూడా శోకం కలిగించింది. తేజసింహునితో కలిసి యేడ్వసాగాడు. తేజసిం హుడు "నిజంగా నేమరణించావా రాకుమారా! చంద్రకాంతపై ఏ క్షణాన నీకు ప్రేమ జనించిందో కానీ అంతా అశుభంగానే తయారై కూర్చుంది. నీవు చునారగఢ సింహాసనాన్ని అధి ష్ఠించగలవను కున్నాను. చంద్రకాంతతో దాంపత్యం నెరపి సుపుత్రులను కంటావనుకున్నాను. నా ఆశలన్నీ నిరాశలై పోయాయి" అని యేడ్వసాగాడు. యింతలో ఒకధ్వని వినిపిం చింది. "రాకుమారుడు చావలేదు. అతనినిచంపేవాడు ఇంకా పుట్టలేదు. రాజకుమారిపై ప్రేమ చెడకు దారితియ్యదు. ఆ ప్రేమ మంచి ఫలితాన్నే యిస్తుంది. వాళ్ళిద్దరికి వివాహం జరిగి తీరుతుంది. వీరేంద్రుడు చునారగఢకు రాజవుతాడు. ఇద్దరు తేజస్వులైన పుత్రులను చంద్రకాంత గర్భవాసాన జన్మి స్తారు. ఏమీ జరిగిందని మీరు ఏడుస్తున్నారు?" అని విని పించింది.

తేజసింహుడు, దేవీసింహుడు యేద్వాటంమాని ఆశ్చర్యంతో దిక్కులు వెతికారు. వాళ్ళకు ఏమీ కనుపించలేదు. ఇంతలో "ఇటు చూడు" అని వినిపించింది. తేజసింహుడు తలపైకెత్తి చూచేసరికి జగన్నాథ పండితుడు చెట్టుమీదనుండి క్రిందకు దిగటం కనుపించింది. అతడు చెట్టుదిగి తేజసింహుని సమీపించి "భయపడకండి. అంతా చక్కబడుతుంది. మీరు నన్ను శివదత్తుని పక్షంవాడని అనుమానించవద్దు. కొంత సేపాగితే నేను మీకు శత్రువునో, మిత్రుడనో తెలుస్తుంది. ముందు రాజకుమారుని సంగతి చూద్దాం" అన్నాడు.

తేజసింహుడు, దేవీసింహుడు చూస్తుండగానే జ్యోతిష పండితుడు ముక్కోణాకారం ఆకులు, నీలిరంగు పూలుగల తెల్లని మూలికను ఆ సమీపాన వెతికి తెచ్చి చేతితోనలిపి దాని పసరు రెండుబొట్లు రాకుమారుని కళ్ళల్లోను చెవుల్లోను వేశాడు. మిగతాపిప్పిని ఉత్తరీయం చించి రాజకుమారుని మాడున కట్టాడు.

అర్ధగంట గడవక మునుపే రాకుమారుని కళ్ళ తీరు మారజొచ్చింది. రెప్పలు ఆడటం మొదలుపెట్టాయి. నెమ్మది నెమ్మదిగా కాళ్ళు, చేతులు కదిల్చాడు, రెండుమూడు తుమ్ములు తుమ్మాడు. పూర్తి తెలివివచ్చిలేచి కూర్చున్నాడు. ప్రక్కనవున్న వాళ్ళనుచూచి "నాకేమైంది" అని అడిగాడు. జరిగిన సంగతంతా తేజసింహుడు చెప్పాడు. జగన్నాథపండితునికి రాకుమారుడు నమస్కరించి "మహానుభావా యీ దీనుడిపై మీకు ఎందుకు దయకలిగింది? నా అనుమానాన్ని తీర్చరా!" అని అడిగాడు.

జ్యోతిష్యుడు "రాకుమారా! యీశ్వరప్రేరితంవల్ల నాకు మీతో కలసివుండాలని బుద్ధి పుట్టింది. నేను శివదత్త మహారాజును సేవించటానికి సిద్ధంగా లేను. వాడికి గుణవంతులను ఆదరించే మానవత్వం లేదు. అటువంటివాడిని కొలవటం గుణవిహీనుడు చెయ్యవలసిన పని. ప్రతిభాశాలుర ప్రతిభను అతడెన్నడు ప్రశంసించడు. ఎన్నడైనా అతనిపని ఏ కారణం చేతనైనా చెడిపోతే ఇక అతనిముఖం చూడడు. అంతేకాక అతడెన్నడూ ధర్మమార్గాన నడవడు. అందుచే నాకు అతడంటే విరక్తిపుట్టింది. నేను మీతోనే వుంటాను. మీవంటి మహానుభావులు నాకెక్కడా కనుపించలేదు. మీతో కలిసి వుండటానికి ఎన్నాళ్ళనుంచో అవకాశంకొఱకు ఎదురు చూస్తున్నాను. నిజానికి నా వృత్తిని బట్టి నన్ను విశ్వసించటం కష్టం. నేడు నా నిజాయీతిని ప్రదర్శించే వీలుచిక్కింది." అన్నాడు.

తేజసింహుడు శివదత్తసింహుడు యేమి ఎత్తువేశాడో చెప్పండి?" అని అడిగాడు.

జ్యోతిష్యుడు "శివదత్తునికి యేదైనా పెద్దపని తలపెట్టే ముందు నన్ను సంప్రదించే అలవాటు వుంది. నా అభిప్రాయం ప్రకారం అతడు చెయ్యడు. మమల్ని అడిగి తాను చేసేది చేస్తాడు. గతరాత్రి అతడు పన్నిన పన్నుగడకు నేను వ్యతిరేకించాను. అతడు వినకపోయాడు. దాని కారణంగా ఘనసింహుని, భగవానదత్తుని ప్రాణాలు పోయాయి. యింకా దీని వివరాలు మీరు నన్ను స్నేహితునిగా చేసుకుంటే చెప్తాను" అన్నాడు. జ్యోతుష్యుని మాటలకు రాకుమారుడు తేజసింహుని ముఖం చూచాడు. తేజసింహుడు "నేను సంతోష

పూర్వకంగా మిమ్మల్ని నా స్నేహాబృందంలో చేర్చుకుంటాను మీరు మాత్రం నా హృదయం పరిశుద్ధమైందని వాగ్దానం చేయండి" అని అన్నాడు.

జ్యోతిష పండితుడు తేజసింహుని అనుమాన నివృత్తి కోసం గాయిత్రిని చేతబట్టి ప్రమాణం తీసుకున్నాడు. తేజ సింహుడు మైత్రీభావంతో అతనిని హృదయానికి హత్తుకొని తన మాయావుల బృందములో సభ్యునిగా చేర్చుకున్నాడు. రాకుమారుడు తన కంఠహారాన్ని జ్యోతిష పండితుని కంఠాన అలంకరించాడు. జ్యోతిష్యుడు "యిప్పుడు వినండి మీరు సైన్యం విడిచిపెట్టి రాకుమారుని వెతకటానికి బయలుదేరి నప్పుడు దోవలో బదరీనాధుడు మిమ్మల్ని చూచాడు. మీరు చంద్రకాంత వున్నచోటికి రావటానికి ముందే బదరీనాధుడు ఆమెను అక్కడనుంచి మార్చే ప్రయత్నంతో గుహాలోనికి వెళ్ళాడు. కానీ అంతకుముందే రాకుమారి అక్కడనుంచి తప్పించుకొని పోయింది. ఆ తర్వాత అతడు నాజింను తీసు కొని మీ వెంటబడ్డాడు. మీ పైన రాళ్ళు విసిరింది నాజిం. నాజింను పట్టుకోటానికి దేవీ సింహుడు కదలివెళ్ళిన తర్వాత బదరీనాధుడు మిమ్మల్ని ఎత్తుకొని వచ్చాడు. మీకు శివదత్తు నితో యుద్ధం చెయ్యకుండా వుండటానికి చంద్రకాంతపై మీకు గల ప్రేమను తొలగించాలనుకున్నారు. అందుకని మా అంద రిలో చిన్నవారైన భగవానదత్తుని ఘసీటసింహుని చపలగాను, చంద్రకాంతగాను వేషాలు వేయించి మీ ముందు నాటకం ఆడడం జరిగింది. ఆ తర్వాత కధ మీకు తెలిసిందే."

ఆ వృత్తాంతమువల్ల రాకుమారునికి చంద్రకాంత జీవించివున్న దని విశదమై ఆనందముతో తేలియాడాడు.

యికముందు చేయవలసిన కార్యక్రమానికి అందరూ కలసి ఒక ప్రణాళిక వేశారు. శివదత్తమహారాజుని తేజసింహుడు తన చీకటి గృహంలో బంధించి రెండవరకం తాళం వేస్తా నన్నాడు. రాకుమారుడు విజయగఢ వెళ్ళిపోవటానికి నిశ్చ యించాడు. అతనివెంట దేవీసింహుడు వుండటానికి నిశ్చయింప బడింది. తేజసింహుడు జ్యోతిష పండితునితో కలసి రాజకుమా రిని వెతకటానికి సిద్ధమైవెళ్ళాడు.

# 12

ఒకానొక కాలువవడ్డున బండరాతిపై ఇద్దరు స్త్రీలు కూర్చొనియున్నారు. మధ్యాహ్న సమయం, ఇద్దరి ముఖాలు మట్టికొట్టుకొని వున్నాయి. జుట్టు విరబోసుకునివుంది. కాళ్ళ నిండా దుమ్ము ముఖాన అలసిపోయిన చిహ్నాలు వున్నాయి. నలుదిక్కుల పెద్ద అడవి. ఆ అడవిలో క్రూరజంతువుల అరు పులు. గాలి తాకిడికి చెట్లు పెద్దగా రోధన ధ్వని చేస్తున్నాయి. స్త్రీలు కూర్చున్న వొడ్డుకి ఎదురుగా అవతలి ఒడ్డున ఒక చిఱుతపులి నీళ్ళు తాగటానికి వచ్చింది. స్త్రీలు దానిని చూచారుకానీ, అది చెట్టుచాటునవున్న స్త్రీలను చూడలేదు.

ఆ యిద్దరి స్త్రీలలో మరీ సుకుమారంగా వున్న ఆమె చిఱుతపులిని చూచి భయపడుతూ" "ఇటువైపుకి వస్తుం దేమో"అన్నది. రెండవ ఆమె"ఇటువైపుకు రాదులే. ఒకవేళ అదిరాదలచినా నేను ముందుగానే యీ బాణాన్ని వేసి చంప

గలను. ఆ సిపాయిలను చంపి తెచ్చిన బాణాలు నా దగ్గర వున్నాయిగా! నీవు కూడా ఒకటి తీసుకొని ఎక్కుపెట్టు." అన్నది. చిరుతపులి వీళ్ళ చోలికి రాకుండానే తన దారిన తాను పోయింది.

"చపలా! మన మెక్కడున్నామో విజయగఢ ఏ దిక్కుగా వున్నదో నీకేమైన తెలుస్తున్నదా?"

"రాజకుమారీ? నాకేమీ తెలియటంలేదు. పారిపోవాలన్న ఆతురతలో యెటువైపుకి వచ్చిందీ అర్ధంకావటంలేదు. ఇక్కడ నిలబడి చూస్తే విజయగఢ ఎక్కడో, చునారగఢ ఎక్కడో, నాగఢ ఎక్కడో దారి తెలియటం లేదు. నాకింత వరకు రాజమహలులో వుండటం, ఏదైనా పనిబడితే విజయగఢ సరిహద్దులవరకే తిరగటం తప్ప యీ అవాసం చేసి ఎఱుగను. చునారగఢనుండి విజయగఢకు దారి తెలుసు కాని ఇప్పుడు దారిలో శత్రు సైన్యాలున్నాయి. మనం అటు దిక్కుగా వెళ్ళితే పట్టుబడిపోగలం కనుక ఇక్కడనే మనకు శరణ్యం. నా సంచిలో పళ్ళువున్నాయి. తిని నీళ్ళు తాగు" అన్నది చపల.

"ఇప్పుడొద్దులే దాచి వుంచు. ఇంకా యెన్నాళ్ళు మనకీ దుఃఖభాజనమైన జీవితాన్ని గడపవలసివుందో! దగ్గరిలో వున్న చెట్లను యేమైనా కోసుకొని తిందాం. బాగా లేకపోయినా యేదోఒకటి తిని కాలం గడపాలిగా" అన్నది రాకుమారి.

"సరే నీ యిష్టం" అన్నది చపల. ఇద్దరూ అక్కడ నుండి లేచి అటూ యిటూ తిరగసాగారు. కొంతదూరంలో

అక్కడివాళ్ళిద్దరూ ఒక పాడుపడిన యిల్లును చూచారు. వాళ్ళిద్దరూ విజయగఢకు దారిదొరికేవరకూ ఆ శిథిల గృహం లోనే కాపురం చెయ్యదలచుకున్నారు.

# 13

ఒకనాడు చపల చంద్రకాంతను ఆ శిథిలగృహం గుమ్మంలో కూర్చుండబెట్టి అడవిలో ఫలాలు కోసుకొని రావటానికి వెళ్ళింది. చంద్రకాంత ఒంటరిగా భయపడుతూ కూర్చున్నది. ఆమెకు చపల రావడం ఆలస్యమైన కారణంగా విసుగుపుట్టి కాలక్షేపంకోసం ఆ శిథిలగృహాన్ని పరిశీలించే ఉద్దేశంతో లోన ప్రవేశించింది. ఆ గృహం ప్రస్తుతానికి శిథిలావస్థలోవున్నా ఒకనాడు దేదీప్యమానంగా వెలిగిపోయిన చిహ్నాలు అక్కడక్కడా కనిపిస్తున్నాయి. దాని ద్వారాలు ఇంకా చాలా గట్టిగా వున్నాయి. బహుశా ఆ ద్వారాలకు ఆరోజులలో లోహపుతలుపులు అమర్చివుండవచ్చు.

రాజకుమారి యింకా లోనికి ప్రవేశించి చూస్తే ఆయిల్లు చాలా విశాలంగా కనిపించింది. ఆమె యింకా లోనికి ప్రవేశించింది. అది ఒక పెద్దహాలు. కప్పుమాత్రం విరిగిపడినా యింకా స్తంభాలుమాత్రం అట్లాగే నిలబడి వున్నాయి. అటూ యిటూ రాళ్ళు రప్పలూ గుట్టలుగా పడి వున్నాయి. వాటిమీద రాకుమారి జాగ్రత్తగా అడుగులు వేసుకుంటూ యింకా ముందుకు వెళ్ళింది. మధ్యగా ఒక పెద్దమైదానం కన్పించింది. దానిని రాకుమారి అతి శ్రద్ధగా చూడ నారంభించింది. అది ఒక ఉద్యానవనం కావచ్చు.

అక్కడక్కడా చలువరాతి వేదికలు వున్నాయి. జలయంత్రాలు నిర్మించిన గొట్టాలు యింకా ఆ విధంగానే నిలిచి వున్నాయి. ఆ శిథిలాలకు మధ్యగా ఒక పెద్ద రాతితో తయారుచేయబడిన పక్షి కన్పించింది. దానిని చూడటానికి రాకుమారికి దగ్గరకు వెళ్ళింది. ఆ పక్షిని అంత మృదువుగా తయారుచేయగలిగిన శిల్పాచాతుర్యానికి రాకుమారి అచ్చెరువొందింది.

ఆ పక్షి తెల్లని చలువరాతితో చెక్కబడివుంది. నడుము భాగం మాత్రం నల్లరాతితో చెయ్యబడి ఎత్తయిన రాతి స్తంభాలమీద అమర్చబడివుంది. కాళ్ళుమాత్రం కనిపించటంలేదు. బహుశా పొట్టవరకే చెక్కి ఆరాతిలో అమర్చి వుంటారు. దాని పొట్ట చుట్టుకొలత రమారమి ఎనిమిది బారలకు తక్కువేమీ వుండదు. పొడవైన ముక్కు రెక్కలు అతి నైపుణ్యంగా శిల్ప కళాకారుడు సిద్ధంచేసిపెట్టాడు. దానిని మరింత దగ్గరగా చూడాలనే కుతూహలంతో రాకుమారి యింకా కొంచెం దగ్గిరిగా వెళ్ళింది. కాని దగ్గరికి వెళ్ళటంతోటే అది నోరు తెరచింది. ఆ దృశ్యం చూచి రాకుమారి భయపడింది. ఎదురుగా వెళ్ళటం మాని ప్రక్కకు వెళ్ళింది. ప్రక్కకు వెళ్ళేసరికి అది రెక్కలు విప్పుకొంది.

రాజకుమారిని చపల బాగా రాటు తేల్చింది. ఎప్పుడైనా వివాదం సంభవించినప్పుడు చపల రాకుమారితో యీ ప్రపంచంలో భూతప్రేతాలు లేవని వాదించేది. ఏమైనా వుంటే అది మాయాజాలం ఒక్కటేనని చపల వాదం. ఈ సిద్ధాంతం రాకుమారికి పోనుపోను బాగా నచ్చింది. ఆకారణం చేతనే చంద్రకాంత యిప్పుడు ఆ విచిత్రపు నోరు తెరచినా,

రెక్కలు విప్పినా, భయపడలేదు. బహుశా అంత నాజూకుగా పెరిగిన మరే రాజకుమార్తెయైనా ప్రస్తుత పరిస్థితిలో చిక్కుకొని వుంటే గుండెలు పగిలి చచ్చేది.

పక్షి రెక్కలు విప్పటం తోటే చంద్రకాంత ఆ పక్షి వెనక వైపుకు వెళ్ళింది. అక్కడ ఒక రాయి భూమిలో పాతబడి వుంది. రాకుమారి రాతిమీద కాలు వెయ్యటంతోటే ఆపక్షి ఒక్కసారి కదిలి వెనక్కు తిరిగి రాకుమారిని ముక్కుతో నోట్లో వేసుకొని మింగేసింది. ఆ తర్వాత తిరిగి యథాస్థానానికి వచ్చి రెక్కలు ముడుచుకొని నోరు మూత వేసుకొంది.

# 14

జోలినిండా పండ్లు నింపుకొని చపల తిరిగివచ్చింది. చంద్రకాంత గుమ్మంలో లేదు. శిథిల గృహంలో ప్రవేశించిం దేమోనని లోనికి వెళ్ళింది. చంద్రకాంత నిర్భయంగా లోనికి వెళ్ళగలిగింది గాని చపలమాత్రం ఆగుతూ, కలియజూస్తూ, జాగ్రత్తగా వెళ్ళసాగింది. ఆ శిథిల గృహంలోని విరిగిన శిల్పాలూ, నిలబడివున్న స్తంభాలూ, పోగుపడిన రాళ్ళగుట్టలూ చపల చూసుకుంటూ ముందుకు నడిచింది.

గోడమీద యింకా కొత్తగానేవున్న వర్ణచిత్రాలూ రాతి చెక్కడాలూ చపలకు ఆశ్చర్యాన్ని కలిగించాయి. కాని అవి పూర్తిగామాత్రం లేవు. కొన్ని తల లేకుండనూ, యింకొకటి కాళ్ళుపోయి, మరొకటి చేతులు లేకుండానూవున్నాయి. ఆ చిత్రాల ఆకారాలు భయోత్పాతాన్ని కలిగిస్తున్నాయి.

చపల వీటన్నిటినీ దాటి మైదానంలో ప్రవేశించింది. రాకుమారిని పొట్టలో వేసుకొన్న శిలాపక్షి దూరాన్నుండి కనిపించింది. చపల మిగతావాటిని చూడటం మానివేసి భయం భయంగా ఆ పక్షిని సమీపించింది. అది నోరు తెరచింది. చపల భయపడి వెనకకు తగ్గింది. అది నోరు మూసుకుంది. చపలకు ఇదేదో మాయాజాలంగా అర్థమైంది. దాని రహస్యాన్ని తెలుసుకోవాలను కున్నది గాని ముందుగా రాకుమారిని వెతకాలనే వుద్దేశంతో మరొక దిక్కుకు వెళ్ళింది.

అన్నీ శిధిలాలే! భయానకంగా వున్న ఆ శిధిలాలను చపల ఒక వైపునుండి వెతకటం ప్రారంభించింది. మొదట ఒక పెద్దగదిలో ప్రవేశించింది. దానికప్పు సగంవిరిగి పడివుంది. ఆ గది పొడవు నూరుగజాలకు తక్కువేమీ లేదు. మధ్యగా మన్నూ, సున్నమూ పోగులు పడివుంది. అటూయిటూ యెముకలు పడివున్నాయి. ఆ మట్టి ప్రోగులలో రావిచెట్లు మొలచి వున్నాయి. ఆ గదికి ప్రక్కగా చిన్నగది ఒకటుంది. ఆ గదిలో ఒక భావివుంది. తొంగిచూస్తే అంతా చీకటిగా కనిపించింది.

ఆ భావిలో ఏముందో ? భావి వున్నగది మిగతావాటి కంటె పరిశుభ్రంగా కనిపిస్తోంది. సాధారణంగా పాడుపడిన బావుల్లో చెట్లు మొలుస్తాయి. కాని ఈ బావిలో యెటువంటి చెట్లూ మొలవలేదు. లోపలనుండి యేదో అర్థంకాని ధ్వని వినవస్తోంది.

దాని వివరాలు తెలుసుకొనటానికి చపల తన సంచిలో నుంచి కర్పూరపు బిళ్ళలు తీసి వెలిగించి భావిలోనికి వదలింద్

ఆ ముక్కలు వెలుగుతూ అడుగుభాగాన పడి అక్కడకూడా వెలిగి కాంతినిచ్చింది. ఆ వెలుగులో భావి చాలా విశాలంగా వున్నట్టుగానూ పరిశుభ్రంగానూ కనిపించింది. నీళ్ళుమాత్రం లేవు. నీళ్ళు వుండవలసిన స్థానంలో ఒక తెల్లని దుప్పటి పరచబడి వుంది. ఆ దుప్పటిమీద ఒక వృద్ధుడు కూర్చొనివున్నాడు. పొడుగుపాటి గడ్డంమాత్రం వుంది. తలవొంచుకొని వున్న కారణంగా అతనిని గుర్తుమాత్రం పట్టలేము. ఎదురుగా ఒక పీటమీద రంగురంగుల పూలు పెట్టబడి వున్నాయి. చపల [illegible] తమాషా చూచి భయపడి, తరువాత సంబాళించుకొని ఆలోచిస్తూ భావిమీద కూర్చున్నది. అంతలో కర్పూరం కూడా ఆరిపోయి చీకటి క్రమ్ముకున్నది. ఆ గదిలోనుంచి రెండవ హాలులోనికి వెళ్ళటానికి మార్గమున్నది. చపల అందులోనికి దారితీసింది. అందులో యింకా భయానకమైన దృశ్యాలు వున్నాయి. చెత్తా చెదారమూ, యెముకలూ మొట్టమొదటి హాలుకంటే యెక్కువగా పడి దుర్గంధం ముక్కులను బద్దలుకొడుతోంది. వివిధ జంతువుల అస్థిపంజరాలుకూడా వున్నాయి. వాటినన్నిటిని చపల దాటుకుంటూ మరొక చోటికి వెళ్ళింది.

తొమ్మిది మెట్లు కలిగిన నిలువెత్తు చలువరాతి వేదిక ఒకటి కనిపించింది. దానిమీద ఒకవ్యక్తి పలకమీద నడుం వాల్చి యేదో పుస్తకం చదువుతున్నాడు. ఆ అడుగుమీదికి యెక్కటమా? మానటమా? ఒకవేళ యెక్కితే యేదైనా అపాయం జరగదుగదా! అయినా ఒక్కడుగు వేసి చూద్దాం! [illegible] చపల మొదట మెట్టుమీద అడుగువేసింది. ఆమె అడుగు

వెయ్యటంతోటే పెద్ద ధ్వని వచ్చి పెట్టె తలుపు తెరచుకున్న ట్లుగా ఆ మెట్టుపై రాయి తెరచుకొని చపల కాలును విసిరి వేసింది. ఆ విసురుతో చపల గభాలున నేలపైబడింది. దులుపు కొని లేచి చూచేసరికి ఆ మెట్టుమీాది రాయి తిరిగి యథా స్థానంలో అమర్చుకుపోయింది.

ఆ శిథిల గృహంలోనే చిత్ర విచిత్రాలు చపల మనో వీధిలో ఆశ్చర్య సంభ్రమాలను ముప్పిరిగొలిపింది. ఈ ఇంటిని యెవడో మాయావి తయారుచేసి వుంటాడనుకొంది. ఈ యింటిలో విహరించటం చాలా కష్టం. తప్పటడుగువేస్తేచాలు ప్రాణాలు పోతాయి. కాని తన ప్రాణాలకంటె విలువైన చంద్ర కాంతను వెతకవలసి వున్నప్పుడు చపల తన ప్రాణాల నెక్కడ లెక్కపెడుతుంది! 'ప్రాణాలుపోయినా చంద్రకాంతను తీసి కొని వెళ్ళకుండా ఈ యింటిలోనుంచి బయటకు వెళ్ళనని చపల శపథం పట్టింది. ఆ వేదిక, మెట్లయొక్క మాయాజాల మేమిటో తెలుసుకోవాలని చపల ఒక బండరాతిని ఆ వేదిక మెట్టుమీాద పెట్టింది. ఆ రాతినికూడా అదేవిధంగా పెద్ద ధ్వని చేసుకుంటూ మెట్టుమీాది రాయి తెరచుకొని విసిరిపారేసింది.

చపల అన్ని మెట్లమీాదను ఆవిధంగా రాతినిపెట్టి చూచింది. ప్రతిదీ అదేవిధంగా తెరచుకొని విసిరి పారేసింది. ఆవేదికమీాది విశేషంకూడా తెలుసుకోవాలని చపల వేదిక ప్రక్కగా రాళ్ళు పేర్చి వాటిమీాద యెక్కి కూర్చొని చూడ సాగింది. అక్కడ దాదాపు ముప్పయి సంవత్సరాల వయస్సు కలిగిన వ్యక్తి పడుకొని రెండుచేతులతోనూ పుస్తకం పట్టుకొని చదువుతున్నాడు. బాగా పరీక్షించి చూస్తే అతడు రాతి

మనిషి! చపల ఒక కంకరరాయి అతని మొఖంమీద వేసింది. కాపటానికి అది రాతి విగ్రహమే అయినా మామూలు మనిషి మోస్తరుగా ఆ రాయిని చేతితో తీసివేసుకొని యధాస్థిగా వుండిపోయాడు. అప్పుడు చపల ఒకరాయిని కాలుమీద వుంచింది. అతడు కాలు విదిలించి రాయిని తొలగతీసుకున్నాడు చపల కాపటానికి జిత్తులమారి, ధైర్యశాలి అయినా ఆ రాతి మనిషి విచిత్ర ప్రక్రియలకు భయపడక తప్పలేదు. అక్కడనుండి వెంటనే కదిలి మరొకచోటుకు వెళ్ళింది. అమధ్యస్థంగా వున్న హాలులో భూగర్భ గృహం లోనికి మెట్లువున్నాయి కనపడింది. దానిపై భాగాన తలుపులు వున్నాయి. యిప్పుడవి తెరవబడి వున్నాయి.

చపల అక్కడ నిలబడి లోనికి వెళ్ళటమా ? మానటమా అని ఆలోచిస్తున్నది. ఒకవేళ లోనికి దిగితే యెక్కడ తలుపులు మూతబడిపోతాయో నని ఆమె భయం. అందుకని చపల ముందుగా ఆచీకటి గృహంలో ఒక రాతిపలకను వేయ దలచింది. మనిషి వెళ్ళితే మూసుకొనిపోయే తలుపులు రాతి పలకలు వేస్తేకూడా మూసుకొనిపోవాలిగదా! ఆ విధంగా మూసుకొనిపోయిన తర్వాత ఇక ఆ చీకటిగృహంలో యేమున్నదో తెలుసుకొనటానికి వీలులేకుండా పోతుంది. అందుకని అందులో ప్రవేశిస్తే తలుపులు మూసుకొనిపోకుండా అసలా తలుపులనే విరగగొట్టి పారెయ్యాలి.

ఇల్లాగే అనేకరకాలుగా ఆలోచించిన చపల దానిని నిర్ధారించింది. మొదట తలుపులు విరగగొట్టటానికి ప్రయ

త్నించింది గాని అవి లోహపు తలుపులైన కారణంగా ఆమె ప్రయత్నం ఫలించలేదు.

చపల తన దగ్గరవున్న తాడు చుట్టను తీసి ఒక కొసను లోహపుతలుపు ఒకదానికి బాగా బిగించి కట్టి మరొక కొసను ఆహాలులోనే ఒక కిటికీకి దగ్గరగావున్న స్తంభానికి కట్టింది. ఆ తర్వాత ఒక రాతిపలకను దూరాన్నుండి ఆ చీకటి గృహం లోనికి విసిరింది. రాయి అందులో పడగానే ఒక పెద్ద ధ్వని వచ్చింది. ఆ వెంటనే ఒక తలుపు మూసుకొనిపోయింది. రెండవ తలుపుకూడా మూసుకొనిపోవటానికి ప్రయత్నం జరిగింది. గాని తాడు తెంచుకోలేక అక్కడే ఆగిపోయింది. తాడు తలుపును మూసుకో నివ్వకుండా చెయ్యటం చపల గమనించి నిర్భయంగా చీకటిగృహంలోనికి ప్రవేశించింది.

# 15

చంపకూడా రాజకుమార్తెను వెతకటానికి ఇల్లు బయలు దేరింది. అడవులు కొండలు గాలించింది. కానీ ఆమెకు చంద్ర కాంత ఎక్కడవున్నదీ తెలియలేదు. ఆమె అలసి ఒక అడవిలో చెట్టుక్రింద కూర్చుని ఆలోచిస్తోంది. ఆమె మహారాణితో రాజకుమారి సంగతి సందర్భాలు తెలుసుకోకుండా తిరిగిరానని మాట ఇచ్చింది. ఆమెకు యెదురుగా నలుగురు సిపాయిలు కత్తులు, ఢాలులు ధరించి పోతున్నారు. వాళ్ళు చంపనుచూచి ఏవో గుసగుసలు లాడుకుంటున్నారు కానీ అవేమిటో చంపకు వినిపించలేదు. వాళ్ళు ఒక్కొక్కసారి వెనక్కుతిరిగి ఎవరిరాకనో గమనిస్తున్నారుకూడా. కొద్దిసేపటిలో ఆ నలుగురు సిపాయిలు

చంప కూర్చున్న చెట్టుక్రిందికి వచ్చి ఆమె చుట్టూ కూర్చున్నారు. ఆ విధంగా వాళ్ళు తనను ఎందుకు చుట్టుముట్టారో అర్థంకాలేదు. ఇక అక్కడ కూర్చోవటం మంచిది కాదనుకొని లేచిదారిపట్టింది. వాళ్ళు చంపను వెళ్ళనివ్వలేదు. చంపతో "ఎక్కడికి వెళుతావు? వెనుక మా యజమాని వస్తున్నాడు. ఆయనకు చెప్పి నీ కేదైనా ఉద్యోగం ఇప్పిస్తాం. ఈ అడవుల వెంట ఎందుకు అనవసరంగా తిరుగుతావు?" అని అన్నారు.

"నాకు నౌకరి అవసరంలేదు" అన్నది చంప. "తొందర పడకు! నీవు మా యజమానినిచూస్తే భుజాలు ఎగురవేస్తావు, నీవు అంత అందగాడైన యువకుడ్ని ఎన్నడూ చూచియుండవు పీలైతే నిన్ను మా యజమానికిచ్చి పెళ్ళిచేస్తాం."

"వళ్ళు దగ్గరపెట్టుకొని మాట్లాడండి. లేకపోతే చమడాలు వలుస్తాను. ఆడదాన్ననుకుంటున్నారేమో! మీలాంటి పదిమందికి సమాధానం చెప్పగలను" అని చంప బెదిరించింది. చంప పొగరుమోతుమాటలువిని సిపాయిలు ఒకరి ముఖం ఒకరు చూచుకోసాగారు. ఆమె ముందుకు సాగింది. ఒకడు చెయ్యి పట్టుకున్నాడు. చంప తటాలున మెరుపుతీవెలా కత్తి దూసి సిపాయిలమీదికి విజృంభించింది. ఇద్దరు ముగ్గురు గాయపడ్డారు. మిగతా వారికి అంకకుండా పారిపోయింది.

కాని దోవలో యెదురుదెబ్బ తగిలి పడిపోయింది. తరుముకుంటూ వస్తున్న ఇద్దరు సిపాయిలు అక్కడికి చేరుకున్నారు. ఇంతలో అక్కడకు మనుష్యుల వ్యాపారం చేసేవాళ్లు షుమారు రెండువందలమంది వచ్చి చేరుకున్నారు. వారి ముందు

భాగంలో దాదాపు ఎనభైసంవత్సరాల వయస్సుగల ముసలి వాడు వున్నాడు. అతడు నల్లగా తెల్లని గడ్డంతో వున్నాడు. అతనిచేతిలో బల్లెంవుంది. కత్తీ, ఢాలు కూడా వున్నాయి, అతడు గుఱ్ఱముమీాద ప్రయాణిస్తున్నాడు.

అతనివెంట ఇరవై సంవత్సరాల యువకుడు అందచం దాలలో రాజకుమారుని పోలి ఠీవిగా గుఱ్ఱంమీాద కూర్చు న్నాడు. వాళ్ళకి వెనుక అనేకమంది గుఱ్రాలమీాద, కాలి నడకన ప్రయాణిస్తూవున్నారు. ఇంకా వెనుక ఒంటెలపై డేరా సామానులు నింపివున్నాయి. డోలీలకు రక్షకభటులు తుపాకులు తీసుకుని కావలా కాస్తువున్నారు. వాళ్ళనుచూచి సిపాయిలు "యీా ఆడది మన మనుష్యుల నిద్దరిని గాయపర చింది" అని చెప్పారు. వాళ్ళు ఆ మాట చెప్పటంతోటే అనేక మంది చంపను చుట్టుముట్టి చేతిలో కత్తి లాగుకొని చేతులకు బేడీలు వేశారు.

బహుశా ముందుభాగాన వున్న వృద్ధుడు ఆ పటా లానికి నాయకుడై వుంటాడు. అతడు "ఇక్కడే మన డేరా వేయండి." అని ఆజ్ఞాపించాడు.

డేరా వేయబడింది. డోలీలలో ఖైదీ చేయబడిన స్త్రీలతోపాటు చంపకూడా చేర్చబడింది. సూర్యాస్తమయం అయింది. ఖైదీ చేయబడిన స్త్రీల దగ్గర దీపాలు వెలుగు తున్నాయి. దాసీలువచ్చి "వంట చేస్తారా? చేస్తే తింటారా" అని అడిగారు. దానికి సమాధానంగా కొందరు స్త్రీలు "చేస్తే తింటాం" అన్నారు. ఇద్దరు స్త్రీలు మాత్రం "అసలు మేము

తినం” అన్నారు. 'అయితే ఎంతసేపు ఆకలిముఖాన వుంటారో వుండండి' అని గొనుగుతూ దాసీలు వెళ్ళిపోయారు.

అసలు అన్నమే తిననని చెప్పిన యిద్దరు స్త్రీలలో ఒకామె అప్పుడే ఖైదుచేయబడిన చంప. ఇంకొకామె చాలా అందంగానూ, సుకుమారంగానూ వుంది. ఆమె కళ్ళవెంట అశ్రుబిందువులు రాలుతున్నాయి. ఆమె గట్టి నిశ్వాసం తీస్తున్నది. ఆమె ప్రక్కగానే చంప కూర్చున్నది.

ఒకఝాము ప్రొద్దు పోయింది. ఆ యిద్దరి స్త్రీలకు తప్ప మిగతావారికి భోజనాలు వచ్చాయి. అర్ధరాత్రయింది. డేరాలకు పహారాయిస్తున్న సైనికుల పాదధ్వనులు చంపకు వినవస్తున్నాయి. నెమ్మదిగా చంప తన ప్రక్కగావున్న ఆ అందమైన స్త్రీతో సంభాషణ కొనసాగించింది.

“మీ రెవరు ? వీళ్ళచేతుల్లో ఎట్లా చిక్కుకున్నారు ?”

“నాపేరు కళావతి. నేను శివదత్తమహారాజు రాణిని. ఆయనగారు యుద్ధానికి వెళ్ళినప్పుడు నేను ఒంటరిగా వున్న సమయం చూచి యీ దుర్మార్గులు యెత్తుకొచ్చారు. నీ వెవరవు ?” అని అడిగింది చంపను.

“అయ్యో! చురాగఢ మహారాణికి యీగతిపట్టిందా? అయితే మీరు రాకుమారి చంద్రకాంతను యెరిగే వుంటారు. నేనామె చెలికత్తెను. మా రాకుమారిని వెతుకుతూ యిటు వస్తే వీళ్లు నన్ను పట్టుకున్నారు.” అన్నది. చంప. ఇద్దరూ నెమ్మది నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారు. బయటనుండి “ఎవరు ? పరుగెత్తు, పరుగెత్తు! తప్పించుకుంది!” అనే కేకలువినిపించాయి. రాణి వణికిపోయింది గాని చంప నిశ్చింతగా నేవుంది.

ఆ రాత్రి నిద్రలేకుండానే యిద్దరూ మాటలతో గడిపారు. తెల్లవారిన తర్వాత యిద్దరు దాసీలు కత్తులు తీసుకొనివచ్చి "వంతులు, వంతులుగా కాలకృత్యాలకు లేవండి" అని అన్నారు.

కొందరు స్త్రీలు బయటికి వెళ్ళారుగాని, మహారాణి, చంప మాత్రం అట్లాగే కూర్చున్నారు. ఒక ఝాము ప్రొద్దెక్కిన తర్వాత ఆ పటాలం నాయకుడు ఒక వృద్ధ స్త్రీని వెంట బెట్టుకొని స్త్రీ ఖైదీలు వున్నచోటికి వచ్చాడు.

"ఇంతేనా, యింకెవరైనా వున్నారా?" అని ప్రశ్నించింది ఆ ముసలి వనిత.

"ఇప్పటికి వీరే! మీదయవుంటే యింకా యెక్కువ కావొచ్చు." అన్నాడు నాయకుడు.

"అయితే నేను ఎందరి స్త్రీలను పట్టుకొస్తానో చూడు. మరి; యేరకపు స్త్రీలకు ఎంతెంత బహుమాన మిస్తావో చెప్పు?" అన్నది ముసలిది.

"ఇదుగో ఈ రకంవాళ్ళయితే ఒకొక్కరికి పది రూపాయలిస్తాను." చంప దిక్కుగా చూచి "ఈరకమైతే యాభై రూపాయలు" మహారాణిని చూపి "ఇంత అందగత్తెలైతే నూరురూపాయలు" అని చెప్పారు నాయకుడు.

"ఇవా మీ ధరలు! సరేగాని వీళ్ళందరూ నీ కెట్లా దొరికారు?" అని అడిగిందామె.

"ఇదుగో! అందరికంటె అందమైన ఈమెను ఒక గుహాలో సంపాదించాను. అక్కడీమె స్మారాలేకుండా పడి

వుంది. ఇక, ఇది నిన్ననే యిక్కడ పట్టుబడింది. మా సిపాయిల నిద్దరిని గాయపరిచింది. మహాచెడ్డది." అన్నాడు నాయకుడు.

"దీని ముఖమే చెప్తోంది; మహాచెడ్డదని! ఇటువంటి వాళ్ళు యింకా యిద్దరు జమ అయితే నీ పటాలమే వైకుంఠ యాత్ర కొడుతుంది." అన్నది ముసలిది.

"అందులో అనుమానంలేదు. వీళ్ళందరూ అనేక రకాలుగా పట్టుబడ్డారు. ఇదున్నది చూచావు ఇది బెంగాలు నివాసి. దీనింటి పక్కనే మావాడొకడు మకాం వేసి ప్రేమించినట్లుగా ప్రేమించి లేపుకొచ్చాడు. ఇదుగో యీ నలుగురూ డబ్బు ఆశవల్ల వలలోపడ్డారు. మిగతావారిని వారి వారసులకూ డబ్బిచ్చి కొనుకొచ్చాను. సరే యిక నడూ. మన డేరాలో కెళ్ళి మాట్లాడుకుందాం. ముసలివాణ్ణి ఎక్కువసేపు నిలబడ లేను." అన్నాడు నాయకుడు.

"సరే అన్నది" ముసలిది.

ఇద్దరూ డేరాలోకి వెళ్ళారు. వాళ్ళిద్దరూ వెళ్ళినతర్వాత స్త్రీ ఖైదీలు నానా తిట్లు తిట్టుకున్నారు. "చూచావా వీడు! యింకా ఆడవాళ్ళనూ ఎత్తుకొనిరావాలని ప్రయత్నిస్తున్నాడు. ఈ ముసలిది వీడికి యెక్కడ తోడయిందో అర్థంకావటంలేదు. ఈ దరిద్రగొట్టిది యింకా ఎంతమందిని తీసుకొనివస్తానో చూడమంటున్నది. ఓరిభగవంతుడా! నువ్వు ఇటువంటివాళ్ళకూ సహాయపడుతూ కూర్చున్నావా? ఇంకా యీ పిశాచం ఎన్ని సంసారాలను మంటగలుపుతుందో గదా!"

చంప ఆ ముసలిదాన్ని బాగా పరీక్షించి చూచి ఒక [illegible]గంటవరకు ఆలోచిస్తూ కూర్చుంది. మహారాణి మాత్రం

శివదత్త మహారాజుని తలచుకుంటూ యేడ్వసాగింది. చంప ఆమెను ఓదారుస్తూ "మహారాణీ! నువ్విలా కన్నీ రెట్టుకోకు. భగవంతుని దయగలిగితే మనం త్వరలోనే విముక్తులమౌతాం. నాకేమి చెయ్యటానికి యీ బేడీలు అడ్డంగా వచ్చి కూచ్చు న్నాయి. వీటిని నరకటంవల్ల తప్ప వొదిలించుకొనే వుపాయం మరొకటిలేదు" అన్నది.

ఏదో ఒక రకంగా ఆ రోజు గడచింది. సాయంకాల మైంది. ముసలి నాయకుడు తిరిగి వచ్చాడు. అతని వెంట ముసలిదికూడా వుంది. ఆమె ఒక అందమైన యువతిని పట్టు కొచ్చింది.

"ఇదుగో; మొదటిరకం ఆడదాన్ని తెచ్చాను."

"ఇది మొదటి తరగతికి చెందిన దెలా అవుతుంది. రెండోతరగతిలో చేరవచ్చు. మొత్తంమీద ఇవాళ యాభై రూపాయలు సంపాదించావ్!" అన్నాడు ముసలివాడు. ముసలిది ఆ యాభైకే సంతోషపడింది. అప్పుడు వాళ్ళేదో గుసగుసలు లాడుకున్నారు. ఆసంగతేమిటో చంపమాత్రం అర్థంచేసుకుంది. కొత్తగావచ్చిన ఆ ఆడది చాలా హుషారుగా వుంది. దానికోసం అప్పుడే భోజనం పంపబడింది. లొట్టలు వేసుకుంటూ తిండి తింది. మిగతావాళ్ళు యేడుస్తూ వుండటం చూచి నవ్వసాగింది. చంప దాని చేష్టల నన్నిటినీ గమనిస్తూనే వుంది.

---

# 16

నిన్నటివలెనే నేడుకూడా గడచింది. ఉదయం స్త్రీ లంతా కాలకృత్యాలు తీర్చుకున్నారు. చంప, మహారాణి మాత్రం ఈరోజుకూడా కాలాదికాలకు లేవలేదు. "మీరు పట్టుబడిననాటినుండీ అసలు తిండితిన్నారా? లేదా?" అని చంప రాణిని ప్రశ్నించింది." "ఏదో మహారాజును కలుసుకోవాలనే ఆశతో కొద్దిగా అప్పుడప్పుడు చావకుండా మెంగిలి పడుతున్నాను." అన్నది రాణి.

ఇద్దరు మనుష్యులువచ్చి "మీరిద్దరూ బయటికి పదండి. స్త్రీలంతా ఇవాళ చెట్లక్రింద మంచిగాలికి కూర్చోమని మా నాయకుడు చెప్పారు." అని అన్నారు. అంతకుముందే మిగతా స్త్రీలు చెట్లక్రింద కూర్చుని వున్నారు. చంప, రాణి కూడా వాళ్ళల్లోచేరి కూర్చొన్నారు. చంప నలుదిక్కులూ పరీక్షగా చూడటం ప్రారంభించింది.

రెండు జాములైంది. నిన్నటి ముసలిది యీవేళకూడా ఇంకా యెక్కువ అందంగల ఆడదాన్ని తీసుకొచ్చింది. నాయకుడు సంతోషంతో ముసలిదాన్ని తన దగ్గరగా కూర్చోబెట్టుకొని ఆ తెచ్చిన ఆడదాన్ని జనంలోకి పంపించాడు. చంప ఆ వచ్చిన కొత్తమనిషిని శ్రద్ధగా పరికించింది చివరికి తల పైకెత్తి "మీ సంగతా" (తెలుసుకున్నాలే!) అన్నది ఆ వచ్చిన స్త్రీ చంప ముఖం చూచింది. తల క్రిందకు దించి కాటన్నవేలు నలుపుకుంటూ "చపకలా ఘటమేవాపరోఘస్"

(మెదలకుండా వుండే నువ్వుకూడా రక్షింపబడతావు.)అన్నది. అ తర్వాత యిద్దరూ యేమీ మాట్లాడలేదు.

సాయంకాలమైంది. స్త్రీలంతా తమ డేరాలోనికి వచ్చారు. రాత్రి భోజనాలుకూడా వచ్చాయి. రాణి, చంప మినహా అందరూ భోజనంచేశారు. ఆ క్రొత్తగా వచ్చిన మాత్రం అందరికంటె యెక్కువే తిన్నారు.

అర్ధ రాత్రయింది. కావలావాళ్ళు పహారా యిస్తు న్నారు. ఒక్క దీపంమాత్రం స్త్రీలున్నచోట వెలుగుతోంది. రాణి, చంప వచ్చి కొత్తవాళ్ళిద్దరూతప్ప మిగతావాళ్ళందరూ నిద్రపోయారు. చంప వాళ్ళిద్దరిని చూచి "కడాక్ మీాశేటీ నోసీఫారో ఫేసతో" (నా బేడీలు విరగగొట్టకపోతే అందరినీ బంధించేస్తాను) అన్నది. ఇద్దరిలో ఒకరు "తోమ్‌చేకీ" (నీ పరి సితి యేమౌతుంది?) సమాధాన మిచ్చింది. అందుకు చంప "రాణీమేనెంగీ" (రాణీతోపాటే) అన్నది.

ఆ స్త్రీలిద్దరు తమవద్ద రహస్యంగా వున్న కత్తులుతీసి చంప బేడీలు సరికేశారు. చంప నిశ్చింతగా చిరునవ్వు నవ్వు కొంది.

అర్ధ్రతి కూడా గడచింది. ఒక్కసారిగా స్త్రీలున్న డేరానుఅనేకమంది ముట్టడించారు. చంపు, పట్టుకో అనే కేకలు వినిపించాయి. తుపాకి కాల్పులుకూడా వినిపించాయి. స్త్రీ లంతామేల్కొన్నారు. దొంగలతోయుద్ధం జరుగుతోంది అనుకొ న్నారు. స్త్రీ లంతా అటూ యిటూ చెల్లా చెదరైపోయారు. రాణీభయపడి 'చంపా చంపా'అని పిలిచిందిగాని ఆమె కనిపించ

లేము. కొత్తగా వచ్చిన స్త్రీలిద్దరూ వచ్చి "చంప వెళ్ళిపోయి నట్లుంది; మీరేమీ భయపడవద్దు. ఇప్పుడు ముట్టడి జరిపింది మీ నౌకరులే! మేముకూడా మీ మనుష్యులమే. ఆడవాళ్ళం కాదు. నేను వెళ్ళి తయారుగా వున్న డోలీని తెస్తాం. మిమ్మల్ని తీసుకుపోతాం" అని యిద్దరూ దారిబట్టారు.

స్త్రీలచుట్టూ మనుష్యుల కోలాహలం తగ్గిపోయింది. మిగతా డేరాలలో మాత్రం ఇంకా సంచలనం కొన సాగుతోంది. ముఖాలమీద ముసుగులు వున్న యిద్దరు మనుష్యులు డోలీని తీసుకొచ్చి మహారాణిని కూర్చోబెట్టి తీసుకొని వెళ్ళారు.

తెల్లవారింది. చంప, మహారాణీ పోగా మిగిలిన స్త్రీలు కూర్చొని వున్నారు. ఇంతలో వన్నాలాల్, రాంనారాయణ చున్నీలాలు ఒక డోలీని తీసుకొని స్త్రీలున్న డేరాదగ్గరికి వచ్చారు. డోలీమీద ముసుగు కప్పివుంది. డోలీ బయట పెట్టి ముగ్గురూ డేరాలో ప్రవేశించి "మీలో యింకా ఇద్దరు స్త్రీలుండాలి: యేరీ?" అని ప్రశ్నించారు.

స్త్రీలు భయభ్రాంతులై మాట్లాడలేకపోయారు. వన్నాలాలు "మీరు భయపడకండి. మేము దొంగలం కాదు. మిమ్మల్ని విడిచిపెట్టటానికే యింత కథ నడిపాం. ఆ స్త్రీ లెక్కడున్నారు చెప్పండి" అన్నాడు.

అంతట స్త్రీలు కొద్దిగా కుదటబడ్డారు. ఒకామె "ఇద్దరు కాదు; నలుగురుండాలి. అందులో యిద్దరు ఒకామెను 'నీవు భయపడకు; మేమునీ మనుష్యులమే' అని చెప్పిఒక డోలీ

తెచ్చి యెక్కించుకొని పోయారు. మరొకామె అందరికంటె ముందుగానే పారిపోయింది" అని చెప్పింది.

ఆమె సమాధానం మాయావులను ఆశ్చర్యపరచింది. వాళ్ళు ఒకరిముఖాలు ఒకరు చూచుకున్నారు. "అవును. మే ముద్దరమే మహారాణిని ఓదార్చి డోలీ తేవటానికి నీ దగ్గర కొచ్చాం. నీతో కలిసి డోలీ తీసుకొచ్చేసరికి యింతలో మహారాణిని యెవరు తీసుకొని పోయివుంటారు? వీళ్ళు చెప్పినట్లుగా చంప మొట్టమొదటే వెళ్ళిపోయింది. బయటకువెళ్ళి ఈ వ్యాపారస్తుల దగ్గర డోలీ లేమైనా తక్కువ పడినయేమో కను కనుక్కుందాం పద!" అన్నాడు నారాయణ పన్నాలాలుతో.

ఆడవాళ్ళందరూ బయటకు వచ్చారు. బయట అంతా శవాలు పోగులు పడివున్నాయి. ముసలి నాయకుడు అతని అందమైన యువకుడూ బంధించబడి ఒక చెట్టుక్రింద వున్నారు. పదిమంది కత్తులు పుచ్చుకుని వారిద్దరిని కావలా కాస్తున్నారు. ఇంకా వందలకొద్దీ జనాన్ని కాళ్ళూ చేతులూ కట్టి మరొక చెట్టుక్రింద వుంచారు.

మాయావులు ముగ్గురూ డోలీలు వున్నచోటికి వెళ్ళి లెక్కపెట్టారు. పదిహేడు వుండవలసిన యివ్వాడు ఒకటి తక్కువగా వుంది. బహుశా ఆ డోలీ మీదే. మహారాణిని తీసుకొని వెళ్ళడనుకొని యెవరు తీసికొని వెళ్ళిందీ తెలియక దూరాన సైన్యాల దగ్గరున్న మంత్రికి కబురుచేశారు.

మంత్రిని తీసుకొని చున్నీలాలు వచ్చాడు. పన్నాలాలు "మేము నాలుగు రోజులనుంచి పడిన కష్టమంతా వృథా అయింది. ఆడవాళ్ళ ఆశచూపి ఈ ముసలివాణ్ణి మీరు

సైన్యంతో వచ్చేవరకూ ఆపాం. మీరు వచ్చారు. జరగవలసిన రక్తపాతం జరిగింది. కాని చివరకి మహారాణి, చంప చేతికి దొరక్కుండా పోయారు. చంప పోతే పోయిందిలే! అది మమ్మల్ని మగవాళ్ళని గుర్తుపట్టి తన చేతి బేడీలు నరకమంది. లేకపోతే రహస్యం బయట పెట్టేస్తానంది. పని భంగమౌతుం దని మేము బేడీలు నరికేశాం. పీలు చూచుకొని పారిపోయింది. రాణీని యెవరు తీసుకొని వెళ్ళారో అర్థం కాకుండా వుంది" అన్నాడు మంత్రితో.

"ఈ ముసలివాడే దాచి వుంటాడు. పట్టుకొని చావ గొట్టండి" అన్నాడు మంత్రి.

"అతడు చేసినపని కాదనుకుంటున్నాను. మీరు ఈ స్త్రీ వ్యాపారస్థులను తీసుకొని సైన్య సమేతంగా చునారగఢకు వెళ్ళండి. మేము తిరిగి రాణిని వెతకటానికి వెడతాం" అన్నాడు పన్నాలాలు.

మంత్రి తిరిగి వెళ్ళిపోయిన తర్వాత ముగ్గురూ ప్రయాణం సాగించారు. "చునారగఢకి యెటువంటి దుర్దశపట్టింది. రాజును ఒకవైపున యెత్తుకొనిపోయారు. రాణి దొరికిందిగదా అను కుంటే యెవడో మనకు మించినవాడు చేతుల్లోది చేతుల్లోనే యెగరగొట్టుకొనిపోయాడు" అన్నాడు పన్నాలాలు.

"ఏం జేస్తాం! చేయవలసిన కృషంతా చేశాం. సైన్యా లను కూడా పిలిపిస్తే అందులోనూ జరగవలసిన నష్టం జరిగింది తిరిగి పాడింది పాడవలసి వచ్చింది" అన్నాడు రాంనారాయణ.

"చంప దొరికిందని సంతోషపడ్డాగాని అది యెట్లా గుర్తుపట్టిందో పట్టి తనపని తాను చూచుకుంది. ఈ పనికూడా అదే చేసిందేమో ?" అన్నాడు చున్నీలాలు.

"చంప ఒంటరిగా డోలీ మోయగలుగుతుందోయ్ ?" అని చున్నీలాలు అనుమానాన్ని నివృత్తిచేశాడు పన్నాలాలు.

"మనముగ్గుర్ని యిక్కడకు పంపి మహారాజును తేవటానికి బదరీనాథుడు అహ్మద్‌ని నాజింని వెంటబెట్టుకుని వెళ్ళాడు. అక్కడ ఆయనేమిచేసి కూర్చున్నాడో !" అన్నాడు రాం నారాయణ.

పన్నాలాలుకి మహారాణి లేకుండా చూనారగఢ మొఖ మెట్లా చూపడమా అనే చింతగలిగింది. అట్లాగే ముగ్గురూ కొంతదూరం కలసి వెళ్ళి ఆ తర్వాత విడిపడ్డారు.

# 17

దట్టంగా చెట్లు మూసుకొని వున్న ఒక కాలువబడ్డున జగన్నాథజ్యోతిష పండితునితో కలసి తేజసింహుడు కూర్చుని వున్నాడు. వారి ప్రక్కగా ముసుగు తీయబడి వున్న డోలీలో కూర్చొని ఒక స్త్రీ తేజసింహునితో మాట్లాడుతోంది. ఆ స్త్రీ చునారుగఢమహారాజు శివదత్తుని పట్టపురాణియైన కళావతీదేవి డోలీ వెనుకభాగాన చంప నిలబడి వుంది.

"నాకు చునారుగఢతో నిమిత్తం లేదు. నాకు కూడా బేడీలు వేసి నా భర్తపాదాలవద్ద పడేయండి." అన్నది రాణి.

తేజసింహుడు రాణికి సమాధానంగా "నేను మిమ్మల్ని మహారాజు బంధించివున్న చోటికి వెళ్ళమనటంలేదు. మిమ్మల్ని

జాగ్రత్తగా చునాపుగథకి పంపిస్తాం వెళ్ళండి. మిమ్మల్ని పట్టు కొని తీసుకొని రావలసిన అవసరం మాకేమీలేదు. మీ పతి వ్రతాధర్మాన్ని గురించి జ్యోతిషపండితుడు అనేకసార్లు చెప్పగా విన్నాం. మహారాజును విడిచి మీరు ఒకక్షణంకూడా వుండ లేరని తెలిసి యిక్కడకు తీసుకొచ్చాం. అసలు మేము చంపను మాత్రమే విడిపించటానికి వెళ్ళాం. మీ రిప్పుడు ఎక్కడికి తీసుకొని వెళ్ళమంటే అక్కడికి తీసుకొని వెళ్తాను. నాద్వారా తప్ప మీరు రాజుగారి దగ్గరికి యింకెవ్వరిద్వారానూ వెళ్ళ లేరు. మహారాజు ఖైదులో యింకెన్నాళ్ళు వుంటాడోకూడా చెప్పలేను." అన్నాడు.

మహారాణి కృతజ్ఞతా పూర్వకంగా "మీకు సాధ్య మైనంత త్వరగా మహారాజు దగ్గరికి నన్ను తీసుకువెళ్ళండి" అన్నది.

"అయితే మిమ్మల్ని డోలీలో తీసుకొని వెళ్ళలేను. స్పృహతప్పించి తీసుకొని వెళ్ళవలసి వుంటుంది."

"మీ యిష్టప్రకారం తీసుకొని వెళ్ళండి."

"అయితే దీనిని వాసనచూడండి."

మహారాజుని కలియటానికి రాణి యేమిచెయ్యటాని కైనా సిద్ధమే! ఆమె తేజసింహుడిచ్చిన సీసాను వాసనచూచి స్పృహతప్పి పడిపోయింది.

జ్యోతిష్యుడు "మీ రీమెను చీకటిగృహంలో విడిచి రండి. అప్పటివరకు నేనిక్కడే వుంటాను. చంపకూడా విజయ గఢ వెళ్ళటం మంచిది. మనం చంద్రకాంతను వెతుకుతూ

తిరుగుతుంటే ఈమెకూడా మన కెంట కష్టపడట మెందుకు ?”
అన్నాడు.

“నిజమే! చంపా, పండితులు చెప్పినట్లు నువ్వు ఇంటికి వెళ్ళు. లేకపోతే మళ్ళా యిక్కడైనా చిక్కుకొనిపోతావు” అన్నాడు తేజసింహుడు.

చంప అతని సలహాను పాటించకుండా “చంద్రకాంత జాడ తెలియనంతవరకూ నేనింటికి వెళ్ళను. ఒకవేళ నేను స్త్రీల వ్యాపారుల చేత జిక్కానంటే; నేనే విడిపించుకున్నా గదా! మీరు నాకోసం యేం కష్టపడ్డారు!” అంది.

“ఇప్పుడు మేము నిన్ను విడిపించామని చెప్పుకోవటం లేదు. చంద్రకాంత ఒకవేళ ఆ వ్యాపారుల చేతజిక్కిందేమో నని అటు వచ్చాం. తీరా అక్కడ మీ రిద్దరూ కనిపించారు. మిమ్మల్ని విడిపించే ప్రయత్నం ఆలోచించబోయేసరికి మహా రాణిని విడిపించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని జాడ తెలిసింది. అంతటితో మనం కష్టపడట మెందుకు; ప్రయత్నాలు చేసేవాళ్ళ నేదో చెయ్యనియ్; ఆ సందట్లో మన ఫలితమేదో మనం చూచుకుందాం అని మేము ఊరుకున్నాం. చివరికి అట్లాగే జరిగింది. నువ్వు నీ తెలివితేటలతోనే తప్పించుకున్నావ్ మేము మాత్రం రాణిని తెచ్చాం. సరే యిప్పుడా కథంతా యెందుకుగాని, నువ్వు మా వెంటవుండి యేంజేస్తావ్ ? పోనీ యెక్కడ వెతుకుతావ్ ? ఒకవేళ నువ్వు చంద్రకాంతను వెతుకుతూ యెక్కడెక్కడో పడివుంటే యీలోపలే మేము రాకు మారిని తీసుకొని విజయగఢ చేరుకుంటే!” అన్నాడు వ్యంగ్యంగా తేజసింహుడు.

"మీరు నన్ను తెలివితక్కువదాన్నిగా చెయ్యక నిశ్చింతగా వుండండి." అంది చంప.

లాభంలేదనుకొని తేజసింహుడు వాళ్ళిద్దరినీ అక్కడ విడిచి తనదారిన తాను వెళ్ళాడు. చంపకూడా తన ప్రయాణంలో తాను వెళ్ళింది.

# 18

తేజసింహుడు వెళ్ళినతర్వాత జ్యోతిష్యుడు ఒంటరిగా డైపోయాడు. గవ్వలు విసిరీ చంద్రకాంత, చపల యెక్కడున్నారో తెలుసుకోవాలనుకున్నాడు. ఆవిధంగా అతడు తనదగ్గరున్న గవ్వలుతీసి భూమిమీద వేసి యేమిటో లెక్కలు వేసుకోవటం ప్రారంభించాడు. ఒక గంటసేపు ఆ విధంగా తిప్పలు పడగా యేదో జాడ తెలిసినట్లు ఆతనికి అర్థమైంది. వెంటనే అతడు తన సామానులన్నీ మూటగట్టుకొని తేజసింహుడు వెళ్ళిన దిక్కుగా పరుగెత్తసాగాడు.

తేజసింహుడు ఐదుకోసుల దూరంవెళ్ళిన తర్వాత వెనకనుంచి "ఆగు; ఆగు" అని వినిపించింది. చూస్తేపండితుడు. ఆగి; ఎందుకు వస్తున్నాడా అని భయపడసాగాడు. దగ్గరకు వచ్చిన తర్వాత "ఎందుకండీ; పరుగెత్తు కొచ్చారు." అని అడిగాడు.

"నేను చీకటికొట్లోకి వస్తున్నాను."

"ఎందుకు?"

"అక్కడే చెప్తాను; ఇక్కడ చెప్పను."

"అయితే మీకు కళ్ళకు గంతలు కట్టవలసి వస్తుంది.! గుహ తలుపులు తియ్యటం వెయ్యటం ఇంకొకరికి తెలవనివ్వ దలచుకోలేదు.!"

"నీవే నన్ను కళ్ళకు గంతలులేకుండా సంతోషంతో తీసికొని వెళ్ళావ్!"

"అంత గొప్పవిశేష మేమిటబ్బా!"

"చంద్రకాంతను అక్కడ చూపించటమే విశేషం!"

"నిజంగానా!!"

"అబద్ధమైతే అక్కడే నాగొంతు కొయ్యి"

"నీకేః నిన్ను చంపితే నువ్వు బాగానే చస్తావ్! మధ్య నేను బ్రహ్మహత్యాపాతకంతో చావొద్దూ!"

"దానికూడా విరుగుడు చెప్తాలే!"

"యేమిటదీ?"

"పెద్ద కష్టమేమీ కాదులే, నువ్వు ముందు మహామ్మ దీయ మతం పుచ్చుకో!"

తేజసింహుడు నవ్వి "సరే బాబూ! నడువు"అన్నాడు.

ఇద్దరూ రాతిద్వారం దగ్గరికి చేరుకున్నారు. తేజసింహుడు ముందు మొదటి విధంగానే పెద్దపులినోట్లో నాలుక బయటికి లాగాడు. ఆ తర్వాత రెండో తాళం తియ్యటం ప్రారంభించాడు.

ద్వారానికి రెండువైపులా రెండు పాలరాళ్ళు గోడలో అమర్చి వున్నాయి. కుడివైపు పాలరాతిని తేజసింహుడు లాగి తన్నాడు. ఆ వెంటనే పెద్ద ధ్వనివచ్చి ఆ రాయి గోడలో దిగబడి భూమితో సరిసమానంగా వెళ్ళిపోయింది. అక్కడ

ఒక అరుగుమీద పాము చుట్టచుట్టుకొని కూర్చొంది. దాని మెడ పట్టుకుని గుండ్రంగా తిప్పేసరికి తలుపు తెరుచుకుంది. మహారాణి మాట తీసుకొని తేజసింహుడు లోనికి ప్రవేశించాడు. జ్యోతిష్కుడుకూడా లోనికి వెళ్ళాడు. లోపలనుండి ద్వారాన్ని మూశేశాడు. దర్వాజాకు లోపల ఎడమప్రక్క గోడలో చెయ్యిదూరే సందుగల కన్నం వుంది. దానిలో తేజసింహుడు చెయ్యిదూర్చి ఏదో చేశాడు. ఆ సంగతేమిటో పండితునికి తెలియక "అందులో యేముంది?" అని అడిగాడు.

"దీనిలో ఒక మర వుంది. దాన్ని తిప్పితే నేను తన్నిన రాయి మూసుకుంటుంది. మళ్ళా తెరవాలంటే తిరిగి బయట చేసినట్లు గానే చెయ్యాలి" అన్నాడు తేజసింహుడు.

వాళ్ళిద్దరూ మైదానంలో ప్రవేశించి మహారాణికి స్పృహ తెప్పించారు. ఆమె వారి వెంట నడిచింది.

"చంద్రకాంత యెక్కడ" అని అడిగాడు తేజసింహుడు.

"ఇంతకుముందు నేనెప్పుడూ యీ చోటంతా తిరిగి చూడలేదు. "మీరు ముందు మహారాజును వెతకండి. చంద్రకాంతకూడ కన్పిస్తుంది" అన్నాడు పండితుడు.

దూరాన శివదత్తుడు సెలయేటి అవతలగట్టున నిలబడి పైకి చూస్తున్నాడు. రాణి, మహారాజుని చూచి పిచ్చిదానిలా ఆ సెలయేటికి అడ్డంపడి అవతలగట్టుకు చేరి మహారాజు కాళ్ళపై బడింది. శివదత్త మహారాజు భార్యను లేవనెత్తి హృదయానికి చేర్చుకున్నాడు. అంతలో తేజసింహుడు, జ్యోతిష్యుడుకూడా రాజుదగ్గరకు చేరుకున్నారు.

రాజు జ్యోతిష్యునిచూచి "నీవుకూడా బంధించ బడ్డావా? ఏమిటి" అన్నాడు. "కాదు. నేనిప్పుడు వీరేంద్రుని పక్షాన చేరాను" అన్నాడు. ఆ మాట రాజుకి కోపకారణ మైంది. యింతలోనే ".తేజసింహా" అని వినవచ్చింది. తేజసిం హుడు అటు చూచాడు. అక్కడ చంద్రకాంత వుంది. అతనికి కళ్ళనీళ్ళు వచ్చాయి. ఆమె పర్వతం మీాద ఒక చిన్న గుహ బైట నిలబడివుంది. తేజసింహునికి ఆ పర్వతం మీాదికి వెళ్ళ టానికి దారి దొరకలేదు. అతడు తాడుచుట్టను విసిరాడు. దానిపొడుగు చాలలేదు. జ్యోతిష్యుని తాడుచుట్ట కలిపాడు. అప్పటికీ సగందూరమే వచ్చింది. తేజసింహుడు చేసేదిలేక "మీా రిక్కడికి యెట్లా వచ్చారు ?"అని కేక వేశాడు. ఆ కేక ఆమెకు వినిపించింది. కాని ఆమె సమాధానం మాత్రం "...అదృష్టం ...వచ్చాను...ఏదైనా...తియ్యి...!" అని అస్పష్టంగా విని పించింది.

తేజసింహుడు ఆమెకు సమాధానంగా "మీారు భయ పడకండి. మిమ్మల్ని క్రిందకుదించే వుపాయం చూస్తాం" అని కేక వేశాడు. అందుకు ఆమె సమాధానం ఇవ్వలేదు. దగ్గరిలో వున్న వెడల్పాంటి ఆకు తీసుకొని దానిమీాద మొనతేలిన రాయితో ఏదో వ్రాసి ఒక గుడ్డముక్క చించి రాతితో కలిపి ఆ ఆకును కట్టి క్రిందకు విసిరింది. తేజసింహుడు దానిని తీసుకొని "నీవు వెళ్ళి మొదట రాజకుమారుని ఇక్కడకు తీసుకొని రా" అని వ్రాసివుండటం చదువుకున్నాడు.

తేజసింహుడు ఆ సంగతి జ్యోతిష్యునికి చెప్పి అతనిని రాజకుమారిని దించే ప్రయత్నం ఏదైనా చేయమని తాను వీరేంద్రుని తీసుకొని రావటానికి వెళ్ళాడు.

యీ సంగతంతా మహారాణి చూచింది. కానీ తేజసింహుడు యెక్కడికి వెళ్ళిందీ తెలియలేదు. తేజసింహుడుమాత్రం బైటికివెళ్ళి రాతిద్వారాన్ని మూసి విజయగఢకు వెళ్ళిపోయాడు.

# 19

విజయగఢలో చంద్రకాంత అదృశ్యమైపోయిన నాటి నుంచి జయసింహమహారాజు చింతాక్రాంతుడై వున్నాడు. విజయగఢ రాజ్య ప్రజలందరూ అదే చింతలో వున్నారు.

దేవీసింహునితో కలసి రాజకుమారుడు విజయగఢ చేరుకున్నప్పుడు అందరూ యిక రాజకుమారికూడా రాగలదని ఆశతో వున్నారు.

ఒకనాటిరాత్రి రాకుమారుడు తన గదిలో నిద్రపోతు న్నాడు. అతనికి రాజకుమారి తలపుకువచ్చి నిద్రాభంగ మైంది. అప్పుడు బైటనుండి "రాజకుమారిమీద వీరేంద్రుని ప్రేమంతా నటన. అతనికి కావలసింది విజయగఢ రాజ్యం మాత్రమే, లేకపోతే రాజకుమారిని యెందుకు వెతకడూ ?" అనే మాటలు వినిపించాయి. ఆ మాటలు బహుశా అక్కడి కావలావారివి కావచ్చు. అదే అభిప్రాయం రాజుకి, రాణికి వుందని భావించిన వీరేంద్రుడు ఇక విజయగఢలో వుండటం

మంచిదికాదనుకున్నాడు. నాగఢకు వెళ్ళటం అంతకంటే మంచిది కాదనుకున్నాడు.

మరునాటి ఉదయం గుఱ్ఱమెక్కి కోటబైటికి వచ్చాడు. దేవీసింహుడు కూడా వెంటవున్నాడు. అతనికి ఈ ప్రయాణం ఎక్కడికో అర్థంకాలేదు. కొంతదూరం వెళ్ళిన తరువాత రాకుమారుడు దేవీసింహుడు కూడా తనతో కలసి రాకుండటానికి గుఱ్ఱాన్ని బాగా పరిగెత్తించాడు. దేవీసింహుడు నడవటంలో ఏమాత్రం తక్కువ తిన్నవాడుకాదు. గుఱ్ఱాన్ని విడిచిపెట్టలా. దానికి తగ్గట్టు దోవ సరిగ్గాలేక వీరేంద్రుని గుఱ్ఱం కూడా అంత ఎక్కువగా పరిగెత్తలేకపోయింది.

దేవీసింహుడు బాగా అలసిపోయాడు. రాకుమారునికి తనకోసం ప్రాణానికి ప్రాణం యివ్వగలిగిన దేవీసింహునిమీద దయగలిగింది. అతనిని కష్టపెట్టటం మంచిదికాదనుకున్నాడు. నవ్వాడు. దేవీసింహుడు అదిచూచి "ఏమిటో చెప్పండి" అన్నాడు.

రాకుమారుడు గుఱ్ఱాన్ని దిగి దాన్ని మేతకి వదిలి కూర్చున్నాడు. దేవీసింహుడు అతని ప్రక్కనే కూర్చున్నాడు. రాత్రి జరిగిన విశేషమంతా దేవీసింహునికి రాజకుమారుడు తెలియచెప్పి "రాకుమారి దొరకనంతవరకు విజయగఢకుగాని నాగఢకుగాని వెళ్ళను." అని అన్నాడు.

"ఆవిధంగా మీరనుకోవటం పొరపాటు. మాకంటె మీకెక్కువ విషయాలు యేమితెలుస్తాయి! ఒక ప్రక్కన మన వాళ్ళిద్దరూ ఆమెను వెతుకుతూనే వున్నారు. అవసరమైతే నేనుకూడా వెళ్తాను. మీకు విజయగఢలో వుండటం యిష్టం

లేకపోతే నౌగధలో మీయింటివద్దయినా వుండండి. ఇప్పుడు మీరు మాయింటి సమీపానికూడా వచ్చారు." అన్నాడు దేవీసింహుడు. అతనికి దూరాన్నుండి యెవరోవస్తున్న జాడ తగిలి అటుదిక్కుగా చూచాడు.

తేజసింహుడు దగ్గిరికి వచ్చేసరికి గుర్తుపట్టి "అరే; ఈ తేజసింహుడెక్కడనుంచి వస్తున్నాడు! యేదైనా జాడ తెలిసిం దేమో!" అన్నాడు దేవీసింహుడు.

రాకుమారుడు తేజసింహుడు వచ్చేవరకూ కూడా ఆగ లేక ఎదురువెళ్ళాడు. తేజసింహుడు కలియటంతోటే "యేమైనా తెలిసిందా?" అని ప్రశ్నించాడు.

"తెలిసింది"

"ఎక్కడ?"

"పదండి చూపిస్తాను."

తేజసింహునివార్త రాకుమారునికి మహదానందాన్ని కలిగించి అతనిని కౌగలించుకొని "పద చూద్దాం" అన్నాడు.

దేవీసింహుడు గుర్రాన్ని సిద్ధంచేసి రాకుమారుని ముందుకు దారితీశాడు. తేజసింహుడు, దేవీసింహుడు ముందు నడుస్తున్నారు. కొద్దిసేపట్లోనే వారు గుహచేరుకున్నారు. తేజ సింహుడు "మీముందే తలుపు తీస్తున్నాను. జాగ్రత్త మాయ గాళ్ళకు తెలయనిచ్చేరు!" అని తలుపు తెరచి ముగ్గురూ లోనికి వెళ్ళారు. జ్యోతిషపండితుడు కూర్చున్నచోటుకి వెళ్ళి వేలెత్తి పర్వతంమీదకు చూపుతూ "అదుగో చంద్రకాంతనిలబడివుంది చూడండి" అన్నాడు తేజసింహుడు.

అక్కడ చంద్రకాంత రాకుమారుడు రావటం గమ నించి అతనిని కలవాలని ఆతురతపడుతోంది. ఆ దేవపరిస్థితుల్లో రాకుమారుడుకూడా వున్నాడు. పర్వతంమీదికి యెగబ్రాక టానికి ప్రయత్నించాడుగాని లాభంలేక పోయింది. అక్కడే నిలబడి పోయాడు. ఆమె శిఖరాగ్రాన వుంది. ఇద్దరిచూపులూ కలిశాయి. ఇద్దరూ కన్నీరు కారుస్తున్నారు. ఏసౌందర్య రాశికోసం ఇట్లా వాక్కువిడిచి ప్రాణాన్ని తృణప్రాయంగా భావించి యుద్ధానికి తలపడి రక్తపాతానికి ఒడిగట్టాడో ఆరాజ కుమారి నేటికి లభ్యమైనా గాని దూరంగానే వుండిపోవలసి వచ్చింది. కనీసం తనివితీర మాట్లాడుకొనే యోగ్యతకూడా కరువైంది. ఆబాధ యెంత తీవ్రంగా వుంటుందో అనుభవిస్తున్న వాళ్ళకు తెలుస్తుంది.

"మీరేమైనా ఉపాయం ఆలోచించారా?" అని జ్యోతిష్యుని ప్రశ్నించాడు తేజసింహుడు.

"యేమాలోచిస్తాం. ఆమెను క్రిందకు దించటం సాధ్య మయ్యే పనికాదు. ఆమె అక్కడికి యెటునుంచి వచ్చిందో అటునుంచే తిరిగిరాగలదు. ముందావిషయం తెలుసుకోండి." అన్నాడు జ్యోతిష్యుడు.

దానిమీదట తేజసింహుడు చంద్రకాంతకు తాను యెటు దిక్కుగా అక్కడి చేరిందీ ఆకుమీద వ్రాసి తెలియ జేయవలసిందిగా అరిచి చెప్పాడు. చపల చీకటి గృహములోకి దిగింది. భూగర్భంలో ఒక విశాలమైన గదివుంది. ఆ గదికి తలుపులు లేకుండా ద్వారంవుంది. ఆమె జాగ్రత్తగా లోనికి ప్రవేశించింది. ఆమెలోనికి ప్రవేశించటంతోటే పైభాగంలో

వున్న మధ్య లోహపు తలుపొకటి మూసుకపోయింది. ఆమె వెనక్కు తిరిగి చూచింది. వాకిలి మూసుకొనిపోయింది. ఇక ఆమెకు ఎక్కడికి వెళ్ళటానికి మార్గంలేదు. కటిక చీకటి. ఆమె ఆ చీకటిలో అటు, ఇటు తిరిగింది. ఆ తిరగటంలో ఆమె ఒక గోతిలో పడిపోయింది. ఆ వెంటనే ఆమెకు ఒక తలుపు తెరుచుకొన్న శబ్దం వచ్చింది. వెలుగుకూడా వచ్చింది. ఆ తెరుచుకొన్నది మొదటి దర్వాజాకాదు. ఇది మరొకటి. ఆమెదగ్గరకు వెళ్ళి చూచింది. దానికి తలుపులున్నట్లు ఏమీ కనుపించలేదు. దానిగుండా ఆమె ఒక తోటలో ప్రవేశించింది. ఆ తోటలో రంగు రంగుల పువ్వులు వికసించివున్నాయి. తోటకు ఒకవైపునుండి నీళ్ళు పారుతున్నాయి. యెదురుగా ఒక మండపం కనుపించింది. చపల అక్కడకు చేరింది.

ఆ మండపం నల్లరాతితో తయారుచేయబడింది. స్తంభాలు, పైకప్పు, క్రిందిభాగం అంతా నల్ల రాతితో చేయబడింది. ఆ మండపంలో పాలరాతి సింహాసనంమీద ఒక చతురస్రాకారంలో వున్న రాయి పెట్టబడివుంది దానిమీద "ఇదొక వ్యూహం. దీనిలో చిక్కుకున్నవాళ్ళు ఎప్పటికీ బైటికి వెళ్ళలేరు. ఎవరైనా దీనిని ఛేదిస్తే ఖైదీలు విడుదలై సంపద చేజిక్కుతుంది. దీనిని ఛేదించటానికి శరీరంలో బలంకావాలి. లేకపోతే వృథాప్రయాస" అని వ్రాసివుంది.

దానిని చదవటంతోటే చపలకు తాను చచ్చిపోయానని పించింది. బైటికి వెళ్ళటానికి మార్గంలేదు. పూర్తిగా బైట వున్న తలుపును తాడుతో కట్టటడం వ్యర్థమైంది. ఆమె యీ తోటలోనికి ప్రవేశించిన ద్వారం మాత్రం తెరుచుకొనివుంది.

చవల తిరిగి ఆ ద్వారంవైపుకు వెళ్ళింది. అక్కడ ద్వారచిహ్నాలేమీ లేవు. ఆమెకు ద్వారం ఎక్కడవున్నదో కనిపించలేదు. తిరిగి ఆమె మండపం దగ్గరికి వెళ్ళింది. సింహాసనంమీద వున్న రాయిని ఎత్తాలనుకుంది. ఆమెకు బైటకి వెళ్ళగలిగితే ఆ రాతిని వెంటతీసుకవెళ్ళి జనానికి దానినిచూపించాలని కోరిక. ఆమె రాతిని లేపటానికి వంగినదో; లేదో చెయ్యి రాతికి తగిలినదో, లేదో వెంటనే తల తిరిగి స్పృహతప్పి పడిపోయింది.

ఆమెకు సాయంకాలానికిగాని స్పృహ రాలేదు. లేచి కాళ్ళు, ముఖం కడుగుకున్నది. ఆ తోటలో ద్రాక్షవళ్ళు విపరీతంగా వున్నాయి. కాని భయంవల్ల చవల వాటిని ముట్టుకోలేదు. తిరిగి మండపం దగ్గరకు వచ్చింది. చీకటిపడినకొద్దీ ఆ మండపం మెరిసిపోవటం ప్రారంభించింది, ఆ మెరుపువల్ల తోటకుకూడా కొంతవెలుగువచ్చింది. చవల మంటపం స్థంబాల మీద నేలమీద ఎందుకు మెరుస్తుందా అని చెయ్యివేసి చూచిందిగాని ఆమె కేమీ తెలియలేదు. ఆశ్చర్యం భయం. నిరాశ చవలను నిద్రపోనియ్యలేదు. రాత్రంతా మేలుకొనే వుంది.

తెల్లవారింది. చవల తోటలో తిరగసాగింది. తోటలోనికి నీరు వచ్చే తూముదగ్గరవున్న గోడదగ్గరకు వెళ్ళింది. ఆ తూముగుండా మనిషి గోడ దాటిపోవచ్చు. చవల గుడ్డలతోపాటు తూములో ప్రవేశించింది. అవతల వైపుకి వెళ్ళింది. అక్కడ చవల తన గుడ్డలను ఆరవేసుకొంది. తన మాయాజాలం సంచి మాత్రం తడవలేదు. అది మైసథ

గుడ్డ. అక్కడనుంచి చపల బయలుదేరింది. రెండువైపుల ఎత్తయిన పర్వతాలు మధ్యగా కాలువ దాని వొడ్డున పారిజాత చెట్లు ఉన్నాయి. పర్వతాలమీదికి ఎక్కటానికి దారిలేదు. చపల కాలువ తీరాన నడక సాగించింది. మధ్యాహ్నమయ్యేసరికి మూడుకోసులు నడిచింది. ముందుకు వెళ్ళటానికి దారి దొరక లేదు. ఎదురుగా ఒక పర్వతం దారిని అడ్డగించింది. కొండ దిగువ భాగాన ఒక చావడి ఉంది. దానివెడల్పు ఒక గజం. పొడవు పదిగజాలు. జాగ్రత్తగా పరిశీలిస్తే దానిని కొండ తొలిచి నిర్మించినట్లుగా తెలియగలదు. ఆ చావడి మధ్యస్థంగా ఒక రాతితో చెయ్యబడిన కొండచిలువ ఉంది. దాని నోరు తెరచుకొని ఉంది. దాని పొట్టలోనికి మనిషి తేలిగ్గా వెళ్ళ వచ్చు. ఎదురుగా ఒక పెద్ద పాలరాయి భూమిమీద పరచబడి ఉంది.

కొండచిలువను చూడటానికి చపల ఎదురుగా వెళ్ళింది ఆ పాలరాయిమీద చపల అడుగుపెట్టటంతోటే గాలి లోనికి పీల్చటం ప్రారంభించింది. ఆపీల్చటం వేగం హెచ్చినకొద్దీ చపల పాలరాయిమీద కాలు నిలవలేకపోయింది. ఒక గడ్డిపూచ యెగిరినట్లుగా యెగిరి చపల దానిపొట్టలో పడిపోయి స్పృహ లేకుండా అయిపోయింది.

చపల స్పృహవచ్చిన తర్వాత చూస్తే తానొక పది పన్నెండు మంది కూర్చోగలిగినంతటి గదిలో వున్న ట్లుగా తెలిసింది. ఆ గదికి ప్రక్కగా పైకి వెళ్ళటానికి మెట్లున్నాయి. చపల యీ అద్భుత విషయాలనన్నిటిని గురించి ఆలోచిస్తూ కూర్చుండిపోయింది. ఆఖరికి మెల్ల

మీదగా పైకి ఎక్కిపోయింది. ఆ వెంటనే మెట్లవాకిలి మూసుకొని పోయింది. ఇక క్రిందకు దిగటానికి వీలు లేదు. అక్కడ నలుదిక్కులా పర్వతాలున్నాయి. ఎదురుగా ఒక గుహ కనిపించింది. ఆ గుహ అంత చీకటిగా లేదు. కొద్దిగా యెక్కడనుండో సన్నని వెలుగు ప్రసరిస్తున్నది.

చపల చేసేదిలేక ఆ గుహలో ప్రవేశించింది. కొద్ది దూరం వెళ్ళేసరికి ఒక చావడి మోస్తరుగా కనిపించింది. అక్కడ రాజకుమారి, చంద్రకాంత పెద్ద పెద్ద ఆకులు ముందు వేసుకొని కూర్చొని మొనతేలినరాయితో ఏదో వ్రాస్తూ ఉండటం చూచింది. క్రిందకు వంగిచూస్తే ఒక పెద్ద లోయగా కనిపించింది. అక్కడనుండి దిగటానికి మార్గాలు లేవు. ఆ క్రింద వీరేంద్రసింహుడు, తేజసింహుడు, జ్యోతిషవండితుడునిలబడి పైకి చూస్తుండటం కనిపించింది.

రాజకుమారి చెవులకు చపల అడుగుల చప్పుడు విని పించింది. ఆమె తలయెత్తిచూస్తే నిజంగానే చపల! త్వరగాలేచి నిలబడి "భలే సమయానికి వచ్చావ్ చపలా! చూచావా క్రింద మన వాళ్ళందరూ నిలబడివున్నారు. కాని క్రిందకు వెళ్ళటానికి వుపాయం తోచకుండావుంది. వాళ్ళు మాట్లాడిన మాటలు యిక్కడకు వినిపిస్తున్నాయి. గాని మన మాటలు వాళ్ళకు వినిపించటంలేదు. తేజసింహుడు యిక్కడకు నే నెట్లా వచ్చానో చెప్పమని అడిగాడు. దాని సమాధానంగా నేను యీ ఆకులమీద వ్రాస్తున్నాను. వీటిని క్రిందకు విసురుతాను" అన్నది.

చపల కొంచెంసేపు బాగా ఆలోచించింది. ఆమెకు యెటు వెళ్ళటానికీ మార్గం తోచలేదు. 'ఆకులమీద వ్రాయవలసిన అవుసరంలేదు. నేను గట్టిగా అరిచి చెప్పితే వాళ్ళకు వినిపిస్తుందిలే!" అన్నది చపల. ఆ తర్వాత యిద్దరూ యేవిధంగా అక్కడకు చేరుకున్నదీ పరస్పరం చెప్పు కున్నారు. వాళ్ళకు ఎవరెంత ప్రయత్నించినా త్వరలో బయటపడతామనే ఆశ అంతగా కనిపించ లేదు.

# 21

రాజకుమారి దగ్గరకువచ్చి చపలను క్రిందవున్న వారం దరూ చూచారు. ఆమె శివదత్తుడు తమను బంధించిన గుహాకి రమారమి యేడుకోసులు దక్షిణంగావున్న శిథిలగృహం దగ్గర నుంచి యిక్కడవరకు తాము చేరుకున్న విధివిధానాన్నంతా పూసగ్రుచ్చిన ట్టు దగ్గరగా అరిచి చెప్పింది.

చపల చెప్పిన విశేషాలనన్నిటిని క్రింద నున్నవారు స్పష్టంగా వినగలిగారు. రాకుమారునికి చంద్రకాంతకు కలిగిన కష్టాలు విన్నమీదట శివదత్తునిపై పట్టరాని కోప మొచ్చింది. వెంటనే కత్తిదూసి అతని మీదికి లంఘించాడు. అక్కడేవున్న మహారాణి ముందుగా తనను చంపమని తాను వైధవ్యాన్ని అనుభవించలేనని అర్థించింది. తేజసింహుడు రాకుమారుని నివారించి మొదట శిథిలగృహం దగ్గరికి వెళ్ళవలసిన అవస రాన్ని గురించి నొక్కి చెప్పాడు. చపలతో "రాకుమారిని జాగ్రత్తగా చూడవలసింది"గా బిగ్గరగా అరిచి చెప్పాడు.

"ఫరవాలేదు గాని; మీరు మాత్రం జాగ్రత్తగా శిథిల గృహంలోని వ్యూహాన్ని ఛేదించండి. అక్కడ రాకుమారుని అవసరంకూడా వుంటుందని నా వుద్దేశం. మీరు వారినికూడా వెంటపెట్టుకుని వెళ్ళండి" అని చపల తేజసింహునికి ప్రతి సమాధానమిచ్చింది.

అక్కడనుంచి నలుగురు కలసి బైటకు వెళ్ళారు. దేవీ సింహునికి యీ విశేషాలు చెప్పటానికి ముందుగా నాగఢ వెళ్ళి అక్కడనుండి విజయగఢకు రమ్మన్నారు. విజయగఢలో తాము దేవీసింహునికొరకు ఎదురు చూస్తూవుంటామని కూడా చెప్పారు.

సాయంకాలానికి రాజకుమారుడు విజయగఢ చేరు కున్నాడు. అక్కడ వుదయంనుంచి రాజకుమారుడు కనుపించక తల్లడిల్లి పోతున్న జయసింహ మహారాజుకు కొంతవూరట కలిగింది. తేజసింహుడు మహారాజుకు అంతవరకు జరిగినసంగతి సందర్భాలు వివరించి చివరికి తాము వ్యూహాన్ని ఛేదించటానికి వెళ్ళుతున్నట్లుగా చెప్పారు. మహారాజుకూడా వెంట వస్తా నన్నాడు. "మీరు రావలసిన అవసరం లేదు. కొద్దిగా సైన్యం ఇస్తే"చాలు అన్నాడు. "సరే కానీ నాకుకూడా వ్యూహాన్ని చూడాలని వుంది" అన్నాడు రాజు. "సరే మీ ఇష్టం" అన్నాడు తేజసింహుడు. మహారాజు మంత్రిని తమ సైన్యంలో సగభాగాన్ని రాజకుమారుని సైన్యాన్ని పూర్తిగాను సంసిద్ధం చేయుమని ఆజ్ఞాపించాడు. రాజాజ్ఞ మేరకు అన్ని

యేర్పాట్లు జరిగాయి. మరునాడు నాగధనుంచి దేవీసింహుడు కూడా వచ్చాడు. అన్ని ఏర్పాట్లతోను వ్యూహాన్ని ఛేదించటానికి చునారుగఢ దిక్కుగా ప్రయాణం ప్రారంభమైంది.

## 23

ఐదవనాటికి సైన్యాలు చునారగఢ సరిహద్దుకు చేరుకున్నాయి. శివదత్తుని మంత్రి యీ దండయాత్రకు హడలిపోయి కానుకలతో జయసింహుని కలుసుకోటానికి వచ్చాడు. మహారాజా మేము దండయాత్రకు కాదు, వేరేపనిమీద వచ్చామని తెలియజేశాడు.

శివదత్తుని మంత్రికి జయసింహుడు వచ్చిన కారణం తెలిసి తిరిగి వెళ్ళిపోయాడు. ఇంతవరకు ఆ వ్యూహం సంగతి ఎవరికీ తెలియదు. అసలా శిథిలాగృహాన్ని ఎవ్వరూ చూడలేదు కూడ. ఇప్పుడీ సంగతి అందరికి తెలిసి వీరేంద్రుడు వ్యూహాన్ని ఛేదిస్తాడట అని చెప్పుకోసాగారు. శిథిల గృహ వ్యూహం ఎక్కడ వున్నదీ తెలుసుకోటానికి నలుదిక్కులకు రహస్య పరిశోధకులను పంపించారు. తేజసింహుడు, దేవీసింహుడు, జ్యోతిష పండితులుకూడా వెళ్ళారు. ఆఖరుకు అది ఎక్కడ వున్నది తెలుసుకొన్నారు. అక్కడ అంతా డేరాలు వేసి మకాం వేశారు. జయసింహుడు, రాజకుమారుడు, తేజసింహుడు, దేవీసింహుడు, జ్యోతిషపండితుడు శిథిలగృహంలో ప్రవేశించారు.

ఐదుగురూ లోపల ప్రవేశించగానే, వారికి అది నిజంగానే వ్యూహం వలెనే కనిపించింది. జాగ్రత్తగా పరిశీలిస్తూ

అందరూ తోటలో ప్రవేశించారు. అక్కడ ఒక జాలి వృక్షం ఉన్నది. దాని వైచిత్ర్యం అందరినీ సంభ్రమపరిచింది. అక్కడ నుంచి చవల సూచనల ప్రకారం చీకటి గృహ ద్వారం దగ్గరకు ప్రవేశించారు. దాని తలుపులకు చవల కట్టిన త్రాడు తేజసింహుడు చూచాడు. ఆ తర్వాత వింతబావీ, రాతి మానిసి వైచిత్ర్యమూ కూడా గమనించారు.

తేజసింహుడు ఆ అరుగుమీది మెట్లపై కాలు పెట్టటం తోనే ఆ మెట్టుమీద రాయిలేచి అతన్ని క్రిందికి పడత్రోసింది. అతని పరిస్థితి రాకుమారునికి నవ్వు పుట్టించింది, గాని దేవీసింహునికి మాత్రం కోపం కలిగించింది. అతడు "దీనిమీద పండుకున్న జాతిమానిసిదే ఈ పని అంతా" అని గభాలున అతని నెత్తిమీద ఒక దెబ్బ కొట్టాడు. ఆ దెబ్బతిన్న జాతిమనిషి లేచి కూర్చుని నోరు తెరిచాడు. ఉప్పెనలాగా అతని నోటినుంచి గాలి రాసాగింది. కొంత సేపటిలో ఒక పెద్ద ధ్వనివచ్చి శిథిల గృహం యావత్తూ ఊగిసలాడింది. అందరికీ అది భూకంపమూ అనిపించింది. జ్యోతిష్యుడు "తొందరగా బైటికి పదండి. ఇక్కడ ఉండటం మంచిదికాదు" అని హెచ్చరించాడు.

ఒక వసారాలోనుండి మరో వసారాలోకి అందరూ పారిపోయారు. పారిపోయే సమయంలో భూమి కంపిస్తున్న కారణంగా ఎవరికాళ్ళూ భూమిమీద నిలవలేదు. అందరూ శిథిల గృహానికి దూరంగా నిలబడి దానిని చూడటం ప్రారంభించారు. శిథిల గృహం యావత్తూ ఊగిసలాడటం బయట ఉన్న సమస్త సైన్యం అవలోకించింది. రెండు గంటలవరకూ ఆ విచిత్ర సంఘటన కొనసాగి చివరకు ఆగిపోయింది.

జ్యోతిషికుడితో తేజసింహుడు "మీరు గవ్వలు వేసి గుణించి ఈ వ్యూహ భేదనోపాయం తెలుసుకోండి" అన్నాడు.

జ్యోతిషుడు "ఈ రోజల్లా మీరు ఓపికపట్టండి. రాత్రికి నేను గణితంకట్టి దీని వ్యవహారం తేల్చుకుంటాను. రేపు దాని వ్యవహారం చూడవచ్చు. కాని ఇక్కడమనముండటం చాలా రోజులు పట్టేట్టుంది. అంతవరకూ మన మహారాజు ఇక్కడ వుండటం భావ్యంకాదు. శ్రీవారిని విజయగఢానికి పంపించటం మంచిది" అన్నాడు. అతని అభిప్రాయాన్ని అందరూ ఆమోదించారు.

యువరాజు "మీరు శిథిల గృహాన్ని చూడదలచారు. చూడటమైపోయింది. ఇక మీరు ఇక్కడ ఉండటం నాకు కూడా మంచిదిగా కన్పించటం లేదు" అన్నాడు రాజుతో.

మహారాజుకు విజయగఢానికి వెళ్ళటం ఇష్టంలేదు. అయినా అందరి ఒత్తిడిని అంగీకరించక తప్పలేదు. తనతో వచ్చిన సైన్యంలో సగభాగం మాత్రం వెంటతీసుకొని మహారాజు విజయగడానికి వెళ్ళిపోయాడు.

## 24

జగన్నాథ జ్యోతిషికుడు రాత్రిఅంతా గణితశాస్త్రాన్ని తిరగవేస్తునే ఉన్నాడు. రాకుమారుడూ, తేజసింహుడూ, దేవీసింహుడూ అతనిదగ్గరే కూర్చున్నారు. అన్నివిషయాలూ పర్యాలోకనం చేసిన పిమ్మట "ఈ వ్యూహాన్ని భేదించే జ్యోతిషికుడు విధివిధానం ఈ శిథిలగృహంలోనే ఒకచోట

రాతిమీద చెక్కి ఉన్నది. దానిని వెదకి తెస్తే సంగతి సంద ర్భాలు బైటపడగలవు. స్నాన సంధ్యాదులు ముగించి యీ వ్యూహంలో తిరిగితే ఆ రాయి సంగతి బైటపడుతుంది" అన్నాడు.

పనులన్నీ ముగించుకొని మధ్యాహ్నానికి వారందరూ శిథిల గృహంలో ప్రవేశించారు. అందరూ రాతి మానిసిఉన్న చోటికి వెళ్ళారు. ఆ శిలామయనరుడు నిద్రపోతున్నట్టుండటం చూచారు. జ్యోతిషికుడు తేజసింహునితో చపల యీ రాళ్ళను ఒకదానిపై ఒకటి పెట్టి పైకియెక్కి చూచిందికాబోలు! నువ్వు కూడా ఈ రాళ్ళగుట్టమీద ఎక్కి ఆ మానిసి చేతిలోని పుస్త కంలో ఏమి వ్రాసి ఉన్నదో చూడు" అన్నాడు.

తేజసింహుడు ఆవిధంగానే రాళ్ళగుట్టమీదకు ఎక్కి పుస్తకాన్ని పరీక్షగా చూచాడు. ఆ పుస్తకంలో—

8 కోణం—5—అంకె

6 చెయ్యి—3—వేలు

మొత్తం కూడి—0—కల్పి, సరైనకొలతతో విరగగొట్టుఅని ఉన్నది.

తేజసింహుడు జ్యోతిషుడికి ఆ పుస్తకంలో ఉన్న విశే షం చెప్పి 'దాని వివర మేమిటో తెలియటంలే'దన్నాడు.

· జ్యోతిషికుడు "అదే తెలుస్తుందిగాని ముందు కాగితం మీద నకలు తీసుకో" అన్నాడు. తేజసింహుడు ఆ విధంగా కాగితం, కలం తీసి ఆపుస్తకంలోని విషయాన్ని యథాతథంగా వ్రాసికొన్నాడు.

జ్యోతిషికుడు "ఇక మనం ఈ ఇంట్లో తిరిగి అష్టకోణ బద్ధమైన స్థంభం కాని, లేక అరుగుగానీ ఎక్కడైనా ఉందేమో చూడాలి." అన్నాడు. అందరూ ఆ ప్రకారం వెదకటం ఆరంభించారు. తిరుగుతూ, తిరుగుతూ చీకటి గృహం ఉన్న వసారాలో ప్రవేశించారు. అక్కడ తమో గృహాలోకి రావడానికి త్రాటితో బంధితమైన స్థంభాన్ని చూచాడు. దానికి ఎనిమిది కోణాలూ ఉన్నవి. ఆ స్థంభంమీద కప్పులేదు. జ్యోతిషుకుడు యీ స్థంభం ఎన్ని చేతుల పొడవుందో కొలవాలి" అన్నాడు. తేజసింహుడు కొలిచాడు. దాని పొడవు ఆరు చేతుల యేడు వ్రేళ్ళు ఉన్నది. దేవీసింహుడు కొలిస్తే ఆరుచేతుల అయిదువ్రేళ్ళు ఉన్నది. జ్యోతిషికుడు కొలిస్తే ఆరుచేతుల పదివ్రేళ్ళంత ఉన్నది. రాజకుమారుడు కొలిస్తే ఆరుచేతుల మూడు వ్రేళ్ళంత ఉన్నది.

జ్యోతిషికుడు చాలా సంతోషించి "ఈ స్తంభాన్ని గురించే పుస్తకంలో వ్రాసి ఉన్నది. దీనిక్రిందే ఆ జాతినికూడా పాతి ఉంటారు. ఈ వ్యూహాన్ని రాజకుమారుడే భేదించగలడని కూడా విదితమైనది. ఎందుచేతనంటే, ఆ పుస్తకంలో వ్రాసి ఉన్న ప్రకారం దేవీసింహుని చేతితో దీనికొలత ఆరుచేతుల మూడు వ్రేళ్ళు ఉన్నది. అందుచేత వ్యూహం రాకుమారుడే భేదించాలి. ఇప్పుడు త్రాటిని ఊడదీయాలి" అన్నాడు.

తేజసింహుడు తాటిని వూడదీశాడు. జ్యోతిషికునికి ఇప్పుడంతా తెలిసింది. ఈ స్తంభానికి ఎనిమిది కోణాలున్నవి. కొలతకూడా ఆరుచేతుల తొమ్మిది వ్రేళ్ళంత ఉంది. 'ఇక్కడ ఐదు అంకె కన్పిస్తోంది. ఇక మిగిలింది 'సరైన కొలతతో విరగ

గొట్టు' అన్నది. దీనిని బట్టి యిప్పుడు రాజకుమారుడే దీనిని విరగగొట్టాలని తేలింది'' అని అన్నాడు.

వీరేంద్రసింహుడు అక్కడే ఉన్న పెద్ద రాతిని, గట్టిగా సున్నం బిగిసివున్న పెల్లనూ తెచ్చాడు. ఆ స్తంభాన్ని గట్టిగా రాతిపెల్లతో కొట్టాడు. అది ఊగింది. రెండు మూడు సారులు కొట్టేసరికి బలహీనమైంది. అప్పుడు రాకుమారుడు దానిని రెండు చేతులతో గట్టిగా పట్టుకొని ఊడబెరికాడు. స్తంభం ఊడబెరికినచోట భూమిలో ఒక లోహ నిర్మితమైన పెట్టె ఉన్నది. దానికి తాళంకూడా ఉన్నది. రాకుమారుడు ఆ తాళాన్ని పగలగొట్టాడు. అందులో మరొకపెట్టె ఉన్నది. ఆ ప్రకారం ఆ పెట్టెలోనుంచి ఏడుపెట్టెలు తీశాడు. ఏడవ పెట్టెలోనుంచి ఒకరాయి బైటపడింది. దానిమీద ఏదో వ్రాసి ఉన్నది. రాకుమారుడు దాన్ని చదివాడు. దానిమీద "వ్యూహాన్ని ఛేదించటానికి త్వరపడవద్దు. జాగ్రత్త! ఒకవేళ నీవేను వీరేంద్రసింహుడే అయితే యీ సంపదంతా నీకొరకే. "శిలాపక్షి ముక్కుకు ఎదురుగా నేలమీదపరచిన ఒక పాల రాయి ఉన్నది. అది కేవలం రాయిమాత్రమేకాదు. ప్రేలుడు దినుసు. దానిని పెరికి, మెత్తగా పిండి విసిరినట్లు విసరండి. ఆ పిండిని నీళ్ళలో కలిపి ఆ శిలాపక్షి శరీరానికి పూయండి. ఆ పక్షికూడా ప్రేలుడు దినుసుతో తయారయినదే. రెండు గంటల్లో అది కరిగి కనిపించకుండా పోతుంది. దానికి అడుగున ఉన్న, తీగలూ చక్రాలు అన్నిటినీ నరికివెయ్యి. కింద ఒక గది కనిపిస్తుంది. ఆ గది రాతిపక్షిని తొలగించటంవల్ల వెలుతురవుతుంది. ఆగది క్రిందనుంచి ఒకదారి తూర్పుదిక్కు వస్తా

రాలో నున్న బావిలోనికి వెళ్ళుతుంది. అక్కడకూడా వృద్ధ మానవాకారంలో ఉండే ఒక విగ్రహం ప్రేలుడు దినుసుతో తయారైనది ఉంటుంది. ఆ వృద్ధుని చేతిలో పుస్తకం పుచ్చుకొని కూర్చుని ఉంటాడు. అతని చేతిలోనుండి పుస్తకం తీసుకో. ఆ తీసుకునేటప్పుడు గభాలున తీసుకున్నావా మోసపోతావు. మొట్టమొదట ఆ పుస్తకం కుడివైపు పట్టుకో. అతడు నోరు తెరుస్తాడు. అప్పుడు తన నోటిలో కర్పూరాన్ని కూరు. కొద్ది సేపట్లో అతడు కలిగిపోతాడు. అప్పుడు పుస్తకం తీసుకో. దాని పేజీలు భూర్జపత్రాలతో వుంటాయి. దానిమీద వ్రాసి ఉన్నట్లుగా చెయ్యి!

— విక్రమ్"

అని వ్రాసి ఉంది.

అది అంతా రాకుమారుడు చదివాడు. అందరూ విన్నారు. ఒక గంటసేపు అందరూ ఆ ఇంద్రజాలకర్తను ప్రశంసించారు, సూర్యాస్తమయం అవుతున్న కారణంగా నాటికి పని చాలించారు. ఆ రాత్రి విశ్రాంతి తీసుకొని ఉదయం దిన కృత్యాలు ముగించి తిరిగి వ్యూహం దిక్కుగా వెళ్ళారు.

మనామగధ రాజ్యమంతా ఆ ఇంద్రజాలాన్ని గురించి అందులో చంద్రకాంత, చపల చిక్కుకుని పోవటాన్ని గురించీ వారిని విడిపించటానికి వీరేంద్రసింహుడు సైన్యసమేతంగా వచ్చి వుండటాన్ని గురించీ చెప్పుకోసాగారు.

ఇంద్రజాలమంటే ఏమిటి? అసలా వ్యూహంఎల్లా ఉంటుంది? అందులో మనుష్యులెట్లా చిక్కుకుంటారు?

రాజకుమార వీరేంద్రసింహుడు ఆ వ్యూహాన్ని ఎట్లా ఛేదిస్తాడు? అనే రకరకాల ఆలోచనలతో అక్కడకు దూర ప్రాంతాలనుంచీ, చాలామంది వచ్చి చేరుకున్నారు. కాని భయంతో ఎవరూ లోనికి వెళ్ళటంలేదు. అందరూ బయటే ఉండి వైచిత్రాన్ని పరికిస్తున్నారు.

రాకుమారుని సైనికులు ముసుగు మనుష్యులు తిరుగుతూ ఉండటం చూచి అతనికి తెలియచెప్పారు.

బదరీనాథపండితుడు శివదత్త మహారాజును విడిపించటానికి నాజీం అహ్మద్‌లను వెంటబెట్టుకొని వెళ్ళాడు. చీకటి గృహపు రాతిద్వారం దగ్గఱకు ప్రవేశించి పెద్దపులి నోట్లోకి నాలుకలాగి తలుపు తెఱవాలని ప్రయత్నించారు. కాని తేజసింహుడు మరొకతాళం వేసి ఉండటంవల్ల విఫలులైనారు; అక్కడనుండి విజయగఢానికి చేరుకున్నారు. అక్కడ వీరేంద్రసింహుడు శిథిలగృహం దగ్గరున్నాడని తెలుసుకొని అక్కడికి వెళ్ళారు. వ్యూహాన్ని ఛేదించకుండా చేయాలని ఉద్దేశంతో అక్కడ పన్నాలాల్, రాంనారాయణ, చున్నీలాల్ మారువేషాలతో తిరగటం ప్రారంభించారు.

## 25

మఱునాడు స్నాన సంధ్యాదులు ముగించి రాజకుమారుడు, తేజసింహుడు, దేవీసింహుడు జ్యోతిషుడు, శిథిల గృహంలో ప్రవేశించారు. నిన్న దొరికిన రాతిమీద వ్రాసివున్న దానిని మరొకసారి చదువుకొన్నారు. ఆ ప్రకారం పని

ప్రారంభించారు. శిథిల గృహంచుట్టూ సైనికులు గస్తీ తిరుగు తున్నారు.

జాతిపతిదగ్గఱకు వెళ్ళారు. దాని యెదురుగాఉన్న తెల్ల జాతిమీద కాలుపెట్టగానే అది నోరు తెరిచింది. అరాతిని పెకలించారు. ఆ జాతిని పిండిగాచేసి, రాతిపతికి పూశారు. చూస్తూ చూస్తూఉండగానే అది కఱిగిపోయింది. ఏదో సువా సనకూడా బయలుదేరింది. ఆపతిని అమర్చిన స్తంభంకూడా కఱిగిపోయింది. కింద ఒక గది కనిపించింది. దానిలోనికి మెట్లు న్నాయి. ఆగదినిండా తీగలు, చక్రాలు, సీలలు ఉన్నాయి. వాటినన్నిటినీ నఱికి నలుగురూ లోనికి ప్రవేశించారు. లోపలే నడిచి నడిచి ఒక భావిలోకి చేరుకొన్నారు. అక్కడ ఒక ముసలివాడు పుస్తకం పుచ్చుకొని కూర్చొని ఉన్నాడు.

అతని యెదుట రంగురంగుల శిలాపుష్పాలు అమర్చి ఉన్నవి. ఒకప్రక్కన పట్టుకునేసరికి వృద్ధునినోరు తెఱుచుకుంది. అతనినోట్లో తేజసింహుడు కర్పూరం కూరాడు. ఒక గంటసేపు అందరూ అక్కడకూర్చున్నారు. ముసలివాడు కఱిగిపోయిన తర్వాత పుస్తకం క్రిందబడింది. రాకుమారు డాపుస్తకం తీసు కున్నాడు. ఆపుస్తకం పేజీలు తిప్పి రాకుమారుడు చదవ సాగాడు. దానిలో —

"ఈపూవులనుకూడా తీసుకో! ఇవి నీఇంద్రజాలికులకు పనికివస్తాయి. వీటిగుణం యీపుస్తకంలోనే వ్రాసివుంది. డేరా లోకి వెళ్ళి చదువుకో. యివాళ ఇంకేమీ చేయవద్దు" అని వ్రాసి వుంది.

తేజసింహుడు సంతోషంతో ఆ పూవులను తీసు కున్నాడు. అవి లెక్కకు ఆరున్నాయి. ఆభావిలోనుండి వెను కకు తిరిగి శిథిలగృహం దాటి వచ్చేశారు. అప్పుడప్పుడే సూర్యుడు అస్తగిరిని సమీపిస్తున్నాడు.

వీరేంద్రుడు తన డేరాలో ప్రవేశించాడు. అతనికి ఆ రాత్రి పుస్తకం చదివేయాలనిపించింది. తేజసింహునికి మాత్రం పువ్వులగుణం తెలుసుకోవాలని వుంది. అతడు రాకుమారుని ముందు పువ్వుల గుణమేమిటో చదవమన్నాడు. రాకుమారుడు "ముందు వ్యూహం భేదించేవుపాయం చూడాం. ఆ తర్వాత పూల సంగతి" అన్నాడు. కాని తేజసింహుని బలవంతంమీద రాకుమారుడు పువ్వులవిషయం వ్రాసివున్న పేజీ తీసి చదవ సాగాడు. అక్కడ వాళ్ళు నలుగురూ తప్ప ఎవరూలేరు.

పువ్వుల గుణం :—

1. గులాబిపువ్వు :- దీనిని రుద్ది నీళ్ళలోకలిపి ఎవరిచేత నైనా త్రాగిస్తే అతనిపై ఏడు రోజులవరకూ మత్తు మందేదీ పనిచేయదు.

2. ముత్యాలపువ్వు :- దీనిని రుద్ది ఏదైనా భావిలో వేస్తే మధ్యాహ్నంవరకూ ఆ భావిలో నీళ్ళు మత్తుమందులా పనిచేస్తాయి. ఆ నీటిని త్రాగినవాళ్ళు స్పృహలేకుండా పడి పోతారు. నీళ్ళుతాగిన అరగంటకు కాని మత్తెక్కదు.

ఈ రెండుపువ్వుల గుణాలను చదివేవరకే ముగ్గురు ఇంద్ర జాలికులకి చాల సంతోషం కలిగింది. రాకుమారుడు "ఇవ్వాళకు ఇంక చదవను" అన్నాడు.

అప్పుడు తేజసింహుడు చేతులు జోడించి రాకుమారుని కాళ్ళు పట్టుకొని చదవమని బ్రతిమాలాడు. రాజకుమారుడు వాళ్ళను కొంతసేపు ఊరించి తిరిగి చదవసాగాడు.

3. ఉమ్మెత్తపూవు :- దీనిని నీళ్ళలో కలిపి త్రాగితే నాల్గు రోజులదాకా ఆకలికాదు.

4. గన్నేరుపూవు :- దీనిని నీళ్ళల్లో కలిపి త్రాగితే అలసట, అనారోగ్యం పోతాయి.

5. తంగేడు పూవు :- దీనిని నీళ్ళల్లో కలిపి కళ్ళకు కాటుకగా పెట్టుకుంటే చీకటిలో కూడా సర్వం కనిపిస్తుంది.

6. మొగలిపూవు:- దీనిని నూనెలో కలిపి రాచుకుంటే ఝులుబు పట్టకుండా ఉంటుంది. దీనినే నీళ్ళలో కలిపి రాచుకుంటే వడదెబ్బ కొట్టదు. కాచిన నీళ్ళలో కలిపి ఎవరిచేతనైనా త్రాగిస్తే వారికి ఏడురోజులదాకా ఎటువంటి ఉద్రేకాలూ కలుగవు.

ఆ పూలను తేజసింహుడు సంతోషంతో తన సంచిలో వేసుకున్నాడు. దేవసింహుడూ జ్యోతిషికుడు తమ కిమ్మనిఅడి గారు కాని అతనువాళ్ళకు చూపించనుకూడా చూపించలేదు.

# 26

ఆ పువ్వులను సంపాదించుకున్న తేజసింహుని సంతోషానికి మేరలేదు. అసలే అతడు మాయాజాలంలో అందెవేసిన చేయి. ఇక ఈ పువ్వులుకూడా అతనికి లభించటంతో అతని శక్తి సామర్థ్యాలు అత్యధికమైనాయి. ఇక తేజసింహుని ఎదిరించగలవాడు సాధారణంగా వుండడు. ఇంకా వీళ్ళకు

ఆ వ్యూహంలో మనుష్యులకు కన్పించకుండా వుండే లోహం జనము లాంటిది దొరకకపోవటం చాలా మంచిదే అయింది. లేకపోతే మనిషి అదృశ్యమైపోయే శక్తి కల్గివున్న తర్వాత మాయాజాలాన్ని ఇంకా ఈ ప్రపంచంలో ఎవరు నేర్చుకుంటారు.

ఆ రాత్రి నలుగురూ మేలుకొనే గడిపారు. ఉదయమైంది. తిరిగి శిథిలగృహంలోకి వెళ్ళటానికి సిద్ధపడ్డారు.

రాజకుమారుడు తేజసింహునితో "నా మంచంమీద వున్న ఇంద్రజాల పుస్తకాన్ని తీసుకొనిరా. అక్కడ మరొకసారి చదివి పని ప్రారంభిద్దాం" అన్నాడు.

తేజసింహుడు పుస్తకాన్ని తేవటానికి మంచం దగ్గరికి వెళ్ళాడు. అక్కడ పుస్తకం కనిపించటంలేదు. మంచం క్రిందా పైనా అంతటా వెదికి చూచాడు. కాని కన్పించటంలేదు. రాకుమారునికి ఆ విషయం చెప్పాడు.

రాజకుమారునికి ప్రాణంలేచి పోయినంత పనయింది. పరుగెత్తి తానుకూడా పుస్తకాన్ని వెదికాడు. ఉంటేగా దొరకటానికి! రాకుమారుడు మంచంమీద పడిపోయాడు. నిరాశ ఆవరించుకొంది. చంద్రకాంతను కలుసుకొనే ఆశ ఇక లేదనిపించింది. మిగతా ముగ్గురు మిత్రులుకూడా గాబరాపడ్డారు. ఎవరినోటినుంచీ మాట పెగలటంలేదు. తర్వాత వెదకటం ప్రారంభమైంది. ఇంద్రజాలం పుస్తకం పోగొట్టుకొనిపోయిన వార్త రాకుమారుని పరివారాన్ని కలవరపరచింది. కాపలా వారి బందోబస్తు అధికతరమైంది. నలుదిక్కులకీ దొంగని వెదకటానికి కొందరు ప్రయాణమయ్యారు.

రాకుమారునితో తేజసింహుడు "మీరు క్రుంగిపోకండి దొంగలను నేను తప్పకుండా పట్టుకుంటాను. మీరు క్రుంగి పోతే మా అందరికీ ఉత్సాహం లేకుండా పోతుంది. పని జర గదు." అన్నాడు. చేతులెత్తి విసతిచేశాడు. రాజకుమారుడు లేచి కూర్చున్నాడు. అదే సమయంలో కాపలావాడొక డొచ్చి విచిత్రమైనవార్త అందించాడు. "వ్యూహ ద్వారం దగ్గర కాపలా వున్నవాడు లోపల చాలామంది మనుష్యులు అలికిడైనట్టు వినిపిస్తోంద"ని చెప్పాడు. యెవరినీ లోనికి వెళ్ళ నివ్వలేదుగదా మరి మనుష్యుల అలికిడి యెందుకొతున్నది? యేమి చెయ్యమంటారు?" అని చేతులు కట్టుకొని నిలబడ్డాడు.

ఆ వార్తవిని తేజసింహుడు ప్రయాణమయ్యాడు. దేవి సింహుని తనవెంట రమ్మన్నాడు. జ్యోతిష్యుడూ, రాకుమారుడు కూడా బయలుదేరారు. త్రోవలోవున్న సేనాపతిని కూడ వెంట తీసుకువెళ్ళారు. వాకిటిదగ్గరకు వెళ్ళేసరికే వాళ్ళకు అరు పులు వినిపించాయి. ముందుకు వెళ్ళినకొద్దీ చాలామంది మనుష్యులున్నట్లు అర్థమైంది. ధ్వనివచ్చేదిక్కుగా నడుస్తు న్నారు. రాతిమానిసి పండుకొనిఉన్న వసారాలోకివెళ్ళారు.

రాతిమానవుడు లేచి కూర్చుండి బదరీనాథ పండితుణ్ణి తన రెండు చేతులతోను నొక్కిపట్టాడు. బదరీనాథుడు కేకల్లు వేస్తున్నాడు. పన్నాలాల్, రాంనారాయణ, చున్నీలాల్ రాతిమానిసి హస్తాలనుండి తమ నాయకుని విడిపించటానికి అనేక ప్రయత్నాలు చేస్తున్నారు. కాని ఫలించలేదు. అతని దురవస్థనుచూచి రాకుమారుని బృందం కడుపుబ్బనవ్వారు.

తేజసింహుడు కవ్విస్తూ "భళే! భళే!! చేసుకున్న వాడికి చేసుకున్నంత! రాకుమారుని అనవసరంగా బాధపెట్టిన ఫలితాన్ని ఇప్పుడనుభవిస్తున్నాడు మీారు తెలిసి తెలిసి యెం దుకు చిక్కుకున్నారోయ్. పన్నాలాల్! మిమ్మల్ని యెవరూ పట్టుకోలేదుగా! మీారు వెళ్ళి హాయిగా గాలికి తిరగండి!" అన్నాడు.

"అయ్యో! మా నాయకుణ్ణి ఇట్లాంటి పరిస్థితులలో విడిచి యెట్లా వెళ్ళటం? మమ్మల్ని మీారు యిష్టంవచ్చినట్లు చెయ్యండి" అన్నాడు పన్నాలాల్.

తేజసింహుడు బదరీనాధుని దగ్గరకు వెళ్ళి "అన్నయ్యా ఇంద్రజాలాన్ని ఛేదించినాకూడా ఏమన్నా ఇవ్వవూ! అంతా నువ్వొక్కడివే తీసుకుంటావా?" అన్నాడు వ్యంగ్యంగా.

జ్యోతిషుకుడు "పండితులుగారూ! మీారోజులు బాగా లేవుగాని; రాత్రి దొంగిలించిన ఇంద్రజాల పుస్తకాన్ని ఇటు ఇచ్చెయ్యండి" అన్నాడు. బదరీనాధుని ముఖాలోని దిగులు ముగ్గురూ రాజకుమారుని దగ్గరకు వెళ్ళి యేదో ఒకవిధంగా బదరీనాధుని రక్షించవలసిందిగా అర్థిస్తున్నారు "సరే! దొంగిలిం చిన పుస్తకాన్ని తిరిగి యిచ్చేస్తే అట్లాగే రక్షిస్తాన"న్నాడు రాకుమారుడు.

పన్నాలాలు బదరీనాధుని క్రీగంటితో చూచాడు. అతడు కంటితో సైగచేశాడు. అప్పుడు రాకుమారునితో "ఆ పుస్తకం మా దగ్గర ఉంటే ఇటువంటి కష్టసమయంలో నైనా ఇవ్వమా ? అది మా దగ్గరలేదు. ఏదైనా ఉపాయంచేసి ఆయనను విడిపించండి. కనీసం . మమ్మల్ని తిండీ తిప్పలూ

తినటానికైనా బయటకు వెళ్ళనివ్వండి. మీకు పుస్తకం దొరికి, వ్యూహాన్ని ఛేదించి, బదరీనాథుని విడిపించేవరకూ మీలో ఒకణ్ణి మా నాయకునికి తిండీ తిప్పలూ తేవడానికి లోనికి బయటికి తిరగనివ్వండి" అని అన్నాడు పన్నానాలు.

తేజసింహుడు "మిమ్మల్ని మేము ఆమాత్రం తెలుసుకో లేమనుకున్నావా ? ఆ పుస్తకాన్ని ఇస్తారా ? లేక కత్తి పుచ్చుకోమంటావా ?" అన్నాడు.

అతని మాటలకు బదరీనాథుడు కోపంతో "ఇప్పుడు మా దుస్థను చూచి యెగరటంకాదు. మేము విడిపించుకున్న తర్వాత దమ్ములుంటే నీ మాయాజాలాన్ని ప్రయోగించు. ఇదిగో చెవుతున్నాను. మేమే ఆ పుస్తకాన్ని తస్కరించేము. చేతనైతే మమ్మల్ని బంధించకుండా ఆ పుస్తకాన్ని తీసుకో చూద్దాం ! నీ గొప్పతనం ఇక్కడకాదు. నీతోడి ఒక ఇంద్రజాలికుణ్ణి బంధించకుండా ఇక్కడకు వచ్చిపోతుండటానికి అనుమతిఇచ్చి మా దగ్గఱనుండి పుస్తకాన్ని రాబట్టుకో, చూద్దాం ! ఆవిధంగా చేసిననాడు మేము నీకు శాశ్వతంగా గులాములౌతాము. శివదత్తుని విడిచి రాకుమారుని పక్షాన చేరతాము. నేను మరొకసారి చెవుతున్నాను. మీరా పుస్తకం ఇవ్వకుండానే యిక్కడనుండి విడిపించుకొని పోతాను." అన్నాడు.

"నేనుకూడా ప్రమాణంచేసి చెవుతున్నాను. మిమ్మల్ని ఖైదుచెయ్యకుండానే ఆ పుస్తకం ఎట్లా రాదో చూస్తాను. ఒక వేళ నేను ఓడిపోతే తలగొరిగించుకొని మరొక దేశం వెళ్ళిపోతాను. ఈ దెబ్బతో మీా సంగతి అటోయిటో తేల్చి

కుంటాను” అని శపథం చేశాడు తేజసింహుడు. అతడు దేవీ సింహుని, జ్యోతిషిక్షణ్ణీ వేరుగా పిలిచి చెవిలో యేదో చెప్పాడు. వాళ్ళిద్దరు అక్కడనుండి వెళ్ళిపోయారు. తిరిగి బదరీ నాథునితో—

“మేము వెళ్ళుతున్నాం. పన్నాలాలుని, రామనారాయణనీ, చున్నీలాలుని యెవ్వరూ అటకాయించరు. వాళ్ళు యిష్టంవచ్చినట్లు లోపలికీ బయటకీ తిరగవచ్చు.” అని చెప్పాడు.

రాకుమారినితో కలసి తేజసింహుడు డేరాలోనికి వచ్చేశాడు. అక్కడ జ్యోతిష్కుడు కూర్చొని వున్నాడు. తేజసింహుడు. “దేవీసింహుడు వెళ్ళాడా?” అని ప్రశ్నించాడు.

“ఆ వెళ్ళాడు.”

“మీరేమైనా చూచారా?”

“అంతుతీసాము గాని, కష్టాల మీద కష్టాలు వచ్చేట్టు వున్నాయి.”

“ఏమిటది.?”

“గవ్వల లెక్క ప్రకారం ఆ పుస్తకం వాళ్ళ చేతుల్లో నుంచి కూడా దాటిపోయినట్లు తెలుస్తుంది. ఆ పుస్తకం ఇంకా యెక్కడా పెట్టినట్లుగా లేదు. అయినా దేవీసింహుడు యేమి చేసి వస్తాడో చూడాలి, మనంకూడా వెళ్ళటం మంచిది. అన్నాడు. జ్యోతిష్కుడు.

“అయితే మీరింకా యెదురు చూడ్డం యెందుకు? వెళ్ళిచూడండి. మీపనిమేం చేస్తాం.” అన్నాడు తేజసింహుడు

జ్యోతిష్కుడు అక్కడనుంచి వెళ్ళాడు. "మీరేం చేస్తున్నారో కాస్త నాక్కూడా చెప్పండి. వాళ్ళనేమో విడిచి పెట్టారు. మీ పంతాలవల్ల నష్టమే జరిగేటట్టు వున్నది." అన్నాడు రాకుమారుడు.

"నాసంగతి మీకింకా తెలియలేదు. ఆ పుస్తకాన్ని మీకు అప్పగించేదిమాత్రం ఖాయం. కాని యిదే సందర్భంలో వాళ్ళను ఓడగొట్టి మన అనుయాయులుగా చేసుకుందామని యీ ఎత్తు వేశాను. లేకపోతే యీ యెత్తులు పైయెత్తులతో యెన్నాళ్ళని జాగ్రత్తగా ఉంటాం." అన్నాడు తేజసింహుడు.

"నువ్వు అపజయం పొందితే నిజంగానే నన్ను విడిచి పెట్టి వెళ్ళిపోతావా ?" అన్నాడు రాకుమారుడు

"నిస్సంశయంగా, అప్పుడు మీముఖంకూడా చూడను"

"అయితే నువ్వు ఓడిపోవటం, నేను చావటమూ? భలేస్నేహం! సరేగాని వాళ్ళెక్కడికి వెళ్ళారో చెప్పు" అన్నాడు రాకుమారుడు.

"ఇప్పుడేమీ చెప్పను: మీరుమాత్రం భయపడకండి. మీరిక్కడే వుంటే నేను రెండుగంటల్లో తిరిగొస్తాను. "అని తేజసింహుడు వెళ్ళిపోయాడు. సేనాపతికూడా రాకుమారుని విడిచి వెళ్ళాడు.

ఎవరు విజయాన్ని సాధిస్తారో చూడాలి.

# 27

రాజకుమారుడు ఒంటరిగా తన అనుయాయులకొరకు ఎదురుచూస్తూ కూర్చున్నాడు. ఎవరైనా వస్తారేమోనని అప్పు

డవ్వాడు డేరాబైటికి వెళ్ళిచూచి నిరాశతో కాలం గడుపుతు న్నాడు. సాయంకాల మవుతున్నప్పటికి, అతనిస్నేహితులెవ్వరూ తిరిగిరాలేదు. అతనికి కూర్చోవటానికి కూడా బుద్ధిపుట్టక డేరా బయటికి వచ్చేశాడు. రాకుమారుడు బయటికి రావటంచూచి చాలా మంది అపరాధులు అతని యెదుటకువచ్చి నిలబడ్డారు. ఆ సంగతి తెలిసి ప్రక్కడేరాలో వున్న సేనాపతి సైనిక దుస్తు లతో వచ్చి రాకుమారుని ప్రక్కన నిలబడ్డాడు. ఇద్దరూ కలసి చాలాదూరం వెళ్ళిన తరువాత రాకుమారుడు సేనాపతితో "చంద్రకాంత ఇంద్రజాలంలో చిక్కుకొని యెక్కడ మరణి స్తుందో" అని విచారించసాగాడు.

ఫతహసింహుడు "మీరేమీ విచారించవద్దు. మన తేజ సింహుడు తెలివి తక్కువవాడేమీ కాడు. ఇవాళ అతను బదరీ నాథునితో పందెమునకు దిగటమే మంచిదైంది. దానివల్ల వాళ్ళంతా మనవశానికే వచ్చే అవకాశం కల్గింది. ఇవాళ పరిస్థితి అంతా నాకు తెలిసింది. చాలా గట్టి యేర్పాటు చేశాడు. నాకు కూడా ఒక పని చెప్పితే అది పూర్తిచేశాను" అని అన్నాడు.

మాటల సందర్భంలో వాళ్ళదృష్టి సమీపాన గల స్త్రీలపై బడింది. ఆ స్త్రీలను చెట్ల సందుగుండా మానంగా చూస్తున్నారు.

అక్కడ రమారమి ఇరవైమంది స్త్రీలు ఉండిఉంటారు. వాళ్ళు తమ తమ గుఱ్ఱాల కళ్ళాలు లాగి పట్టి నెమ్మది, నెమ్మ దిగా ఆ వైపే వస్తున్నారు. ఒక స్త్రీ చేతిలో రెండు గుఱ్ఱాల కళ్ళాలు వున్నాయి. కావటానికి స్త్రీలంతా ఒకరిని మించిన

అందగత్తెలు ఒకరు అయినా అందరికంటే ముందు ఉన్న స్త్రీ ఇంకా ఎక్కువ అందంగానూ, సుకుమారంగానూ ఉన్నది. ఆమెకు దాదాపు పదహారు సంవత్సరాల కంటే ఎక్కువవుండవు. ఆమె వేషభూషణాల్లో మహారాజ పుత్రికను పోలిఉన్నది. ఆపాదమస్తకం రత్నాలంకృతం ఉన్నది. దూరాననుంచి ఆమె అవయవ సౌందర్యం, వికసిత వదనం మటీ ఆకర్షణీయంగా ఉన్నాయి.

వీరేంద్రసింహ యువరాజు తదేకదృష్టితో ఆ సుందరిని చూడటం ప్రారంభించాడు. అటువంటి కష్టసమయంలోకూడా అతని నోటినుండి "అబ్బా! ఏమి సౌందర్యం! చంద్రకాంతను అనేక విధాల పోలియున్నది. చేతిలో పుస్తకం ఉండటాన్ని బట్టి విద్యావతికూడా అయిఉంటుంది." అనే మాటలు వెలువడ్డాయి.

ఆ స్త్రీలు ఇంకాదగ్గిరికివచ్చారు. యువరాజుకు వాళ్ళను స్పష్టంగాచూచే అవకాశం కలిగింది. యువరాజు, సేనాపతీ ఉన్నచోటు చెట్లు గుబురుగా ఉండటంవల్ల ఇతరులెవ్వరికి కనుపించదు. ఆ స్త్రీలందరికి ముందు భాగానవున్నకన్య హఠాత్తుగా ఆగి పుస్తకం తెరచి కన్నీరు కార్చసాగింది,

ఆమె చేతిలోవున్న పుస్తకం ఇంద్రజాలం పుస్తకమేనని రాజకుమారుడు గుర్తు పట్టాడు. అతడు "ఈ పుస్తకాన్ని ఇంద్రజాలికులు దొంగిలించారు కదా! ఈమె చేతిలోకి ఎట్లా వచ్చింది? ఈమె ఎవరు? పుస్తకంచూసి ఏడుస్తున్నదిఎందుకు?" అని ఆలోచించసాగాడు.